# గోమాత

## గోమహాలక్ష్మీపై అనేక విషయాలు తెలుసుకోండి

ఆధ్యాత్మిక జ్యోతిష,
వాస్తు, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...
ఫేస్‌బుక్ - మోహన్ పబ్లికేషన్స్
పేజ్ లైక్ చేయండి.









Like us to follow :

**MOHAN PUBLICATIONS**

# గోమాత - జగన్మాత

సంకలనం

**డా॥ నొస్సం నరసింహ ఆచార్య**






FACEBOOK / MOHAN PUBLICATIONS

# ముందుమాట

**సర్వకామదుఘేదేవి సర్వతీర్థాభిషేచిని ।**
**పావనీ సురభీ శ్రేష్ఠీ దేవి తుభ్యం నమోऽస్తు తే ॥**

సనాతన వైదిక సంస్కృతి సంప్రదాయాల్లో గోవుకు ఒక విశేషస్థానం ఉన్నది. సకలతీర్థయాత్రలు చేస్తే వచ్చే పుణ్యం, సకలతీర్థాలలో స్నానం ఆచరిస్తే వచ్చే పుణ్యం, సకలపూజలు చేస్తే వచ్చే పుణ్యం గోవుకు ఒక్క ప్రదక్షిణం చేస్తే లభిస్తుంది.

హైందవ సంప్రదాయం ప్రకారం గోవును గోమాతగా వ్యవహరిస్తారు. ''గావో విశ్వస్య మాతరః''–''గోమాత జగన్మాత'' అని వేదాలు ప్రతిపాదిస్తున్నాయి. వేదవాఙ్మయము గోవును ధర్మదేవతగా, ప్రస్తుతిస్తూ గోమాత యందు ముక్కోటి దేవతలు కొలువైవున్నారని పేర్కొంటుంది. పురాణేతిహాసాలలో కూడా గోవుయొక్క ప్రాధాన్యం చక్కగా వివరించబడివున్నది.

తిరుమల తిరుపతి దేవస్థానములు గోమాతయొక్క ప్రాధాన్యాన్ని వివిధ కోణాలలో తెలియజేస్తూ ఈ గ్రంథాన్ని ముద్రిస్తున్నది. ఈ గ్రంథంలో వేదాలలో గోవు, గోసేవాఫలం, గోదానఫలం, గోపద్మవ్రతం, పంచగవ్య విశేషాలు, గోఆధారిత ఔషధాలు, గోఆధార ఉత్పత్తులు, గోసంరక్షణ, భారతీయసంతతికి చెందిన గోవుల విశేషాలు, మనదేశంలోని ప్రముఖ గోసేవాసంస్థలు, దేశవిదేశల్లో గోమాతపై వెలువడిన గ్రంథాలు మొదలైన అనేక విషయాలను కూలంకషంగా చర్చించడం జరిగింది.

గోమాత – జగన్మాత అనే ఈ గ్రంథాన్ని తెలుగు, హిందీ, ఇంగ్లీషు, భాషలలో ఒకేసారి ముద్రించడం జరుగుతూంది. ఈ గ్రంథ సంకలనంలో

తమ సంపూర్ణ సహాయసహకారాలందించిన విశ్వమంగళ గో్రగ్రామయాత్ర, ఆంధ్రప్రదేశ్ వారికి మరియు విశ్వహిందూపరిషత్ క్షేత్ర గోరక్షాప్రముఖ్ శ్రీ యాదగిరిరావు గారికి హృదయపూర్వక ధన్యవాదాలను తెలియజేస్తున్నాము.

వివిధ ఆకరాల ఆధారంగా ఈ గోమాత – జగన్మాత అనే గ్రంథాన్ని సంకలనం చేసిన డా॥ నొస్సం నరసింహాచార్య (తి.తి.దేవస్థానముల ఉపసంపాదకులు) గారికి మా కృతజ్ఞతలు.

గోమాత – జగన్మాత అనే ఈ గ్రంథం పాఠకలోక విశేష ఆదరణను పొందుతుందని ఆశిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు,

తిరుపతి

**ఒక్క క్షణం...**

సృష్టిని చుట్టి రావాలని బాలగణపతి, తమ్ముడు కుమారస్వామి పందెం వేసుకున్నారట! శక్తినంతా కూడగట్టుకొని – పరుగెత్తి, పరుగెత్తి రొప్పుతూ, రోజుతూ – అలసి సొలసి బయలుదేరిన చోటికే వచ్చి – అమ్మయ్యా! అనుకున్న కుమారస్వామికి తల్లి పార్వతి ఒళ్ళో ముసిముసి నవ్వుల్లో ఒద్దికగా కూర్చున్న అన్న గణపతి కనిపించాడట! అదేమంటే విజయరహస్యం తెలిసిన వినాయకస్వామి సృష్టిస్వరూపులే అయిన తల్లిదండ్రులు పార్వతీ పరమేశ్వరుల చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేసి ముచ్చటగా ముందే పందెం గెలిచాడట!

ఇది పురాణగాథే అయినా నేటి మన భారతీయుల స్థితికి చక్కగా అద్దం పట్టినట్టుంది కదూ! దేశాన్ని సమృద్ధవంతం చేయాలని ఎన్నెన్నో పథకాలు, ఎన్నెన్నో నిర్మాణాలు, ఎంతెంతో భారీ వ్యయాలు, ఉన్నది చాలక విదేశాల నుండి లక్షలాది కోట్ల అప్పులు! కాని భగవంతుడు మనను పుట్టించడానికి ముందే మనకోసం, మన బ్రతుకుకోసం చక్కని ఏర్పాట్లు చేసి ఉంచాడు. మనకంటే ముందు గోమాతను పంపించాడు. ఆ తల్లి కరుణా కటాక్షాలతో సకల సంపదలతో మన భారతావని పూర్వం అతి వైభవంగా విరాజిల్లింది. వేదాలు, పురాణాలు, సకల శాస్త్రాలు ఆమెను కొనియాడాయి. గోమాతను ప్రత్యక్షదైవంగా ఈ దేశం స్వీకరించింది!

అట్టి సకల సంపదలనిచ్చే గోమాతను నేడు సమాజం విస్మరించింది. నిర్లక్ష్యం చేస్తున్నది. ప్రభుత్వాలు పట్టించుకోవడం లేదు. అత్యాశాపరులేమో దానిపై హత్యా రాజకీయాలు చేస్తున్నారు. పాల నదులు ప్రవహించిన ఈ బంగారు గడ్డపై పాపాల నదులు, గోమాత రక్తపుటేరులు పారుతున్నాయి. తనవారే తనను ఈసడించుకోగా వారి అజ్ఞానానికి, మూర్ఖతకు జాలి పడుతోంది. ఆ తల్లి... అయినా తన బిడ్డలపై ఆ పిచ్చి తల్లికి కోపంలేదు.

# విషయ సూచిక

*నేడు మనం ఆర్థిక ప్రధానమైన యుగంలో జీవిస్తున్నప్పటికీ దేశాన్ని బలోపేతం చేయడంలో ఆర్థికరంగం వలెనే భౌగోళిక, కుల, భాషా, రాజకీయ, సామాజిక అంశాలు కూడా ఎంతో ప్రముఖమైనవి. అంతేకాక ధార్మిక, సాంస్కృతిక ఏకత్వం మరింత ప్రాధాన్యం వహిస్తుంది. ఈ చిన్ని పుస్తకంలో ఆర్థిక దృష్టితో గోవు యొక్క ప్రయోజకత్వాన్ని వివరిస్తూనే అంతకన్న ముందుగా భారతదేశంలో ప్రత్యేకించి గోవుయొక్క ధార్మిక, సాంస్కృతిక విలువలను సంక్షిప్తంగానైనా పరిశీలించడం సబబుగా ఉంటుంది. ఆధునిక మానవుడు ఎంత ఆర్థికపరమైన జీవితం గడుపుతున్నప్పటికీ అతడు తన జీవితంలోని ఏదో ఒక దశలో – ప్రారంభం, మధ్య, లేదా చివరిదశలోనైనా ధర్మ సంస్కృతుల ప్రభావానికి స్పందించే అవకాశం లేకపోలేదు.*

## ఆవు మన శ్రద్ధాకేంద్రం - మన తల్లి

వేదకాలంలో సత్యము, జ్ఞానము – ఇవి రెండు మూలభూత ధర్మాలు. ఈ రెండింటి సాధనలో భాగమే గోభక్తి. ఋగ్వేదంలోని గోసూక్తానికి సంబంధించి భరద్వాజ మహర్షి ఇలా అంటారు – “గోవులు ఐశ్వర్యం. గోవులే నాకు ఇంద్రాది దేవతలు. గోవు సోమరసము యొక్క మొదటి గుటక (ఘూంట్). ఇంద్రుని ప్రతినిధులైన గోవులను నేను నా హృదయ పూర్వకంగానూ, మనఃపూర్వకంగానూ ప్రేమిస్తాను”. ఈ మంత్రంలో గోవుయొక్క ఆధ్యాత్మిక, భౌతిక అర్థాలు రెండూ కలిసి ఉన్నాయి. ఆ తర్వాతి సాహిత్యం – పురాణాలు, స్మృతులు, ధర్మశాస్త్రాలలో గోభక్తి అతిస్పష్టంగా నిరూపించబడింది. గోహత్య మహాపాతకంగా చూడబడింది. అథర్వ వేదంలోని గోసూక్తంయొక్క మొదటి మంత్రంలో “మాతా రుద్రాణాం, దుహితా వసూనాం స్వసాఽఽదిత్యానామమృతస్యఽఽనాభిః।... మా వధిష్ట” అంటే “గోవు రుద్రులకు తల్లి, వసువుల కూతురు, ఆదిత్యుల సోదరి, అమృతం

యొక్క నాభి! గోవును చంపవద్దు" అని చెప్పబడింది. ఇదే సూక్తంలో మరోచోట "ధేనుః సదనమ్ రయీాణామ్" అని చెప్పబడింది. అంటే "గోవు సకల సంపత్తులకు నిలయము". మరోరకంగా చెప్పాలంటే జగత్తులోని సమస్త పదార్థాలకు తల్లివంటిది గోవు అని అర్థం.

ఆర్ష సాహిత్యంలో – పాణిని వ్రాసిన అష్టాధ్యాయిలో వ్యవసాయానికి తోడుగా గోచర భూమి కూడా ఉల్లేఖించబడింది. పాణిని కాలంలో – అంటే క్రీ.పూ. 2800 నుండి 500 వరకు – ఏ ప్రదేశంయొక్క సుఖసంపదలనైనా గణించడానికి ప్రమాణం ఆ ప్రదేశపు గోసంపదే. స్మృతుల కాలంలో పంచగవ్యం వ్యాప్తిలో ఉంది. దానిని పరమ పవిత్రమైన ప్రసాదంగా భావించారు. రఘువంశానికి చెందిన దిలీప మహారాజు యొక్క గోభక్తి జగత్ప్రసిద్ధము. వారు నీడలా గోవు వెనువెంట నడిచేవారు. నందిని తనను గురించి "నేను ప్రసన్నురాలనైతే కేవలం పాలివ్వడమే కాదు సకల మనోవాంఛలను అనుగ్రహిస్తాను" అంటూ వాస్తవాన్ని చెప్పింది. గోపాలకృష్ణుని జీవితచరిత్ర భారతీయ విలువలపై చెరగని ముద్ర వేసింది. సిక్కు, జైన, బౌద్ధ గ్రంథాలలో జీవరాసులన్నింటిపైనా కరుణ, అహింసలు ప్రతిపాదింపబడి ఉన్నాయి. ఆదినాథుడే ఋషభదేవుడు. సింధులోయ మరియు హరప్పాలలో లభించిన నాణాలపై ఋషభుని చిత్రం కనిపిస్తుంది. సామవేదం ఇలా అంటుంది. "సదా గావః శుచయో విశ్వధాయసః". అంటే "గోవులు సదా పవిత్రములు మరియు సర్వజన కళ్యాణ కారకములు" అని అర్థం.

అథర్వ వేదంలోని గోసూక్తానికి అనుబంధంగానే స్కాందపురాణంలో గోవు "సర్వదేవమయీా, సర్వతీర్థమయీా" అని వర్ణింపబడింది. గోరజం కాస్త నుదుటికి రుద్దుకుంటే చాలు సమస్త పాపాలనుండి, దోషాలనుండి

ముక్తి లభిస్తుంది. వత్సల అంటే తన దూడను ఆప్యాయంగా ప్రేమించేది గోవు. 'సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్' – 'బలమున్నవాడికే బ్రతికే హక్కు' – అని నమ్మే ఐరోపీయ సమాజాలకు "సర్వే జనాః సుఖినో భవన్తు..." (అందరు జనులూ సుఖంగా ఉండాలి, ఆరోగ్యంగా ఉండాలి, ఆనందంగా ఉండాలి) ఈ దృష్టికోణం అవగాహనకు అందని అంశమే అవుతుంది.

గోవు భారతీయ సభ్యత, సంస్కృతి మరియు జాతీయ జీవనంతో ముడిపెట్టుకొని ఉన్న అంశం. గోవుపట్లగల సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ దృష్టి కోణాలన్నీ ఈ దేశవాసుల ప్రధాన వృత్తి అయిన వ్యవసాయంతో ముడిపెట్టుకొని ఉన్నాయి. భారతీయ సంస్కృతి యొక్క మూలాధార విశ్వాసం 'ఏకమ్ సత్ విప్రాః బహుధా వదన్తి' – 'ఒకే సత్యాన్ని బుద్ధిమంతులు అనేక విధాలుగా పిలుస్తారు' అన్నది.

ధ్యేయ వాక్యమైన కారణంగా ఇచ్చటి సమాజ సహజీవనం యొక్క అందరూ అంగీకరించే ఆధారం 'అహింస'గా పరిగణించబడింది. భారతీయులకు గోపూజ ఆత్మబోధకు ఉపకరించే ఒక సనాతన మార్గము. పరంపరాగతమైన భారతీయ సమాజానికి ప్రతీక గోవు. అది అహింసా ప్రధానము, ఆత్మబోధాత్మకమేగాక సనాతన భారతీయ సంస్కృతి యొక్క సంవర్ధనకై సమాజంలో సామూహిక స్ఫూర్తిని అది అందిస్తుంది. అందువల్లే యజుర్వేదం ఇలా అంటుంది. 'గోః మాత్రా న విద్యతే' అంటే 'గోవు చేసే ఉపకారాలకు అంతమే లేదు' – అది మనకెంతగానో మేలు చేస్తుంది.

ధార్మిక, సాంస్కృతిక దృష్టితో పరిశీలించినప్పుడు గోవు అనాదికాలం నుండి హిందూ సమాజానికి అత్యంత ప్రీతి పాత్రము, శ్రద్ధా కేంద్రము, పూజార్హము. అహింసా ప్రధానమైన మన సంస్కృతికి గోమాత కేంద్రబిందువుగాను నిలిచినట్లు దర్శనమిస్తుంది. అంతేగాక గోవు మన

సామాజిక, ఆర్థిక జీవనానికి వెన్నెముకగానూ నిలిచినట్లు బోధపడుతుంది. గోరక్ష, గోసేవ వీటిని మన సామాజిక ఆకాంక్షలలో ఒక విడదీయలేని భాగంగా గుర్తించాము.

## వేదాలలో గోవు

### ఋగ్వేదము

గోవుయొక్క పాలు, పెరుగు, నెయ్యి, మూత్రము, పేడ (గోమయము) వీటిని పంచ గవ్యములు అని అంటారు. ఇవి పౌష్టికాహారములే గాక అద్భుతంగా పనిచేసే దివ్యౌషధాలు, అమృత తుల్యములు. 'అమృతస్య నాభిః'

### యజుర్వేదం

'గో సమానా న విద్యతే' – ప్రపంచంలోని ప్రాణులు అన్నిటికంటె ఆద్యంతము మనకు ఉపయోగపడేది గోవు మాత్రమే.

### సామవేదం

గోవునుండి లభించే ప్రతిపదార్థమూ పవిత్రమే. అందుకే గోవు మన శరీరాన్ని, మనస్సును, బుద్ధిని కూడా పవిత్రం చేస్తుంది. పర్యావరణంలోని కాలుష్యాన్ని శుద్ధి చేస్తుంది. గోవు ('సదా గావః శుచయః')

### అథర్వవేదం

'ధేను స్సదనం రయీణామ్' ఐశ్వర్యాలకు నిలయం గోవు – అష్టైశ్వర్యాలు గోవులో చోటుచేసుకున్నాయి. గోలక్ష్మితో రైతు ధనవంతుడవుతాడు. పాడిపంటలను అనుభవిస్తాడు.

**'గౌరగ్నిహోత్రమితి ప్రాణాపానాభ్యామేవాగ్నిగ్ం**
**సమర్థయతి అవ్యర్ధుకః ప్రాణాపానాభ్యాం భవతి య ఏవం వేద'.**

అగ్నిహోత్రుని సామర్థ్యం వల్ల గోవు సృష్టించబడింది. బ్రహ్మదేవుడు అగ్ని, వాయువు, ఆదిత్యులను సృష్టించాడు. బ్రహ్మ మానవులను హోమం ద్వారా సృష్టించాడు కనుక మనం కూడా హోమం చేసి సృష్టి చెయ్యాలని అగ్ని, వాయువు, ఆదిత్యులు హోమం చేశారు. 'ప్రాణానామగ్నిః తను వై వాయుః చక్షురాదిత్య' అని అలా ఆ ముగ్గురూ హోమం చెయ్యగా గోవు పుట్టిందట - అప్పుడు ' ఆ గోవుపాలు ఎవరికి చెందాలి? వాటిని ఎవరు అనుభవించాలి? అనే విషయంలో ఆ ముగ్గురికీ వివాదం ఏర్పడింది. ' నా సహాయం వల్లనే ఈ గోవు పుట్టింది కనుక నేనంటే నేనే అనుభవించాలి' అని ముగ్గురూ వాదించు కున్నారు. అలా ఏ పరిష్కారానికి రాలేక తీర్పు చెప్పుమని బ్రహ్మ దగ్గరకు వెళ్లారు. ఎవరు ఏ విధంగా హోమం చేశారని అడిగాడు బ్రహ్మ. నేను ప్రాణదేవతను హోమం చేశానన్నాడు అగ్ని. శరీరాభిమాని దేవతకి హోమం చేశానన్నాడు వాయువు. చక్షుస్సులకి హోమం చేశానన్నాడు ఆదిత్యుడు. 'ప్రాణేభ్యః స్వాహా' అని అగ్ని హోమం చేశాడు కనుక ఈ గోవు అగ్నికే చెందుతుందని బ్రహ్మదేవుడు తీర్పు చెప్పాడు. ప్రాణం లేకుంటే ఇంద్రియాలకు, శరీరానికి పని ఏముంది? 'ప్రాణముంటేనే గదా ఏమైనా?' అనే బ్రహ్మగారి వాదనను కాదనలేకపోయారు వాయువు, ఆదిత్యుడు. అగ్ని హోమం వల్ల పుట్టింది కనుక గోవుకు అగ్నిహోత్రత్వం ఉంది. గోవంటే సాక్షాత్తు అగ్నిస్వరూపమే. అగ్నివల్ల ఋగ్వేదం, వాయువువల్ల యజుర్వేదం, ఆదిత్యునివల్ల సామవేదం పుట్టాయి. అందుచేత అగ్ని, వాయువు, ఆదిత్యుల సామర్థ్యాల వల్ల జన్మించిన గోవును పూజిస్తే, పోషిస్తే మూడు వేదాల అధ్యయనఫలం, అగ్నిహోత్రఫలం లభిస్తుంది. గో పోషణ చేస్తే అగ్నిహోత్ర కర్మానుష్ఠానంవల్ల కలిగే ఫలం వస్తుందని వేదాల్లో చెప్పబడింది.

'సూర్యోఽ తివిద్యయా త్రయ్యా హవిషాగ్నేయ జేతమాం ఆతిథ్యేన తు విప్రాగ్నే- గోష్వంగ యవసాదినా' 'గావో విశ్వస్య మాతరః' గోవు విశ్వానికే మాత - అని ప్రసిద్ధి చెందింది. అందుకే పూర్వులు దీనిని సేవించి ధర్మార్థ కామమోక్షాలు పొందారు.

ఆయుర్వేద గ్రంథాలు చరకము, సుశ్రుతము, ధన్వంతరి, భావ ప్రకాశాదులు ఆవువల్ల కలిగే లాభాలను లెక్కించలేమని పేర్కొన్నాయి.

ఉపనిషత్తులను గోవుగను, శ్రీకృష్ణుని గోపాలునిగను, ఉపనిషత్తుల సారాంశమైన గీతామృతమును పాలుగను, అర్జునుని దూడగను, జ్ఞానిని భోక్తగను పోలుస్తారు. శ్రీకృష్ణుని గోవిందుడు, గోపాలుడు, గోపాలకృష్ణుడు అని కీర్తిస్తున్నాము. పంచపాండవుల్లో సహదేవుడు 'పశువైద్య' శాస్త్రాన్ని రచించాడు.

గోవు యొక్క పుణ్య నామమును ఉచ్చరించువాడు పుణ్యాత్ముడు అవుతాడు. గోబ్రాహ్మణ హింస జరిగే చోట అబద్ధమాడవలసి వచ్చి అబద్ధ మాడినా దోషం లేదని వ్యాసభారతం చెప్పింది.

'సూర్యోగ్ని ర్బ్రాహ్మణో గావః వైష్ణవః ఖం మరుజ్జలం' సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు, గోవు మొదలైన పదకొండు స్థానములు అధిష్ఠానములని భాగవతంలో చెప్పబడ్డాయి. సూర్యోపాసన వేద త్రయముతో చెయ్యాలి - అగ్ని ఉపాసన హవిస్సులతో చెయ్యాలి- బ్రాహ్మణులకు అతిథి మర్యాదలు చెయ్యాలి- గోవుల సంరక్షణ చెయ్యాలి. వీటిని చేస్తేనే నేను సంతోషిస్తానని శ్రీకృష్ణుడు చెప్పాడు.

**కామధేనువు**

దేవదానవులు క్షీరసాగరమథనం చేసే సమయంలో అమృతమునకు తోడు కల్పవృక్షం, కామధేనువు, శ్రీమహాలక్ష్మి కూడా వెలువడ్డాయి. కామ

ధేనువు అంటే కోరిన వాటిని ఇచ్చే ధేనువు అని అర్థం. అట్టి కామధేనువు సంతానమే గోవు - దాని సంతానమే ధర్మస్వరూపము గల వృషభం. అదే శివుని వాహనమైన నంది. ప్రపంచంలోని పశుగణం కామధేనువు నుండి మనకు సంప్రాప్తమయిందని పురాణాలు చెబుతున్నాయి. దేవతలకు, ఋషులకు, అవసరమైన పాలను ఇచ్చే మహత్తర శక్తిగలది ఈ దేవత.

పవిత్రమైన గోవుకు మూడు పేర్లున్నాయి. 1) కామధేనువు, 2) సురభి 3) నందిని. ఈ మూడూ మూడు రకాల ఆవులు కావని తెలుసుకోవాలి. ఈ విషయం వ్యాసభారతం (అరణ్యపర్వం, అధ్యాయం 9, 7-17 శ్లోకాల్లో)లో చెప్పబడింది. దీనిలో సురభి, కామధేనువు అనే పేర్లు గోవులకు పెట్టబడ్డాయి. వ్యాసభారతం ఆదిపర్వంలో అధ్యాయం 99 (ప.14)లో నందిని అనే పేరు ఆవుకు పెట్టబడింది. పురాణాల్లో సురభిని దక్షుని కుమార్తెగా, కశ్యపుని భార్యగా వర్ణించారు. సురభికి రోహిణి, గాంధర్వి పుట్టారు. ప్రపంచంలో రోహిణి ద్వారా ఆవులు, గాంధర్వి ద్వారా గుఱ్ఱాలు పుట్టాయి.

**కామధేనువుకు దైవిక శక్తులు ఎలా వచ్చాయి?**

**(మహాభారతం అనుశాసనిక పర్వం, అధ్యాయం 99)**

పూర్వం కశ్యప మహాముని భార్య అదితి మహావిష్ణువును తన గర్భంలో పెంచింది - ఒంటి కాలిపై నిలబడి తపస్సు చేసింది. ఆ సమయంలో సురభి కైలాసానికి వెళ్ళి బ్రహ్మకోసం పదివేల సంవత్సరాలు తపస్సు చేసింది. దేవతలు ఆమె తపస్సుకు మెచ్చి బ్రహ్మతో కలసి సురభి దగ్గరకు వచ్చి 'సురభీ! నీకు మేము దేవతాపదవి నిస్తున్నాము. నీవు స్వర్గం, భూమి, నరకం ఈ మూడు లోకాలకు పైనుంటావు. అదే గోలోకంగా ప్రసిద్ధి పొందుతుంది.

ప్రజలంతా నిన్ను కొలుస్తారు. గోవులంతా నీకు చెందినవే' అని చెప్పారు. పురాణాల్లో వసిష్ఠుని ఆశ్రమంలో ఒక కామధేనువు, వరుణునితో ఒక కామధేనువు, మరొకటి క్షీరసాగరమథనంలో పుట్టినది.

వ్యాసభారతం, ఉద్యోగపర్వం, అధ్యాయం 102లో బ్రహ్మ అమృతాన్ని ఎక్కువగా త్రాగితే, నోటినుంచి కారిన నురుగులో నుంచి కామధేనువు పుట్టిందని, అది 'రసాతల' లోకంలో నివసిస్తుందని చెప్పబడింది.

ఒకనాడు శ్రీకృష్ణుడు,రాధ ఏకాంతప్రదేశంలో విహరిస్తూండగా అలసిపోయి పాలు తాగాలనిపించిన సమయంలో శ్రీకృష్ణుడు తన ఎడమచేతి ప్రక్కనుండి తన మనశ్శక్తితో సురభి అనే ఆవును, మనోరథమనే దూడను సృష్టించాడు. ఆవుపాలు పితికి త్రాగుచుండగా చేతిలోని కుండ జారి క్రింద పడి పాలు నేలమీద ఒలికిపోయాయి. ఆ పాలు వంద యోజనాలు విస్తరించి ఒక నదిగా పారాయి. దానిలో రాధ ఆమె చెలికత్తెలు స్నానం చేసి ఆనందించారు. అక్కడ లెక్కలేనన్ని ఆవులు పుట్టాయి. వాటిని శ్రీకృష్ణుడు గోపికలకు బహుమతిగా ఇచ్చాడు. (దేవీభాగవతం - 9వ స్కంధం) ఈ విధంగా కామధేనువులు ఆశ్రమాల్లో ఉన్నట్లు పురాణాల్లో కనిపిస్తాయి.

బ్రహ్మ కృపతో కామధేనువులకు దైవికమైన శక్తులు లభించాయి. కశ్యప ప్రజాపతి కుమార్తె కామధేనువు నుంచి అనేక కామధేనువులు ఉద్భవించాయి. శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతాన్ని గొడుగుగా మార్చి గోవులను కాపాడి, ఇంద్రుని జయించాడు. అప్పుడు కామధేనువు గోకులానికి వచ్చి క్షీరంతో శ్రీకృష్ణునికి అభిషేకం చేసిందని భాగవతం 10వ స్కంధంలో ఉంది.

## కార్తవీర్యార్జునుని గర్వభంగం చేసిన సురభి

సప్తఋషులలో ఒకరైన జమదగ్ని రేణుకను వివాహం చేసుకుని, హోమధేనువు సురభిని సంపాదించి దాని మహిమతో సుఖజీవనాన్ని

సాగించాడు. అపకారికి ఉపకారం చేసే సుగుణశీలి, కరుణాసముద్రుడు జమదగ్ని.

కార్తవీర్యార్జునుడు సైన్యంతో ఒకసారి జమదగ్ని ఆశ్రమానికి వస్తాడు. అతని రాకకు సంతోషించి హోమధేనువు సహాయంతో షడ్రసోపేతమైన విందు ఏర్పాటు చేస్తాడు. కార్తవీర్యార్జునుడు అందుకు సంతోషించి ఆ సురభి తనకు కావాలని కోరుతాడు. జమదగ్ని నిరాకరిస్తాడు. అందుకు కోపించిన కార్తవీర్యార్జునుడు జమదగ్నిపై యుద్ధం ప్రకటించగా, జమదగ్ని సురభి సహాయంతో సైన్యాన్ని సృష్టించుకుని యుద్ధం చేస్తాడు. ఘోరయుద్ధం జరుగగా సురభి సైన్యం ముందు రాజుసైన్యం ఓడిపోతుంది. 24సార్లు యుద్ధం చేయగా అన్నిసార్లూ రాజు ఓడిపోతాడు. ఇంకేమీ చేయలేక జమదగ్నిని సంహరించి, ధేనువు కోసం చూడగా, ధేనువు అక్కడి నుంచి మాయమైపోతుంది. ఈ విషయం తెలుసుకున్న భృగుమహర్షి జమదగ్నిని బ్రతికిస్తాడు. ఆ విధంగా సురభి కార్తవీర్యార్జునుని గర్వం అణుస్తుంది.

ఒకసారి జమదగ్ని మహర్షి తన తపోమహిమతో గోలోకానికి వెళ్లి కామధేనువును మెచ్చుకుంటే, ఆమె తన చెల్లెలు సుశీలను జమదగ్నికిచ్చింది. అగ్నిపురాణం 18వ అధ్యాయంలో కామధేనువు అజస, ఏకపాత్, అహిర్ బుధ్ని, త్వష్ట, రుద్ర, విశ్వరూప అనే సంతానాన్ని కన్నట్లు చెప్పబడింది.

**సత్యవ్రతుడు (త్రిశంకుడు) కామధేనువును దొంగిలించుట**

సత్యవ్రతుడు ఇక్ష్వాకు వంశీయుడైన రాజు. అరుణకుమారుని కుమారుడు. అతడు కుటిలుడు. అవినీతిపరుడు. ఒక రోజు ఒక బ్రాహ్మణ నవ వధువును వివాహానికి ముందుగా వశపరచుకుని అనుభవించాడు. దానితో అతని తండ్రి కోపించి అతనిని రాజభవనం నుంచి పంపేశాడు. అతడు దిక్కుతోచక అడవులపాలయ్యాడు. అప్పటినుండి ఆ రాజ్యంలో కరువు

కాటకాలు సంభవించాయి. మనుష్యులు, జంతువులు ఆకలితో చనిపోవ సాగాయి. ఆ సమయంలో విశ్వామిత్రుడు తన ఆలు బిడ్డలను వదలి ఘోర తపస్సులో ఉన్నాడు. ఆ సమయంలో క్లిష్టపరిస్థితుల్లో నున్న కుటుంబపోషణ నిమిత్తం విశ్వామిత్రుని భార్య తమ సంతానంలో ఒక కుమారుణ్ణి అమ్మకానికి పెట్టాలని బయలుదేరుతుండగా సత్యవ్రతుడు వచ్చి 'మీ కుమారుని అమ్మ వద్దు. నేను ప్రతిదినం కొంత మాంసం తెచ్చి మీకు ఇస్తాను. దానితో వారిని బ్రతికించండి' అని ఆదుకున్నాడు. ప్రతిరోజూ అలాగే చేశాడు. ఒక రోజు అతనికి మాంసం దొరకలేదు. అందుకని వసిష్ఠుని ఆశ్రమం లోని కామ ధేనువును దొంగిలించి, చంపి, తాను కొంత మాంసం తిని, తక్కిన దానిని విశ్వామిత్రుని కుటుంబానికిచ్చాడు.

మర్నాడు వసిష్ఠుడు ఈ విషయాన్ని తన దివ్యదృష్టితో గ్రహించి సత్యవ్రతుణ్ణి శపించాడు. సత్యవ్రతుడు మూడు తప్పులు చేశాడు. అవి ఆవును చంపడం, పరాయి స్త్రీని పొందడం, తండ్రికి అమర్యాద తేవడం. ఈ మూడు పాపాల ఫలితం అతడిని త్రిశంకునిగా శపించాడు. కామధేనువును బ్రతి కించాడు. (దేవీ భాగవతం - 7వ స్కంధం)

**విశ్వామిత్రుడికి కామధేనువుచే పరాభవం**

విశ్వామిత్రుడు రాజ్యపాలన చేస్తూ ఒకనాడు వేటకు వెళ్లాడు. అడవి దారిలో వసిష్ఠుని ఆశ్రమాన్ని దర్శించడం జరిగింది. వసిష్ఠుడు అతడిని అతిథిగా భావించి, అభ్యాగతునిగా ఆదరించి, తన కామధేనువును 'విశ్వామిత్రునికి, అతని శిష్యులకు విందును ఏర్పాటు చేయుమని' ఆజ్ఞాపించాడు. కామ ధేనువు తన దైవీశక్తితో తక్కువ సమయంలోనే విందును ఏర్పాటు చేసింది. విశ్వామిత్రుడు తృప్తి చెంది కామధేనువును పొగడి, ఆ కామధేనువును తన కివ్వుమని వసిష్ఠుడిని అడిగాడు. కాని వసిష్ఠుడు అతని

కోరికను నిరాకరించాడు. ఆ గోవుకు బదులుగా కోట్ల గోవులను ఇస్తానన్నాడు. కోపించి, పట్టుదలతో విశ్వామిత్రుడు కామధేనువును బంధించి, బలవంతంగా తీసుకెళ్ల డానికి ప్రయత్నించాడు.

కామధేనువు కోపోద్రేకంతో కంపించి, తన శరీరం రోమకూపాలనుంచి సైన్యాన్ని పుట్టించి, విశ్వామిత్రుడిని, అతడి పరివారాన్ని తరిమికొట్టింది. విశ్వామిత్రుని బాణాలన్నింటిని వసిష్ఠుడు తన యోగదండంతో నిలువ రించాడు. క్షత్రియుల శక్తికంటే బ్రాహ్మణశక్తి గొప్పదని విశ్వామిత్రుడు గ్రహించి తన రాజ్యాన్ని కుమారునికి అప్పగించి, తపస్సు చేసుకుందామని వెళ్లిపోయాడు. రాజు ఋషిగా మారాడు. (వాల్మీకి రామాయణం - బాలకాండ 52 సర్గ), (మహాభారతం - శల్యపర్వం, అధ్యాయం 40), (మహాభారతం - ఆదిపర్వం - అధ్యాయం 175)

మహాభారతంలో వైష్ణవధర్మ ప్రసంగం (బృహత్ అవాంతర పర్వం) కేవలం గో మహిమ మీదే జరిగింది. విష్ణు ధర్మోత్తర పురాణం, అగ్నిపురాణాల్లో మధురంగా, ఆకర్షణీయంగా, భక్తితో కూడిన వైదికసూక్తులు ఉప బ్రాహ్మణ స్వరూపమైన గో మహిమను గురించి వివరించబడింది.

ఆమూలాగ్రం భారతదేశం గో భక్తులతో నిండి ఉంది. ప్రాచీన సాహిత్యం, వైదిక, ఆరణ్యకోపనిషత్తులు, వైదిక వాఙ్మయం గోరక్షణ, గోపాలన సంబంధ వివిధ మార్గాల గురించి చెప్పబడింది. వేదాల్లోని ఉప బ్రాహ్మణ భూత చరిత్రలో గో మాహాత్మ్యం మీద విశేషాలెన్నో లభిస్తాయి. గోవువల్ల సర్వశ్రేష్ఠమైన క్షేమం కలుగుతుంది. గోవుకు బాధ కలిగించడం మహాపాపం. అందువల్ల దుఃఖాలే కలుగుతాయి.

గోవులు నిత్యం సురభిరూపిణులు. పుణ్యమైన సుగంధాన్ని వెదజల్లేవి. గుగ్గులువంటి సువాసనలతో కూడినది గోవు. ఆవులతోనే ప్రాణికోటి ముడిపడి

ఉంది. గోవు ధర్మ, అర్థ, కామ, మోక్షదాయిని. ఆవులు సర్వోత్కృష్టమైన ఆహారాన్ని ఉత్పత్తి చేస్తాయి. ఆవు తన జీవితకాలంలో నాలుగు లక్షల పదివేల నాలుగు వందల నలభైమందికి ఒకపూట భోజనాన్ని ఇస్తుందట.

## నందినీ ధేనువు

దిలీప మహారాజుతో నందినీ ధేనువు ఇలా అందిట. 'న కేవలం పయసాం ప్రసూతిమ్ - అవేహి మాం కామదుఘాం ప్రసన్నాం' - నన్ను కేవలం పాలిచ్చే పశువుగా మాత్రమే పరిగణించకండి - నేను ప్రసన్నమైతే మీ కోరిక లన్నింటిని తీరుస్తాను అని-

భూమాత గోరూపంలో దర్శనమిస్తుందని శ్రీమద్భాగవతంలో ఉంది. సకలతీర్థదేవతాస్వరూపిణి గోమాత.

## గోపృష్ఠంలో లక్ష్మి ఉంటుంది

**మాతాదిత్యానాం దుహితా వసూనాం ప్రాణః ప్రజానామమృతస్య నాభిః**
**హిరణ్యవర్ణా మధుకశా ఘృతాచీ మహాన్ భర్గశ్చరతి మర్త్యేషు**
**(అథర్వ 9-1-4)**

"గోవు ఆదిత్యులకు తల్లివంటిది. వసువులకు పుత్రికవంటిది. ప్రజలకు ప్రాణము వంటిది. గోవు మానవులకు అమృతము నిచ్చు నాభి. హిరణ్య వర్ణముతో మధువులను వర్షించు ఘృతాచి (నేతిని ఉత్పత్తిజేయు గోవు). మానవులలో వారి కష్టములను దూరము జేయుచు తిరుగాడుచున్నది" అని మంత్రార్థము.

సప్త మధువులలో రెండు మధువులు గో వృషభములు.

ఒకసారి లక్ష్మీదేవి సుందర వస్త్ర ఆభూషణాలతో అలంకరించుకొని గోవుల మందలో ప్రవేశించినది. గోవులు ఆమె వైభవమును చూచి నీవెవరో

దయచేసి మాకు తెలుపవలసిందని ప్రశ్నించాయి. అపుడు లక్ష్మీదేవి ఓ గోవులారా! మీకు శుభమగును గాక! నేను ఈ లోకంలో లక్ష్మిగా ప్రసిద్ధిని పొందాను. మానవులందరు నన్నే కోరుకుంటారు. నా ఆశ్రయం వలనే దేవతలందరు భోగాలననుభవిస్తున్నారు. ఋషులు సిద్ధిని పొందుతున్నారు. ధర్మార్థ కామ మోక్షములు నా వలనే సిద్ధిస్తున్నాయి. కాని నేను మీ మధ్య నివసించాలనుకొంటాను. అందువల్ల స్వయంగా మీ మధ్యకు వచ్చి మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. అనుమతించండి అని కోరింది. దానికి గోవులు, ఓ లక్ష్మీదేవీ! నీవు చంచలమైనదానవు. ఒకచోట స్థిరముగాను ఉండవు. అందువల్ల మామధ్య నీవు వసించవద్దు. మరెక్కడనైననూ ఆనందంగా జీవించు. మాకు గడ్డిగాదములే పుష్టినిస్తున్నాయి. నీతో మాకేం పని? అని చెప్పాయి. అందుకు లక్ష్మీదేవి ఇతరులకు మేలుచేసే గోవులారా! మీరు నన్ను త్యజిస్తే లోకంలో నాకు అవహేళన తప్పదు. ఉపేక్షింపబడతాను. నాపై దయచూపండి. మీరు గొప్ప ఐశ్వర్యదాతలు. ఎందరినో పోషిస్తున్నారు. నేను మీ భక్తురాలను. మీరే నాకు శరణం. మీతో నన్ను ఉండనివ్వండి. కనీసము మీ శరీరంలోని ఏ అంగంలోనైనా, మలమూత్రాంగములలోనైనా చోటు దొరికితే చాలని కోరుకొంటున్నాను. మీలో ఏదియు అపవిత్రమైనది కాదు. మీ శరీరాంగాలలో ఎక్కడ నాకు చోటిస్తారో చెప్పండని ప్రార్థించింది. అప్పుడు గోవులన్నీ పరస్పరం ఆలోచించుకొని, ఓ లక్ష్మీదేవి! నీవు శోభాయుక్తురాలవు. మేము నిన్ను సన్మానింపవలసిందే. నీవు మా మలమూత్రములలో వసించు. ఎందుకంటే మా మలమూత్రములు పరమపవిత్రమైనవి అని చెప్పాయట. అప్పటినుండి శుద్ధి చేయడానికి వాడబడే గోవుల మలమూత్రాదులలో లక్ష్మీదేవి నివసిస్తున్నదట. దీనినిబట్టి అలంకారరూపంలో గోవుల మలమూత్రములు కూడా పవిత్రములుగా, వివిధ సంపదలకన్నా గోసంపద శ్రేష్ఠంగా భావించడం జరిగినది.

## గో విశ్వరూపం

గోవు యొక్క కంఠం మస్తకం మధ్య గంగ ఉంటుంది. గోవుయొక్క సమస్త అంగములయందు సమస్త దేవతలు ఉన్నారు. సప్తఋషులు, నదులు, తీర్థములు గోవులో ఉన్నాయి. ఆవుయొక్క నాలుగు పాదాల్లోనూ ధర్మార్థ కామ మోక్షము లుంటాయి. అందుకే ఆవు కాళ్ళను కడిగి, ఆ నీరు తలపై చల్లుకుంటే పాపాలు నశిస్తాయి. ఆవు ముఖంలో నాలుగు వేదాలుంటాయి. అందుకే ఆవును ముందు ప్రవేశపెట్టి, ఆ తర్వాతనే నూతనగృహంలో యజమాని ప్రవేశిస్తాడు. గోధూళితో నవగ్రహ దోషాలు తొలగిపోతాయి. గోవుకు నవధాన్యాలు, ఆకుకూరలు, పళ్లు మొదలైనవి తినబెడితే శుభం కలుగుతుంది. ఋణగ్రస్తులు బాధల నుండి బయటపడతారు. అందుకే పండుగల్లోనూ, శుభకార్యాల సందర్భంగానూ గోపూజలు, గోదానం చేయడం అలవరచుకోవడం మంచిది.

సూర్యచంద్రులు, శివుడు, కుమారస్వామి, గణపతి, విష్ణుమూర్తి, బ్రహ్మ, సరస్వతి, హనుమంతుడు, నవగ్రహాలు, పర్వతాలు, కుబేరుడు, అగ్ని, వరుణుడు, నాగరాజు, నారదుడు, లక్ష్మి, భౌమాదేవి, భైరవుడు, వాయుదేవుడు మొదలగు 33 కోట్లమంది దేవతలు గోవు శరీరంలో నివసించి ఉంటారు. గోవుకు ఆహారం సమర్పించినట్లైతే, 33 కోట్ల దేవతలకు నైవేద్యం సమర్పించి నట్లే. అందుకే గోప్రదక్షిణం చేస్తే భూప్రదక్షిణం చేసినట్లు అన్నారు. గో పూజకు భక్తి ప్రధానం కాని మడి ప్రధానం కాదు. సూక్ష్మంలో మోక్షాన్ని పొందాలంటే గోపూజ, గోరక్షణ, గోదానం, గోవధ నిషేధం మన కర్తవ్యం.

## గోసేవ

“ఆవును సేవించేవారికి అతి దుర్లభమైన వరాలు కూడా నెరవేరుతాయి. క్రూరత్వం, కోపం చూపకుండా ఎప్పుడూ జాగ్రత్తగా సంరక్షిస్తే ఆవు అన్ని

కోర్కెలు తీరుస్తుంది. జితేంద్రియుడై, ప్రసన్నచిత్తంతో నిత్యం గోసేవ చేస్తే పుణ్యం దక్కుతుంది అని మహాభారతం అనుశాసన పర్వం 21/33-35 శ్లోకాల్లో ఉంది.

మహర్షి వశిష్ఠుడు ఆచరించిన గోపాలన, గోసేవ చాలా ప్రసిద్ధమైనవి. గోతత్వాన్ని తెలుసుకున్న వారిలో ఆయన ప్రథముడు అనవచ్చు. ఆయన దగ్గర శబల అనే విశిష్టమైన ఆవు ఉండేది. ఆ శబల సంతానమైన నందిని గురించి సంస్కృత సాహిత్యంలో చాలా ప్రస్తావన ఉంది. మహాభారతంలో వశిష్ఠుడు గోసేవ మహత్తు గురించి రాజా సౌదాసునికి వివరించాడు - "గావః ప్రతిష్ఠా భూతానాం గావః స్వస్త్యయనం మహత్। గావో భూతం చ భవ్యం చ గావః పుష్ట సనాతనీ॥" (మహాభారతం - అనుశాసన పర్వం - 78/5-6) - "ఓ రాజా! ఆవు మనుష్యులతోపాటు సమస్త జీవులకు ఆధారం. గోకళ్యాణం మంగళకరం. సంపదలకు మూలం".

"ఆవు ఎక్కడ ఉంటే అక్కడ ప్రశాంత వాతావరణం ఏర్పడుతుందని, ఆవు శరీరం సర్వదేవతల నివాసస్థానమని" వేదవ్యాసుడు వివరించాడు.

శ్రీకృష్ణునికి 'గోపాలుడు' అనే పేరు వచ్చింది. ఆయన ఎంతో ప్రీతితో గోసేవ చేసేవాడు. కృష్ణభక్తుడు రసఖాన్ కూడా గోమాహాత్మ్యాన్ని అనేక విధాలుగా వర్ణించాడు. సత్యకామ జాబాలి గోసేవ ద్వారా దైవచింతన అలవడి మోక్షాన్ని సాధించాడని కఠోపనిషత్తు పేర్కొంది. దిలీప మహారాజు చూపిన గోభక్తి అనన్య సామాన్యమైనది. 'రఘువంశం' కావ్యంలో మహాకవి కాళిదాసు దిలీపమహారాజు గోభక్తిని వర్ణించాడు. 'దిలీపుడు ఎప్పుడూ గోసేవలోనే ఉండేవాడు. నీడలా గోవుల వెన్నంటి ఉండేవాడు. ఆవుకు ఆహారపానీయాలు అందించనిదే తాను కూడా ఏదీ తీసుకునేవాడు కాదు'.

వీలు ఉంటే ప్రతి ఇంటా కనీసం ఒక ఆవును ఉంచుకోవాలి. 'రాజు నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యాలలో గోసంరక్షణ కూడా ఒకటి' అని కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో (2-6-48) పేర్కొన్నాడు.

## గోసేవాఫలం (జరిగిన కథ)

ఒక బ్రాహ్మణుని ఇంటికి ఒక స్వాములవారు అతిథిగా వచ్చారు. ఆ బ్రాహ్మణునికి సంపదకు లోటులేదు. కాని సంతానం లేదు. ఆ దిగులుతోనే ఉండేవారు వాళ్ళు. ఆ స్వామీజీకి ఆ దంపతులిద్దరూ అతిథి సత్కారాలు చేసి సేవించారు. గ్రామంలోని అందరూ ఆయన దర్శనానికి వచ్చారు. స్వామీజీ మర్నాడు ఉదయాన్నే లేచి వేరేచోటికి వెళ్లాలని బయలుదేరాడు. భోజనంచేసి వెళ్లండని ఆ దంపతులు ఆయన్ని ఆపినారు. భోజనం చేసి వెళ్తూ, వారిని 'సుపుత్ర ప్రాప్తిరస్తు' అని దీవించాడు. స్వామీజీ ఇలా దీవించినందుకు వారు సంతోషించారు. గోసేవ చెయ్యమని వారితో చెప్పి, స్వామిజీ వెళ్లిపోయారు. ఆ రోజునుండి బ్రాహ్మణ దంపతులు గోసేవ చెయ్యడం ప్రారంభించారు. ఆవుకాళ్లు కడిగి ఆనీళ్లు తల మీద చల్లుకుని, త్రాగేవారు. గోశాలలో దీపం పెట్టి, ఆవుకి మెత్తనిపడక ఏర్పాటుచేసి, రోజూ గోశాలను శుభ్రపరచి, ఏలోటూ లేకుండా చేసేవారు. కొద్ది రోజుల్లో ఆవు, దూడ పుష్టిగా తయారయ్యాయి.

కొద్దిరోజుల్లో ఆ ఇల్లాలు గర్భవతి అయింది. పుత్రుడు జన్మించాడు. గ్రామంలోని అందరూ ఆనందించారు. స్వామిజీ ఆశీర్వాద ఫలితమని తలచి, అందరూ గోసేవ చేయడం ప్రారంభించారు. ఈ సంఘటన కాళిదాసు 'రఘువంశం' లో ఉంది.

సూర్యవంశానికి చెందిన దిలీపమహారాజు, పుత్రులు లేని కారణంగా, వసిష్ఠుని సలహాతో గో సేవ, గోసంరక్షణ చేస్తే సంతానం కలిగింది. దిలీప

మహారాజు, భార్య సుదక్షిణతోకూడి భక్తిభావంతో వసిష్ఠుడు చెప్పిన వ్రతాన్ని ఆచరించి నందినీధేనువు సేవ చేసి, దాన్ని రక్షించడానికి అడవులు, పర్వతాలు, సరస్సులు తిరిగేవాడు. ఒకనాడు ఒక మాయసింహం నందిని మీదికి దూకి దాడిచేసి, రాజును పరీక్షించి తర్వాత గోమాతగా కనిపించి ఆ దంపతుల నాశీర్వదించింది– దాని ఫలితంగా రాణి 'రఘు' మహారాజుకి జన్మనిచ్చింది.

నాకు సంతానం కలిగిన తర్వాత, నేనుకూడా నా శిష్యుడికి గోసేవ చేయుమని సూచించాను. అతని భార్య కూడా గర్భవతి అయింది. గోసేవా మహిమ ఇకముందు, ఇప్పుడూ, ఎప్పుడూ ఉంటుంది - ఇది నా దృఢవిశ్వాసం. హృదయపూర్వకంగా గోసేవ చేస్తే ఫలితం శ్రీకృష్ణసాన్నిధ్యమే.

## మన దేశంలో ప్రముఖ గోసేవ సంస్థలు

1. తిరుమల తిరుపతి దేవస్థానపు గోశాలలు,
2. ఆర్యసమాజ్ ఆధ్వర్యంలో దేశవ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో గోసంరక్షణ కేంద్రాలు నడుస్తున్నాయి.
3. జైన సమాజ్‌ద్వారా ఏర్పాటైన గోశాలలు,
4. విశ్వహిందూ పరిషత్ ఆధ్వర్యంలో గోసేవా కేంద్రాలు,
5. అఖిల భారతీయ గోసేవా సమాజ్, ఢిల్లీ,
6. శ్రీకృష్ణ గోపాల సంస్థాన్, గోవింద గఢ్, జయపూర్, రాజస్థాన్
7. కామధేను విశ్వవిద్యాపీఠం, ఝాన్సీ, ఉత్తరప్రదేశ్,
8. భారతీయ గోవంశ రక్షణ, సంవర్ధన పరిషత్, సంకటమోచన ఆశ్రమం, ఢిల్లీ,

9. భారత్ సేవక్ సమాజ్, ఢిల్లీ,
10. రాష్ట్రీయ గోధన మహాసంఘ్, ఢిల్లీ.

## భారతీయ గోవు

భారతదేశంలో అనాదిగా – అంటే వేదకాలం కంటే ముందునుండియే గోవులు అత్యంత ప్రాముఖ్యతను పొందాయి. వేదాలు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు, ఇంకను తరువాత వచ్చిన అనేక గ్రంథాలు, కావ్యాలలో గోవు ప్రశంస ఉంది.

వీపుపైన మూపురము, మెడక్రింద గంగడోలుతో చక్కని శరీర నిర్మాణము కలిగియుంటుంది గోవు. నేటికాలంలో మూపురము, గంగడోలు లేకుండానే గోవు అను పేరుతో చలామణి యగుచున్న 'జెర్సీ' అను ప్రాణి వాస్తవంగా గోవుమాత్రం కాదు.

పాశ్చాత్య దేశాల్లో 'యోరాస్' అను పేరు గల మాంసాహార జంతువు అడవుల్లో ఉండేది. 7 అడుగుల పొడవుతో భారీ శరీరంతో ఉండే ఈ జంతువు కొమ్ములు మూడు అడుగులు. దీని పాలు త్రాగడానికి అనువుగా ఉండడంతో అక్కడి ప్రజలు ఈ జంతువును మచ్చిక చేసుకొన్నారు. ఈ జంతువు యొక్క సంతతే జెర్సీ ఆవు. అయితే ఈ జంతువు గోసంతతికి చెందినది కాదు. నేడు ఎక్కువ పాలకొరకు మాత్రమే జెర్సీ ఆవులను దిగుమతి చేసుకొంటున్నారు. ఈ జెర్సీ పాలలో ఆవు పాలకున్న శ్రేష్ఠత్వం లేదు. పాశ్చాత్య దేశాలలో పాలకంటే ముఖ్యంగా మాంసం కొరకు ఆవులను పెంచుతారు.

భారతీయ గోవుయొక్క పుట్టుక, చరిత్రయే వేరు. దేవదానవులు అమృతం కొరకు సముద్రమథనం చేయడం మొదలుపెట్టారు. మొదలు 'హాలాహలం'

అనే భయంకరమైన విషం సముద్రగర్భం నుండి ఉద్భవించింది. దాని ప్రభావానికి లోకాలు తల్లడిల్లసాగాయి. లోకక్షేమం దృష్ట్యా శివుడు ఆ హాలాహలాన్ని పానం చేశాడు. ఆ తరువాత లక్ష్మీదేవి, ఐరావతము, ఉచ్చైశ్రృవము, చంద్రుడు సముద్ర గర్భంనుండి ఉద్భవించారు. అటుపిమ్మట కల్పవృక్షము, కామధేనువు ఉద్భవించాయి. ఆ తరువాత అమృతాన్ని తీసుకొని భగవాన్ శ్రీ ధన్వంతరి ఆవిర్భవించాడు. మోహినీరూపంలో శ్రీమహావిష్ణువు అమృతాన్ని దేవతలకు యుక్తిగా పంచాడు. దేవతలంతా అమరులయ్యారు. మరి మానవుల మాటో! కరుణా సింధువైన పరమాత్ముడు మానవుల యొక్క సమస్త యోగక్షేమాలను చూడటం కొరకు అమృతము యొక్క నాభి కలిగియున్నట్టి కామధేనువును ఇచ్చాడు. మానవుల యొక్క సమస్త కోరికలను తీర్చేది గోవు – **'కామధేనువు'.**

దేవతలు అమరులు. వారికి మరణం లేదు. మానవులకు మరణం తప్పదు. అయితే వీరు వంద సంవత్సరాల ఆయుర్దాయాన్ని కలిగి ఉండేట్లు దేవుని ఏర్పాట్లు ఐతే అదెప్పుడు సాధ్యం? ఆయుర్వేదంలో చెప్పినటువంటి ఆరోగ్య రక్షణ విధానమును సరిగా పాటించినప్పుడు నూరేళ్ళ ఆయువు సాధ్యమే. అప్పుడు మానవుడు "శతమానం భవతి" అనే ఆశీస్సులకు యోగ్యుడవుతాడు. ఆరోగ్యము, దీర్ఘాయువు కొరకు ఆయుర్వేదంలో ఎన్నో ఔషధాలను చెప్పారు మహర్షులు. అయితే ప్రతి ఔషధాన్ని సేవించునప్పుడు గోవుతో పని లేకుండా వాటి ప్రభావము కనిపించదు. గోవువలన లభించే పాలు (క్షీరము), పెరుగు (దధి), నెయ్యి (ఘృతము), అదేవిధంగా గోమూత్రము, గోమయము (పేడ) అనే ఐదింటిని కలిపి "పంచగవ్యములు" అని అంటారు. పంచ అనగా ఐదు. గవ్యము అనగా గోవు వలన లభించునట్టి పదార్థములు.

## గోవులో ఎన్నో అద్భుతమైన గుణాలు

1. పాలు, పెరుగు, నెయ్యి, వెన్న, మజ్జిగ – ముఖ్యంగా ఇవి శరీరానికి అవసరమైన అనేక విధములైన పోషకాలను అందించి ఆరోగ్యమును కాపాడతాయి.

2. గోమూత్రము, గోమయము ఇవి మలపదార్థములు కావు. ఇవి శరీరమందలి వ్యాధిని కలిగించే దోషాలను శోధించి వ్యాధులురాకుండ చేస్తుంది.

3. గోవు సకల దేవతలకు నివాసము. కావున గోవుకు నమస్కరించుట, పూజించుట, ప్రదక్షిణము చేయుట అనగా సమస్త దేవతలకు చేసినట్లే అవుతుంది.

4. గోమయమునందు "లక్ష్మి" నివాసమున్నట్లే గోమూత్రమందు "గంగ" నివసిస్తుంది.

5. గోవు తన ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములలో కార్బన్‌డై ఆక్సైడ్‌ను పీల్చుకొని, ఆక్సిజన్‌ను బయటికి వదులుతుంది. దీనివలన గోవు ఉన్నచోట పరిసరాలు స్వచ్ఛముగా ఉంటాయి. ఇట్టి వ్యవస్థ మరే ప్రాణికినీ లేదు.

6. గోవు అత్యంత శాంతస్వభావము కలిగినది. గోవుయొక్క పంచగవ్యములు సేవించుట వలన మనుష్యులలోను శాంతగుణం వృద్ధిఔతుంది. జెర్సీది ఉగ్రస్వభావము. కష్టపడి వ్యవసాయము చేయలేదు.

7. గోవు పచ్చికను మేసి అమృతంలాంటి పాలను ఇస్తుంది.

8. తల్లిపాలు లేని పిల్లలకు గోవుపాలు తల్లిపాలవలె పని చేస్తాయి.

9. తల్లి పసితనమందే పాలిచ్చి పోషింపగా గోవు జీవితాంతము పాలను ఇస్తూనే ఉంటుంది.

10. ఆవు వట్టిపోయినను గోమూత్రము, గోమయమునకు కొదవ ఉండదు.

11. గోవు మరణించిన తరువాత కూడా మహోపకారణియే. మరణించిన గోవును సమాధి చేసిన కొన్నాళ్ళకు అది అమూల్యమైన ఎరువుగా మారుతుంది.

12. గోవు కొమ్ము (మరణించిన తరువాత) లో గోమయమును కూరి భూమిలో పాతిన ఆరునెలల తరువాత అది అద్భుతమైన ఎరువుగా మారుతుంది.

13. గోవుయొక్క పంచగవ్యాలు విషానికి విరుగుడుగా పనిచేస్తాయి. బాలకృష్ణుడు పూతనను వధించిన తరువాత కృష్ణుని తల్లిదండ్రులు, అక్కడున్న వారంతా ఎంతో కలత చెందారు. దుష్టురాలు పసిబాలునికి పాలిచ్చినది. అవి యెంత విషపూరితమోనని తలచి బాలకృష్ణునికి గోమూత్రము, గోమయముతో స్నానము చేయించి, గోవు గిట్టలక్రింద ధూళిని (గోరజమును) తిలకముగా దిద్దారు.

14. శ్రీకృష్ణ పరమాత్ముడు గోవును గురించి లోకమునకు తెలియజేయుటకై ఎన్నో లీలలు చేశాడు. పసితనము నుండే పాలు, పెరుగు, వెన్న పుష్కలంగా సేవించాడు. చిన్నప్పటి నుండే ఈ గవ్యములు లభించిన బాలురు ఎంతో పుష్టిగాను మేధా సంపన్నులుగాను తయారవుతారు. నేటి కాలములో గోవులను కోతకు పంపుచున్న మానవులు తమ పిల్లల అవసరముకు గోవులను ఎక్కడినుండి తీసుకొస్తారు? ఈ పరిస్థితి వలన భారతజాతి దుర్బలమై పోవుట లేదా?

15. ఏ యింట తులసి మరియు గోవు ఉండునో ఆ యింటికి ఎప్పుడు కూడ వైద్యుడు రావలసిన అవసరముండదు.

16. "గోస్తు మాత్రా న విద్యతే" గోవును గురించి ఎంత చెప్పినా పరిమితి లేదు.

17. ఆయుర్వేద వైద్య శాస్త్రం ప్రకారం పంచగవ్యములతో విషములను గూడ అమృతతుల్యంగా మార్చుట సులభమే.

18. "ఇంటింటా గోవు – గ్రామ గ్రామాన గోశాల" ఉండేవిధంగా పరిస్థితి మార్పు చెందినప్పుడు పంచగవ్యాలు అందరికీ అందుబాటులోకి వస్తాయి.

19. ఆయుర్వేద చికిత్స చేయించుకొంటున్నప్పుడు అడుగడుగునా పంచగవ్యములలో కనీసం ఏదో ఒకటి అవసరమవుతూంటుంది.

20. పంచగవ్యములను ప్రతిరోజు నియమితంగా ఉపయోగించడం వలన శరీరంలోని దోషాలు నివారించబడతాయి.

21. మనదేశంలో ఈ రోజున 36 వేలకు పైగా పశువధశాలలుండడం నిజంగా మనమంతా సిగ్గుపడాల్సిన విషయం.

22. గోవుయొక్క వెన్నెముక పైన 'సూర్యకేతు' అను ప్రత్యేకమైన నాడి ఉంది. ఇది సూర్యకిరణ స్పర్శ వలన క్రియాన్వితమవుతుంది. గోవు ఎండలో ఉండటానికి ఇష్టపడుతుంది. నాడియొక్క క్రియ ప్రారంభమైన వెంటనే అది పసుపు పచ్చని పదార్థాలను స్రవిస్తుంది. అందువలననే ఆవుపాలు పసుపు పచ్చగా ఉంటాయి. ఈ పసుపు పచ్చని పదార్థము సర్వరోగ నివారిణి, సర్వవిషనాశకము.

23. గోవు శరీరమునుండి గుగ్గిలపు వాసన వస్తుంది. వాతావరణ కాలుష్యమును నివారించుటకు తోడ్పడుతుంది.

24. పంచగవ్యముల ఔషధీయ గుణముల ప్రామాణికత భారత ప్రభుత్వపు వివిధ పరిశోధనా సంస్థలచే నిర్ధారించబడినది. (IICT, NBRI, CSIR, IIT, NEERI, NBAGR మొదలైనవి.)

25. "పదండి పోదాం గోమాతవైపు - పదండి పోదాం గ్రామంవైపు - పదండి పోదాం ప్రకృతివైపు - పర్యావరణ పరిరక్షణ వైపు" "పదండి పోదాం గ్రామరాజ్యం ద్వారా రామరాజ్యం వైపు"

## COW MANURE

**The Values are average of General Analysis and are in dry matter basis**

| | |
|---|---|
| 1. Nitrogen | 1.00 Percent / 100 g. dry matter |
| 2. Phosporous | 0.54 Percent / 100 g. dry matter |
| 3. Potassium | 0.90 Percent / 100 g. dry matter |
| 4. Iron | 2600 mg. / Kg. or ppm. on dry matter basis |
| 5. Zinc | 57 mg. / Kg. or ppm. on dry matter basis |
| 6. Manganese | 250 mg. / Kg. or ppm. on dry matter basis |
| 7. Copper | 2.5 mg. / Kg. or ppm. on dry matter basis |
| 8. Boron | 2.1 mg. / Kg. or ppm. on dry matter basis |
| 9. Boron | 0.7 mg. / Kg. or ppm. on dry matter basis |

**Dr. H.C. Behra**

Jodhpur, Rajasthan

## భారతీయ సంతతికి చెందిన ఆవుల విశేషాలు

అత్యంత ప్రాచీనకాలం నుండి భారతదేశంలో ఆవు, మానవులకు ఒక సహచరునిగా, ఇంట్లో పెంచి పోషించుకునే జంతువుగా ఉంది. భారతీయుల ఆవు శాకాహారి. మూపురము, గంగడోలు భారతీయ గోసంతతి విశేషత. భారతీయ సంతతి ఆవులు ఆఫ్ఘనిస్తాన్, ఆఫ్రికాలోని కొన్ని ప్రాంతాలలో మాత్రమే కనిపిస్తాయి.

పాశ్చాత్య దేశాల్లో 'యోరాస్' అనే పేరుగల మాంసాహారి జంతువు అడవుల్లో ఉండేది. 7 అడుగుల పొడవుతో భారీకాయంతో ఉండే ఈ జంతువు కొమ్ములు 3 అడుగులు. దీని పాలు త్రాగడానికి అనువుగా ఉండడంతో అక్కడి మానవులు ఈ జంతువును మచ్చిక చేసుకున్నారు. అయితే ఈ జంతువు గోవంశానికి చెందినది కాదు. నేడు ఎక్కువ పాల కొరకు జెర్సీ ఆవులను దిగుమతి చేసుకుంటున్నాం. ఈ జెర్సీ పాలలో ఆవు పాలకున్న శ్రేష్ఠత్వం లేదు. పాశ్చాత్య దేశాలలో పాలతోపాటు, మాంసం కొరకు ఆవులను పెంచుతారు.

గోవధ నిషేధాన్ని మన ప్రభుత్వాలు సక్రమంగా అమలు చేయని కారణంగా 70 భారతీయ తెగల్లో నేటికి 32 మాత్రమే మిగిలి ఉన్నాయి. పట్టణాలలో పశుగ్రాసపు కొరత, ఆవులు తిరిగే స్థానం లేకుండా పోవడంవల్ల ఆవులకు పట్టణాలలో స్థానం లేకుండా పోయింది. నేడు గ్రామాల్లోను ఇదే పరిస్థితి ఉంది. 6.4% ఆవులు మాంసం కొరకు నేడు ప్రతి సంవత్సరం గోవధశాలలకు తరలింపబడుతున్నాయి. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 1951 నాటికి ప్రతి 1000 మంది జనాభాకు 700 ఆవులు ఉండేవి. నేడవి 1000 మందికి 400కు తగ్గాయి.

సంకరజాతి ఆవులు ఎక్కువ పాలను ఇస్తాయి. అయితే అవి కొద్ది సంవత్సరాలే ఇస్తాయి. స్వదేశీ గోసంతతి ద్వారా వచ్చే పాలు, గోమూత్రము, పేడ వీటిలో మాత్రమే ఔషధ గుణాలు ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని కలిగి ఉండి, వేడి ప్రాంతంలో కూడా శ్రమించగలగడం, ఔషధగుణాలు కలిగిన పంచగవ్యాన్ని ఇవ్వడం భారతీయ గోవంశపు ప్రత్యేకత. స్వదేశీ గోసంతతి రక్షణపట్ల ప్రభుత్వాల ఉదాసీన ధోరణి కారణంగా ఇంకా అనేక స్వదేశీ తెగలు అంతరించే ప్రమాదం ఏర్పడింది.

**దేశీయ ఆవుల లక్షణాలు**

1. నడుముపై మూపురము, మెడక్రింద గంగడోలు స్వదేశీ ఆవుల విశేషతలు.
2. సాధారణంగా కొమ్ములు పొడుగ్గా ఉంటాయి. శరీరం సాధారణంగానే ఉంటుంది.
3. దేశీయ గోసంతానమైన ఎద్దులు బాగా శ్రమించగలవు. వ్యవసాయంలో విరివిగా ఉపయోగపడతాయి.
4. ఈ ఆవు ఉచ్ఛస్వరంతో అరుస్తుంది.
5. ఆవు చాలా చలాకీగా, చురుగ్గా ఉంటుంది.
6. ఈ ఆవులు తన యజమానికే పాలనిస్తాయి. క్రొత్తవారికీయవు. వందల ఆవుల మధ్యకూడా దూడ తన తల్లిని గుర్తిస్తుంది. ఆవు ఎంతదూరంలో ఉన్నా తన ఇంటిని గుర్తుపట్టగలదు.

**దేశీయ ఆవులవల్ల కలిగే ప్రయోజనాలు**

1. దేశీయ సంతతికి చెందిన ఆవు పాలవల్ల బుద్ధి సునిశితమౌతుంది. అన్ని పౌష్టిక పదార్థాలను కలిగి ఉంటుంది. విషకరమైన వాటిని

నిరోధించి, శక్తిని కలిగిస్తుంది. ఇది సర్వోత్తమమైనది. తల్లి పాలవలె సులభంగా జీర్ణమవుతుంది. తల్లిపాలలో ఉండే అన్ని సుగుణాలు దేశీయ సంతతి ఆవు పాలలో లభ్యమవుతాయి.

2. పాలను ఎక్కువ పరిమాణంలో ఇవ్వదు. అయితే 12–13 సంవత్సరాల పాటు వరుసగా ఇస్తుంది.

3. దేశీయ సంతతికి చెందిన ఆవు కార్బన్‌డైఆక్సైడ్‌ను శ్వాసగా తీసుకుని ఆక్సిజన్‌ను శ్వాసగా వదులుతుంది.

4. దేశీయ ఆవు నెయ్యి కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది, బుద్ధి సునిశితం చేస్తుంది. విషపదార్థాల నుండి రక్షించి రోగనిరోధక శక్తిని పెంచుతుంది. ఈ పాలలో అనేక ఔషధపరమైన గుణాలున్నాయి.

5. దేశీయ ఆవు చర్మానికి విషగుణాలను హరించే లక్షణం ఉంది. తోకద్వారా చర్మాన్ని శుభ్రంగా ఎప్పుడూ ఉంచుకుంటుంది. ఆవు శరీరాన్ని నిమిరేవారికి సైతం ఆరోగ్యం మెరుగవుతుంది.

6. దేశీయ ఆవు పాలవల్ల లభించే మజ్జిగ 'చలవ'ను కలిగిస్తుంది. పైత్యాశయము, పేగులను శుభ్రపరుస్తుంది. బుద్ధికి బలాన్నిస్తుంది. ఫలితంగా శరీరంలో చురుకుతనం పెరుగుతుంది.

7. స్వదేశీ ఆవులలో బి.సి.ఎం. (బీటా కాసో మార్లెన్) అనే విషకణం ఉండదు.

8. ఆవు పాలు, పెరుగు, నెయ్యి, మూత్రము, పేడ వైద్యపరంగా చాలా విలువైనవి.

9. ఆవు మరణానంతరము కొమ్ములు ఇతర శరీర భాగాలు భూమిలో, పొలంలో పాతిపెడితే ఆరునెలల తరువాత విశేష ఎరువుగా మారుతుంది.

## దేశీయ ఆవుపాల విశేషాలు

1. దేశీయ ఆవు పాలవల్ల లభించే నెయ్యి ఒక తులాన్ని మండిస్తే ఒక టన్ను ఆక్సిజన్ విడుదల అవుతుంది.

2. ఆవు పాలల్లో 'కైరోటిన్' అనే పదార్థముంటుంది. దీనివల్ల నేత్ర వ్యాధులు నయమవుతాయి. ఇది 'విటమిన్ ఎ'కు పర్యాయపదంగా కనిపిస్తుంది.

3. ఆవు పాలవలె నెయ్యి, పెరుగు కూడా ఔషధ గుణాలు కలిగి ఉన్నాయి.

4. ఆవు పాలు పలుచగా ఉంటాయి. శిశువులకు సైతం సులభంగా జీర్ణమవుతాయి. తల్లిపాలకుండే అన్ని సుగుణాలు దేశీయ ఆవు పాలకున్నాయి. తల్లిపాలతో సమానంగా దేశీయ ఆవుపాలను శ్రేష్ఠంగా భావిస్తారు. కనుకనే ఆవును తల్లిగా భావిస్తారు.

# భారతీయ వ్యవసాయానికి ప్రాణం గోవంశం

## పశుసంపద - ట్రాక్టర్లు

వ్యవసాయానికి ఎద్దులే అతి చక్కని, తక్కువ ఖర్చుతో కూడిన ఉత్తమ సాధనం అంటారు డా॥ భూప్ సింగ్. పొలానికి ఇవి కాలుష్యం లేని శక్తిని ఇస్తాయి. మంచి ఎద్దుల జత ఖరీదు సుమారు రూ.20,000/- ఉంటుంది. వీటికి రెండింటికీ కలిపి ప్రతిరోజు 5 కిలోల శనగలు ఆహారంగా ఇస్తే దీని ఖర్చు 70 రూపాయలు వస్తుంది. (510 రూ. శనగలు+20రూ. ఎండుమేత) ఈ ఖర్చుతో సంవత్సరానికి 18% వడ్డీ చొప్పున రూ.300/- జత చేస్తే నెలకు (70×30+300) రూ.2,400/- మేత ఖర్చు వస్తుంది. దీనిలో ప్రతిరోజు లభించే పేడ విలువ 20/-ల చొప్పున అంటే 20×30 = 600 రూపాయలు అవుతుంది.

మరోవైపున ఒక ట్రాక్టరు ధర దాదాపు 4 లక్షల రూపాయలు ఉంటుంది. ప్రతినెల రూ.6000/- వడ్డీ, ఒక ఎద్దుల జత ఒక రోజులో ఒక ఎకరం సులభంగా దున్నగలుగుతుంది. అదే ట్రాక్టరుకు ఒక ఎకరం దున్నడానికి అవసరమైన డీజిలు ఖరీదు + (10×32=320రూ.) ట్రాక్టరు రోజు అద్దెకు రూ.700/- అవుతుంది. వీటితో పోలిస్తే జోడెద్దులకు పట్టే ఖర్చు తక్కువ. చిన్న కమతాలవల్ల ట్రాక్టర్‌తో దున్నడం ఆలస్యమవుతుంది కూడా.

జాతీయ స్థాయిలో చూసినట్లైతే దేశంలోని వ్యవసాయ యోగ్యమైన భూమి ఒక యూనిట్ అంటే సరాసరి ఒక రైతుకు 1.56 హెక్టార్లుంది. ఇది హర్యానాలో అయితే 2.11 హెక్టార్లుంది. (భారత వ్యవసాయ గణాంక నివేదిక 1990-91 భారత ప్రభుత్వం) ఒక ఎద్దుల జత 7 హెక్టార్ల భూమిని సులభంగా దున్నగలుగుతుంది. సన్నకారు రైతులు ఇద్దరు కలిసి ఒక్కొక్కరు ఒకటి చొప్పున ఎద్దులతో వ్యవసాయం చేసుకోవచ్చు. హర్యానాలో 7 హెక్టార్ల పెద్ద యూనిట్ల సంఖ్య మొత్తం సాగుచేసే భూమిలో 6% ఉండగా జాతీయస్థాయిలో అది 4% ఉంది. (స్టాటిస్టికల్ రిపోర్ట్-హర్యానా 1995-96) 7 హెక్టార్ల కన్న చిన్న యూనిట్లకు ట్రాక్టర్లు ఎలాగు ఆర్థిక దృష్టిలో ఉపయోగపడలేవు. హర్యానాలో 7 హెక్టార్లకన్న పెద్ద యూనిట్ల సంఖ్య 91,658 ఉండగా ఆ రాష్ట్రంలో ట్రాక్టర్ల సంఖ్య మాత్రం 1,62,030. అంటే అవసరానికంటే సుమారు రెట్టింపు అన్నమాట. కనుక మనదేశంలో 95% రైతులకు ట్రాక్టర్ల కంటే ఎద్దులే ఎంతో ఉపయోగకరమైనవి అని తేటతెల్లమవుతుంది.

జాతీయ స్థాయిలో ఎద్దులు, లేదా ఒంటెల వల్ల జరుగుతున్న రవాణా పనులు (ట్రాన్సుపోర్టు) రైళ్ళు, ట్రక్కులు జరుపుతున్న దానికంటే 3 రెట్లు ఎక్కువ. ఈ ట్రాన్సుపోర్టు అంతా డీజిల్ ద్వారానే జరగాలంటే డీజిల్ కోసం

మనదేశం విదేశాలను ఆశ్రయించక తప్పదు. అట్టి స్థితిలో ఖర్చు పెనుభారమైపోతుంది. అదీగాక ఆ డీజిల్ వల్ల కలిగే కాలుష్యము బెడద, ఆర్థిక దృష్టి కోణము వీటన్నింటిని బట్టి చూస్తే మనదేశానికి ఎద్దులే ఎంతో ఉపయోగకరమైనవి అని స్పష్టమవుతున్నది.

ఇప్పటివరకు దేశీయ గోవులను గురించి మాత్రమే కొంత తెలుసుకున్నాం. గోమాత పుత్రుడు వృషభరాజు – ఎద్దు భారతదేశం యొక్క వ్యవసాయానికి వెన్నెముక వంటిది. ప్రపంచంలో ఇంతటి సుందరమైన సమర్థమైన ఎద్దు మరొకటి లేదు. మన ఎద్దుకు మూపురం ఉంటుంది. మూపురం సహాయంతో నాగలినిగాని, బండినిగాని అది లాగుతుంది. ఈ సదుపాయము విదేశీ ఎద్దులలో కనిపించదు. దేశీయ ఎద్దుల క్షమత కూడా పేర్కొనదగినది. దున్నపోతులు, విదేశీ ఎద్దులు చతికిలబడిన సమయంలో మన దేశీయ ఎద్దులు ఎంతో విజయవంతంగా, సునాయాసంగా ఆయా పనులు చక్కదిద్దుతాయి.

ప్రత్యేకించి ఉత్తర, పశ్చిమ భారతదేశంలో ట్రాక్టర్ల ఉపయోగం మరింతగా పెరిగినందున ఎద్దులు నిరుపయోగం అనే ఉద్దేశ్యంతో చిన్న వయసులోనే వాటిని అమ్మివేస్తున్నారు. లేదా పశువధశాలలకు పంపివేస్తున్నారు. ఇది చాలా ఘోరం. యావద్భారతము యొక్క పరిస్థితిని మనం సమీక్షించాలి. భారతదేశంలో చిన్నకమతాలే ఎక్కువ కాబట్టి ఇక్కడ ట్రాక్టర్లకు అంతపని అన్ని ప్రాంతాల్లో లేదు. ఇక్కడ 70% సన్నకారు రైతులకు ఒక్కొక్కరికి 2 ఎకరాల పొలం కూడా లేదు. ఆనాటి ప్రధానమంత్రి స్వర్గీయ లాల్ బహద్దూర్ శాస్త్రిగారు “భారత్‌లో లక్షల ఎకరాల భూమిలో ట్రాక్టర్లు నడపడం సాధ్యం అయ్యేటట్లు లేదు. అన్ని కుగ్రామాలకు వెళ్ళాలంటే అన్ని చోట్ల రోడ్డు మార్గాలు కూడా లేవు” అని పేర్కొన్నారు.

ట్రాక్టర్ల వల్ల భూమి దున్నడంలో నాగలి అవసరమైన దానికంటె ఎక్కువ లోతుకు దిగుతుంది. ఫలితంగా చెడు జీవాణువులతోపాటు భూమికి, పంటలకు సహాయం చేసే మిత్ర జీవాణువులు కూడా చచ్చిపోతాయి. ఇది భూమికి, పంటలకు ఒక శాపంగా పరిణమిస్తుంది. ఎక్కువ లోతులకు నాగలి వెళ్లడం మూలంగా నీరు కూడా ఎక్కువగానే అవసరమవుతుంది. మన దేశంలో వర్షాలు పడడంలో ఒక నియమమంటూ ఏమీ లేదు. అనేక ప్రాంతాలలో కేవలం 30% పొలాలకే నీరు అందుతుంది. ఈ పరిస్థితిలో నీటి కొరత సమస్య రైతులను మరింత వేధిస్తుంది.

గోసంతతి యొక్క మలమూత్రాలు కాలుష్యాన్ని ఉత్పత్తిగావించవు. ఇవి యాంటిసెప్టిక్ కావడమే గాక కాలుష్యాన్ని నివారించి, వాతావరణాన్ని శుద్ధి చేయగల శక్తిగలవి. ఎండిన పేడ లేదా పిడకల బూడిద ధాన్యాన్ని కీటకాల నుండి కాపాడుతుంది. ధాన్యం నిలవ చేసే సమయంలో పిడకల బూడిద ఉపయోగిస్తారు. నాగలి దున్నినా, నీటి యంత్రాలు (మోటలు) లాగినా, చెరుకుగానుగలు, నూనె గనుగలు త్రిప్పినా మరెన్నో పనుల సందర్భంగా ఎద్దులనుండి ఈ గోమయం, గోమూత్రం లభిస్తాయి. అవి ఎరువులుగా, కీటకనివారిణులుగా ఉపయోగపడతాయి. అదే ట్రాక్టర్ల విషయానికొస్తే వాటి నుండి వెలువడే పొగ వాయువునంతా కాలుష్యంతో నింపివేస్తుంది. గోవంశం నుండి గోసంతతి పుడుతుంది. కాని ట్రాక్టర్లు మరో ట్రాక్టరును పుట్టించలేవు కదా!

వాతావరణాన్ని కాలుష్యం చేయడమే కాదు ట్రాక్టరు భాగాలు తరచుగా విరిగిపోతాయి, అరిగిపోతాయి, ఒక్కొక్కప్పుడు పూర్తిగాను నిరుపయోగమైపోతుంది. కాని గోవంశం చచ్చినప్పటికీ ఉపయోగకారిగానే ఉంటుంది. దాని చర్మం, కొమ్ములు మొదలైనవన్నీ మానవునికి

ఉపయోగపతాయి. గోవుయొక్క శరీరమంతా ఎరువుగా మారిపోగలదు. కేవలం ఒక కొమ్ములో పేడ నింపి భూమిలో పాతి ఉంచితే అది అత్యుత్తమమైన ఎంతో విలువైన ఎరువుగా మారిపోతుంది. పశువు చచ్చినా దాన్ని అమ్మకానికి పెట్టవచ్చు. ఈ దృష్ట్యా పశువు మనిషికంటే కూడా ఎక్కువ ప్రయోజనకారి అన్నది ఋజువవుతుంది. ట్రాక్టరును ఎప్పటికప్పుడు రిపేర్సు చేస్తూ పనికి అనుకూలంగా ఉంచాలంటే ఎంతో ఖర్చు భరించవలసి ఉంటుంది. కాని ఎద్దు బయట మేసి వస్తుంది. గడ్డి వేస్తే తిని ఆరోగ్యంగా ఉంటుంది.

రెండు మూడు సంవత్సరాలు మాత్రం దూడల పోషణ భారం రైతుపై ఉంటుంది. ఆ సమయంలో అది ఇచ్చే పేడ, మూత్రం భూమికి, మనిషికి ఎంతో ఉపయోగిస్తాయి. మనం అమెరికా వంటి ధనవంతమైన దేశాలతో పోటీ పెట్టుకోనవసరం లేదు. వాటిని గ్రుడ్డిగా అనుకరించనూ అక్కరలేదు. ఎందుకంటే అమెరికా ప్రపంచం యొక్క వైశాల్యంలో 2% వైశాల్యము కలిగి, ప్రపంచ జనసంఖ్యలో 5% మాత్రమే కలిగి ఉన్నది. మనదేశం వైశాల్యములో తక్కువైనా జనసంఖ్య విషయానికొస్తే ప్రపంచ జానాభాలో 16% ఉంది. అమెరికాలో 2% కంటే తక్కువమంది వ్యవసాయంపై ఆధారపడి ఉన్నారు. మనదేశంలో 70% మంది వ్యవసాయమే ఆధారంగా జీవిస్తున్నారు.

ప్రపంచంలోని ఆయిల్ ఉత్పత్తిలో 33% అమెరికా తాను ఉపయోగించుకొనే సామర్థ్యం కలిగి ఉంది. మనమైతే అతి కష్టంగా 100వ భాగం కూడా ఉపయోగించుకోలేము. నిజానికి మనవద్ద ప్రపంచంలో లభించే ఆయిల్‌లో 0.5% కూడా లభ్యంకాదు. మనం ప్రతి సంవత్సరము 5000 కోట్ల రూపాయల కంటే ఎక్కువ ఆయిల్‌ను బయటి దేశాలనుండి తెప్పించుకోవడానికి ఖర్చు చేస్తున్నాం.

దానివల్ల జరిగే వాయు కాలుష్యం సరేసరి. ఈ వాయుకాలుష్యం నివారించడానికై ఢిల్లీలో నియంత్రణ చట్టాలు ఏర్పడ్డాయి. పెట్రోలు, డీజిల్‌తో నడిచే వాహనాల తనిఖీలు జరుగుతున్నాయి. కాలుష్య ప్రమాణం పరీక్షలు జరుపుతారు. ఇది అన్ని పట్టణాలలోను పెరిగిన ప్రస్తుతసమస్య.

భారతదేశంలో వ్యవసాయానుకూలమైన భూమి తలసరి అర ఎకరం మాత్రమే ఉంది. 70% రైతులు చిన్న కమతాలలో ట్రాక్టరుతో పనిచేయడానికి వీలులేదు. దాదాపు 12 కోట్ల ఎకరాలు చవటనేలలే. పనికిరాని బంజరు భూములున్నాయి. వాటిల్లో అంగవిహీనమైనవి, ముసలివి, అయిన గోవంశం యొక్క పేడ మూత్రాలతో ఉత్పాదన శీలతను పెంచవచ్చు. ఈ విషయంలో ట్రాక్టరు ఏ సహాయమూ చేయజాలదు. ఆ మధ్య కేంద్ర వ్యవసాయ మంత్రి ఒకరు ఒక పశుశక్తి సమ్మేళనంలో మాట్లాడుతూ మనకు 7 కోట్ల 40 లక్షల ఎద్దులు, 80 లక్షల దున్నపోతుల వల్ల ప్రతి సంవత్సరం పదివేల కోట్ల రూపాయల విలువ గల 4 వేల కోట్ల హార్స్‌పవర్ శక్తి లభిస్తున్నది అని అన్నారు. గోవంశం వల్ల లభించే శక్తి పర్యావరణ కాలుష్యాన్ని నివారిస్తుంది. పాలపొడిమీద, రసాయనిక ఎరువుల మీద, పురుగు మందులమీద అయ్యే వివరీతమైన విదేశీ మారక ద్రవ్యపు ఖర్చును అది అంటే గోవంశం, ఆదా చేస్తుంది.

భారత్‌లో ఎద్దుల ద్వారా 7 వేల లక్షల టన్నుల (అంటే 70%) వ్యవసాయం లేదా ఇతర పరిశ్రమల యొక్క ఉత్పత్తుల రవాణా జరుగుతున్నది. కాబట్టి ఇతర రవాణా సాధనాలకంటే గూడ ఎద్దులు ఎంతో ముఖ్యమైనవి. ట్రాక్టర్లతో భారత్‌లో నేడు కూడా 30% కంటే ఎక్కువ సేద్యం సాగడం లేదు. విదేశీ విధానం ఆధారంగా ట్రాక్టర్లతో నడిచే వ్యవసాయం భారత రైతుకు ఎంత మాత్రం అనుకూలం కాదు.

ఆవు దూడల చలాకీతనం, గేదెదూడల నిష్క్రియత్వం చూస్తే భారతీయ ఎద్దుల యొక్క ప్రత్యేకత కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఒక ముసలి గోవు పేడతో 4,5 గురు వ్యక్తుల చిన్న కుటుంబానికి వంటకు అవసరమైనంత ఇంధన శక్తి సమకూరుతుంది. ఇక కిరసనాయిలుతో వంట చేసుకొనేవారి పరిస్థితి ఇద్దరికి వంటచేయాలంటే 1/2 లీటరైనా రోజూ కావాలి. పైగా పేడకు విదేశీ మారకద్రవ్యపు ఖర్చు లేదు.

భారతదేశంలో ఎడ్లకు బదులు ట్రాక్టర్లు ఉపయోగించాలంటే 2 కోట్ల ట్రాక్టర్లు అవసరమవుతాయి. దీనికయ్యే 8 లక్షల కోట్ల రూపాయల కొనుగోలు ఖర్చు మన శక్తికి మించినది. అవి నడిపించడం కోసం వందలాది కోట్ల విలువైన డీజలు బయటిదేశాల నుండి తెప్పించుకోవాలి. గోసంతతి ద్వారా పొందిన ఎరువుల రసాయనిక ఎరువుల కంటే 5 రెట్లు ఎక్కువ పంటనివ్వగలవు. రసాయనిక ఎరువులవల్ల బంజరుగా మారిపోయే భూములకు సేంద్రియ ఎరువులవల్ల పూర్తి రక్షణ లభిస్తుంది.

భారతదేశపు ఆర్థికవ్యవస్థలో పశుశక్తికి ఎంతో ప్రాధాన్యత ఉంది. మనదేశంలో నడిచే దాదాపు 4 కోట్ల నాగళ్ళు, 1½ కోట్ల ఎడ్లబండ్ల యొక్క చాలక శక్తియే పశుశక్తి. ఈ పశు ధనం యొక్క క్షమతను పెంచడం, వాటిని శాస్త్రీయంగా అభివృద్ధి పరచడం భారతదేశంలో వ్యవసాయోత్పత్తులు, రవాణా సౌకర్యాల దృష్ట్యా ఎంతో అవసరం. ఎడ్లబండ్లకు రబ్బరు చక్రాలు అమర్చడం వల్ల వాటి క్షమత మరింత పెరిగే అవకాశం ఉంది. మరింత అనుకూలత కూడా ఏర్పడుతుంది. గుజరాత్‌లో ఒకప్పటి గవర్నర్ శ్రీమన్నారాయణగారు జపాన్ నుండి తిరిగి వచ్చి ఇలా అన్నారు. “ఇప్పుడు జపాన్ రైతు కూడా చిన్న, పెద్ద ట్రాక్టర్లకు బదులు ఎద్దులు, ఆవులు వాడడం

ప్రారంభించాడు. ఒక రైతును అడిగితే అతడు 'ఇంతవరకు మేము యంత్రాలు, కృత్రిమ ఎరువు వాడుతూ వచ్చాం. తత్ఫలితంగా మా భూములు నాశనమౌతున్నాయని తెలుసుకున్నాం. కనుక ఆవులు, ఎద్దులు వాడడం ప్రారంభించాం' అని అన్నాడని శ్రీమన్నారాయణగారు చెప్పారు. "ఈ యంత్రాలు పాలు ఇవ్వవు - పేడా ఇవ్వవు" అనికూడా ఆ జపాన్ రైతు అన్నాడట.

ఆధునిక యుగపు విశ్వవిఖ్యాత విజ్ఞాన వేత్త ఐన్‌స్టీన్ భారతదేశానికి ఒక సందేశాన్ని పంపుతూ "భారతీయులు రసాయనిక ఎరువు, ట్రాక్టరు పద్ధతి వ్యవసాయాల జోలికి వెళ్ళవద్దు. ఎందుకంటే ఆ పద్ధతులు అవలంబించిన అమెరికాలోని భూమి యొక్క ఉత్పాదకశక్తి 400 సంవత్సరాలలో సమాప్తమై పోనుంది. భారత్‌లో వేల సంవత్సరాల నుండి గోవంశం ఆధారంగా వ్యవసాయం జరుగుతున్నప్పటికీ భూమి యొక్క ఉత్పాదక శక్తి ఏమాత్రం చెదిరిపోలేదు" అన్నారు. 1951లో ఐన్‌స్టీన్ ఇంకా ఇలా అన్నారు. "ట్రాక్టరుతో దున్నబడే వ్యవసాయ భూమిలో ఒక వేయి సంవత్సరాల తర్వాత ఒక్క గడ్డిపోచకూడా మొలవదు" అని. ఇటీవల భోపాల్, మీరట్‌లలో ఎద్దులులాగే దేశీయ ట్రాక్టరు తయారుచేశారు. ఇది రైతులకెంతో ఉపయోగకారి. నేడు భారతీయ వ్యవసాయ వ్యవస్థకు అవసరమైన పనిముట్ల తయారీకై ప్రత్యేక పరిశోధనలు జరగాలి. ఈ రంగంలో మనం బాగా వెనకబడ్డాం.

మనదేశీయ, సర్వోత్తమ ట్రాక్టర్ అంటే ఎద్దు. ఎడ్ల వ్యవసాయానికి ప్రోత్సాహం లభించాలి. విదేశీయులను గ్రుడ్డిగా అనుసరించడం భారత్ ఆర్థిక వ్యవస్థకు సరిపోదు. భారతీయ పశుసంపద పశువధశాలలకు ఎర కాకుండా భారత ఆర్థికవిధానాన్ని దృఢపరిచేందుకు ఉపయోగపడితే మంచిది.

# కదిలే శక్తికేంద్రం ఆవు

భారతదేశంలో నేడు ఇంధన వాయువు (గ్యాస్) మరియు విద్యుత్తుల యొక్క కొరత చాలా ఉంది. మనవద్ద లభించే తక్కువ ఖరీదు సాధనాల ద్వారా కాక భారీ వ్యయంతో కూడిన సాధనాల ద్వారా గ్యాసును నేడు మనం ఉత్పత్తి చేసుకొంటున్నాం. 19 కిలోల గ్యాసు సిలెండర్‌కు ఈ రోజున మార్కెట్‌లో రూ. 1000/- ఉంది. ఇది ముందు ముందు మరింత పెరగనూ వచ్చు. పెద్ద పెద్ద ఆనకట్టలు కట్టి జలవిద్యుత్తును, డీజిలు లేదా బొగ్గు విపరీతంగా వాడి థర్మల్‌విద్యుత్తును ఉత్పత్తి చేసుకొంటున్నాం. ఇంత చేసినా మన అవసరాలకది సరిపోవడం లేదు. సరికదా కొన్ని ప్రమాదాలు కూడా వాటిలో పొంచి ఉన్నాయి. జలవిద్యుత్ కేంద్రాల వద్ద గల ఆనకట్టలు కూలిపోతాయేమోనని, దానివల్ల అపార నష్టం సంభవిస్తుందేమోనని భయం ఎప్పుడూ ఉండనే ఉంటుంది. ఆనకట్ట వద్ద పూడికలు, మట్టి పెరిగిపోవడం మరోసమస్య. థర్మల్ విద్యుత్తుకు అవసరమైన ముడి పదార్థాలు మనవద్ద అంతంత మాత్రంగానే ఉన్నాయి.

విదేశీ భావదాస్యంలో మునిగిన మనం మనదైన గోవంశం అందించే గోమయం, గోమూత్రంలోని అద్భుత శక్తిని అవహేళన చేశాం. గోమయం చేత గ్యాసు ఉత్పత్తిని భారీగా చేపట్టవచ్చు. అలా బయటికి వచ్చే మడ్డి పదార్థాన్ని ఎంతో విలువైన సేంద్రియ ఎరువుగా పంటలకు ఉపయోగించవచ్చు కూడా. మన ఆర్థిక వ్యవస్థకు తగినట్లు గోవంశాన్ని మనం సరియైన పద్ధతిలో ఉపయోగించుకోకపోగా వాటిని చంపివేసి మాంసం ఎగుమతి చేసి డబ్బు సంపాదించే వ్యాపారంలో పడ్డాం. గోమయ, గోమూత్రాలతో గ్యాసు ఉత్పత్తిని ప్రారంభిస్తే దానివల్ల వంటచెరకు, పిడకలు మిగిలిపోతాయి. పరిశోధన చేసి గ్యాసును సిలిండర్లలో నింపి దేశవ్యాప్తంగా సరఫరాలు కూడా చేపట్టవచ్చు.

గోబర్ గ్యాసుతో (అహమదాబాద్ సమీపంలోని ఈడర్‌లో) కిర్లోస్కర్ ఇంజన్‌ను కలిపి విద్యుత్తు ఉత్పత్తి జరుగుతున్నది. అలా చిన్న చిన్న యూనిట్లు అంటే గ్రామ గ్రామాలలో ఇలాంటి ఉత్పత్తి చేపట్టి లేదా గోశాలలు – గోసదనాలు – పశుకేంద్రాలు ఉన్న చోట్లలో ఇలాంటి ప్రయత్నాలు చేసి గ్రామీణ భాగంలో విద్యుత్ యొక్క అవసరాలను చాలావరకు పూర్తి చేయవచ్చును. భారీ యంత్రసామగ్రితో హైడ్రో యూనిట్లను, థర్మల్ యూనిట్లను నెలకొల్పే బదులు చిన్న యూనిట్లతో ఈ ఉత్పత్తిని పెంచడం నేటి అవసరం. ఇది సులభంగాను, తక్కువ ఖర్చుతోను జరిగే పని. ఏ ప్రమాదాలు లేని పని. సమాజం ప్రభుత్వంపై ఆధారపడకుండా స్వయంసమృద్ధి సాధించగలిగినపని.

ఒక్క గ్యాసు ప్లాంటులో 10 కిలోల పేడతో 12 ఘనపుటడుగుల గ్యాసు లభిస్తుంది. కొత్తగా వచ్చిన గ్యాసు వంట పొయ్యిలపైన ఒక వ్యక్తి అవసరమైన వంటకు 6 ఘనపు అడుగుల గ్యాసు సరిపోతుంది. పశువుల అన్నిటి పేడ ఈ విధంగా గ్యాసుగా మార్చగలిగితే అది 60 కోట్ల మంది అవసరాలకు సరిపోతుంది. పట్టణాల్లో నేడు లభిస్తున్న గ్యాసు క్రూడాయిల్ ద్వారా తయారవుతున్నది. ఆయిల్ ధరలు పెరుగుతున్నాయి. మరో ప్రక్క గ్యాసు యొక్క డిమాండు ఎప్పటికప్పుడు పెరుగుతూనే పోతున్నది. పశువులు గడ్డి, ఆకులు, అలములు మేసి పేడను అందిస్తాయి. పేడతో గోబర్ గ్యాసు ప్లాంట్లు, వాటివల్ల విద్యుత్తు లభిస్తుంది. ఈ దృష్టితోనైనా పశువులు రక్షించబడతాయి. చెట్లు నరకడం మానితే వాతావరణ కాలుష్యం తగ్గుతుంది. ప్రజలకు దానివల్ల ఆరోగ్యం లభిస్తుంది.

గోసంతతి అంతా – పనికిరావనుకొనే పశువులు కూడా పేడనయితే తప్పక ఇస్తాయి. గ్యాసు ప్లాంట్లలో పేడ మురిగినట్లే, ఎరువు గుంతలలో ఆకులు అలములతో కలిసి పేడ అక్కడా మురుగుతుంది. భేదమేమిటంటే

ఎరువు గుంతలలో ప్రాణవాయువుతో కలిసి అది మురుగుతుంది. అందులోనుండి కార్బన్‌డైఆక్సైడ్ వెలువడుతుంది. గ్యాసు యంత్రాలలో ప్రాణ వాయువు లేకుండానే మురిగి గుంతలలోని ఎరువుకంటే రెట్టింపు నైట్రోజన్ కలిగి ఉంటుంది. పంటరాబడిని పెంచడంలో నైట్రోజన్ పాత్ర ఎంతో ఉంది. నైట్రోజన్ కంటే కూడా 'హ్యూమస్' యొక్క పాత్ర గొప్పది. ఎందుకంటే అది భూమిలో జీవాణువులను సుసమృద్ధం చేస్తుంది. గ్యాసు ప్లాంట్ల నుండి వెలువడే మడ్డిలో ఈ 'హ్యూమస్' ఎక్కువ ఉండటం వల్ల అలా లభించిన ఎరువు అత్యంత ఉపయోగదాయకమవుతుంది.

ప్రతి పశువు సరాసరి 10 కిలోల పేడ ఇస్తుంది. దీనిలో కొంత పెంటకుప్పలో పడి ఎరువవుతుంది. సుమారు 3వ భాగం పిడకల తయారీకి ఉపయోగపడి అవి ఆ రూపంలో కాల్చబడతాయి. అయితే అలా కాల్చబడిన పిడకల యొక్క వేడిలో కేవలం 13% మాత్రమే ఉపయోగం అవుతుంది. మిగిలిన వేడి వ్యర్థంగానే పోతుంది. కాని గ్యాసు పొయ్యిల ద్వారా ఉత్పత్తి కాబడే వేడిమి 60% వరకు ఉపయోగానికి  వస్తుంది. పెంటకుప్పలో 1% అయితే గ్యాసు ప్లాంటు మడ్డి ఎరువులో 2% నైట్రోజన్ ఉంటుంది.

దేశంలో లభించే మొత్తం గోమూత్రం, గోమయం ఉపయోగించ గలిగితే ఎంతో ఎక్కువ మొత్తంలో సేంద్రియ ఎరువు, వంటగ్యాసు ఉత్పత్తి చేసి దేశం యొక్క అవసరాలను చాలా వరకు పూర్తి చేయగలుగుతాం. 24 కోట్ల పశువుల వల్ల ప్రతిరోజు కనీసం 25 లక్షల టన్నుల పేడ వస్తుంది. 25 కిలోల పేడతో 1 ఘనపు మీటరు గ్యాసు చొప్పున ప్రతిరోజు 10 కోట్ల ఘనపు మీటర్ల గ్యాసు లభిస్తుంది. ఇది 20 కోట్ల మంది అవసరాలకు సరిపోతుంది. దీనివల్ల బయట దేశాలనుండి దిగుమతి చేసుకొంటున్న ఆయిల్, కిరోసిన్‌ల భారం ఎంతగానో తగ్గిపోతుంది.

ప్రతి సంవత్సరం 90 టన్నుల పేడతో 2% చొప్పున లెక్కవేసినా మన పంట భూములకు తగినంత నైట్రోజన్ మనకు లభిస్తుంది. పశువులు మేసే ఆహారంలో పోషక తత్వాలు ఉన్నందువల్ల వాటివల్ల లభించే సేంద్రియ ఎరువుతో భూమి యొక్క ఉత్పాదక శక్తి పెరుగుతుంది. అంతేగాక అలా పండిన ధాన్యంలో రుచి, తాజాదనం పెరిగి రసాయనిక ఎరువుల ద్వారా వచ్చే రోగాల బారి నుండి రక్షణ పొందుతాం. 1981వ సంవత్సరంలో నైరోబీలో జరిగిన ఒక శక్తి మహాసభలో "భారత్‌లోని పశుశక్తి దేశంలో స్థాపించబడిన విద్యుత్ కేంద్రాలన్నింటికంటే ఎంతో అధిక శక్తిని అందివ్వగలదు" అని ఆనాటి మన ప్రధాని ఇందిరాగాంధీ గారు అన్నారు. ఆనాటి ధరల ప్రకారం అప్పటి పశుశక్తి వల్ల 6 వేల కోట్ల రూపాయల పాలు, 5 వేల కోట్ల రూపాయల త్రోపుడు శక్తి, 3 వేల కోట్ల రూపాయల సేంద్రియ ఎరువులు, 2 వేల కోట్ల గ్యాసు ఇలా మొత్తం 16 వేల కోట్ల రూపాయలు ఆర్థికలాభం చేకూరగలదని అంచనా వేశారు.

నేడు అనేక స్థలాల్లో గోమూత్రం వల్ల గోడగడియారాలు నడుస్తున్నాయి. గోమూత్రంలోని విద్యుత్‌వల్ల కాలిక్యులేటర్లు, ట్రాన్సిస్టర్ రేడియో, చిన్న టెలివిజన్ సెట్, ఇంకా ట్యూబ్‌లైట్లు పనిచేస్తున్నాయి.

1998 జనవరిలో ప్రయాగలో జరిగిన మాఘ మేళాలలో వీటిని ప్రదర్శించిన స్టాలు ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. అందరి ప్రశంసలనం దుకున్నది. గోరక్షాసంస్థల ద్వారా గోమూత్ర ఔషధాలు, గోబర్ గ్యాసు ప్లాంటు, ఎరువులు, క్రిమికీటక నివారణులు, విద్యుత్తు ఉత్పత్తి మొదలైన వాటితో ప్రదర్శనశాల నిర్వహించబడింది. నేటి విద్యుత్ కేంద్రాలు ఇస్తున్న దానికంటే మించిన విద్యుత్ శక్తిని దాదాపు 40 వేల మెగావాట్లను (దాదాపు 27 వేల కోట్ల రూపాయల విలువ గలది) పశుధనం ద్వారా చేసుకోవచ్చు. దీనివల్ల పర్యావరణకాలుష్యం సమస్య పూర్తిగా తొలగిపోతుంది.

నేడు భారత్‌లో ఉపయోగపడుతున్న వ్యావసాయిక శక్తిలో 90% గోసంతతి ద్వారానే లభిస్తుంది. నాగలి దున్నడం, చెరుకు గానుగలు, నీటి యంత్రాలు, బరువులు లాగడం మొదలైన పనులన్నీ ఎద్దుల ద్వారానే జరుగుతున్నాయి. ఇదంతా పెట్రోలు, డీజిలు ద్వారా జరిగినట్లైతే ఇప్పటికంటే 100 రెట్లు అధిక విదేశీ మారక ద్రవ్యం ఆయిల్ ఉత్పత్తి చేసే దేశాలకు మనం కట్టబెట్టి ఉండేవాళ్ళం.

దేశంలోని పశుసంపదను చక్కగా వినియోగించుకొన్నట్లయితే నేడు విద్యుత్కేంద్రాలు ఉత్పత్తి చేసే విద్యుచ్ఛక్తి కన్న రెట్టింపు విద్యుత్‌ను అవి నిర్మాణం చేయగలుగుతాయి. మరో విధంగా అయితే కేవలం విద్యుత్తు కోసమే 30 వేల కోట్ల రూపాయలు అవసరమవుతాయి. ఇది తలకు మించిన భారం కాక తప్పదు.

ప్రతి పెద్ద గ్రామంలోను గోశాల, గోసదనం నెలకొల్పడం నేటి అవశ్యకత. పేడ అంతా సేకరించి అక్కడ గోబర్ గ్యాసు ప్లాంట్లు పెట్టాలి. స్థానిక అవసరాలకు గ్యాసునుండి విద్యుత్తును. ఉత్పత్తిచేసి వీలైనంత వరకు పూర్తి చేయాలి. అలా ప్రజల అవసరం తీరుతుంది. ప్రజలు ఎక్కువగా ప్రభుత్వంపై ఆధారపడవలసిన అవసరం లేకుండా పోతుంది. 100 పశువులు ఉంటే వాటితో కనీసం 1 మెగావాట్ విద్యుత్తు తయారు చేసుకోవచ్చని ఒక అంచనా. గ్రామీణులకు వంటగ్యాసు కూడా లభిస్తుంది. పంజాబ్, తమిళనాడు వంటి రాష్ట్రాలలో ప్రజలకు ఉచిత విద్యుత్తు సరఫరా చేస్తామనే రాజకీయవాదుల ఆకర్షక వాగ్దానాలకు ఎరగానక్కరలేని స్థితి ఏర్పడుతుంది. సులభంగా విద్యుత్తును స్థానికంగా తయారుచేసుకోగలిగిన వీలున్నప్పుడు ప్రభుత్వంపై ఆధారపడాల్సిన అవసరమేముంటుంది?

ఈడర (గుజరాత్) లో ప్రయోగాలు చేస్తున్న డా॥ కువర్‌జీ భాయ్ జాధవ్ గారి అనుభవం ప్రకారం ఒక గోవు ఇచ్చే 10 కిలోల పేడతో

ప్రతిరోజు 0.34 ఘనపు మీటర్ల బయోగ్యాసు తయారవుతున్నది. దేశంలోని మొత్తం 19 కోట్ల పశువులతో 6.46 కోట్ల విద్యుత్తు తయారవుతుంది. దాని ఉత్పత్తి ఖర్చు యూనిట్‌కు 50 పైసల చొప్పున 4.94 కోట్ల రూపాయలవుతుంది. ఈ విద్యుత్తు మార్కెట్‌లో యూనిట్‌కు 2 రూపాయల చొప్పన లెక్కవేస్తే 19.76 కోట్ల రూపాయలవుతుంది. దేశం యొక్క ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల యొక్క విద్యుత్తు అవసరాలను తీర్చడంలో ఇది అత్యంత ప్రధానమైన సాధనం కాగలదు.

## ఆవు - పర్యావరణం

దేశీయ గోవంశం యొక్క గోమూత్రం, గోమయాలు అంటే అవి మురికి పదార్థాలు ఏమాత్రం కావు. మురికి పదార్థాలను శుద్ధీకరించే సాధనాలు అవి. పర్యావరణ కాలుష్యం కాదు. ఆ కాలుష్యాన్ని నిర్మూలించేవి, పర్యావరణ మిత్రులవి. చెత్త, వ్యర్థపదార్థాలు, ఆకులు, కూరగాయలు, పండ్ల తొక్కలు మొదలైనవి వేసిన కుప్పలపై పేడ, గోమూత్రం చిలకరించడం ద్వారా ఈగలు, దోమల ఉత్పత్తి ఆగిపోతుంది. పైగా ఆ కుప్పలు సేంద్రియ ఎరువుగా మారి పంటలకు ఉపయోగపడతాయి. ఇలాంటి ఎరువు కుప్పలలో 1% మరియు గ్యాసు ప్లాంటు మడ్డీ ఎరువులో 2% నైట్రోజన్ ఉంటుంది.

ప్రాచీన కాలంలో వైభవ శిఖరాలందుకున్న సభ్యత, సంస్కృతికి వారసులమైన మనం పరాయి ప్రభుత్వాల కాలంలో కేవలం శారీరకంగానే కాక మానసికంగా కూడా వారికి బానిసలమయి పోవడం నిజంగా మన దురదృష్టం. విదేశాలలో వారికి ఏది అనుకూలిస్తే అది మన దేశంలో మనకూ మంచిదే అనే ఒక భ్రమపూరితమైన వలలో పడ్డాం. స్వాతంత్ర్యానంతరం ఆ వల మనపై మరింత బిగుసుకుంటున్నది. మన గోవంశం విషయంలోనే ఇది నిరూపితమవుతున్నది.

ఢిల్లీ వంటి మహానగరాల్లో కాంక్రీటు, సిమెంట్, మార్బల్ వంటి విలువైన సామగ్రితో స్వచ్ఛమైన కాలనీలు నిర్మించబడ్డాయి. వాటిలో ప్రతి కుటుంబానికి ఏదో ఒక వాహనం ఉంటుంది. దానిని ఉంచేందుకు గారేజి కూడా చాలా గృహాల్లో ఉంటుంది. పశ్చిమ దేశాలననుకరిస్తూ మంచి కుక్కను పెంచడం జరుగుతున్నది. కాని గోమాతను ఇంట్లో పెంచుకొనే ఏర్పాటు మాత్రం ఎవరూ చేయరు. ఆశ్చర్యమేమంటే కాలుష్యం నిర్మాణం చేసి వ్యాపింపచేసే వాహనాలు కావాలి, ఎంత మురికి చేసినా సరే కుక్క మనకు కావాలి. అదే ఆధునిక జీవితానికి కొలబద్దగా భావిస్తాము. కాని గోమాతను గౌరవించము. మనం మన ఆలోచనా విధానాన్ని మార్చుకోవాలి, పర్యావరణాన్ని సంరక్షించే గోవులను ఉన్నత వర్గాల వారు నివసించే కాలనీలలో తెచ్చిపెట్టి పర్యావరణ కాలుష్యాన్ని అరికట్టడమే గాక వాహనాల పొగలవల్ల ఏర్పడే వాతావరణ కాలుష్యాన్ని అదుపులో పెట్టాలి. గోవుల పేడతో అలికిన ఇండ్లలోకి అణు వికిరణ దుష్ప్రభావం ప్రవేశించదని ఋజువయ్యింది. కనుక ఇళ్ళను గోమూత్రం, గోమయంతో అలికే అలవాటు చేసుకొని కాపాడుకోవాలి.

ప్రతివ్యక్తీ గోవులను పోషించడం ఈ రోజుల్లో ఎలా సాధ్యం అని ఒక బలమైన వాదన వినిపిస్తుంది. కుటుంబాలు విడివిడిగా ఉంటున్నాయి. పూర్వంలాగా ఉమ్మడి కుటుంబాలు లేవు. అందరూ ఎవరి పనుల్లో వారు నిమగ్నమై ఉంటారు. అయితే సామూహిక సామాజిక జీవనాన్ని పూర్తిగా మరచిపోవాలని కాదుగదా ఆధునిక జీవితపు అర్థము, ఆశయము! ఒక్కొక్కరు కాకపోయినా నాలుగు కుటంబాలు కలిసి పాలిచ్చే పదిగోవులు ఉంచే ఏర్పాటు చేసి చక్కగా పాలు, పెరుగు, వెన్న, నేయిలతో తమతమ కుటుంబాలలో చక్కని ఆరోగ్యాన్ని, ఆనందాన్ని అనుభవించవచ్చు. దానితోపాటు తమచుట్టూరా పర్యావరణకాలుష్యం లేకుండా చూసుకోవచ్చు. పశ్చిమ

దేశాల్లో మన సామూహిక జీవన విధానం ఎడల ఆకర్షణ పెరుగుతున్నది. కాని మనమేమో ఇక్కడ ప్రక్క ఇంటి వారిని కూడా చూసి, పలకరించి ఎరగము. ఈ కారణంగా దొంగతనాలు, దాడులు, హత్యలు రోజువారీ సంఘటన లౌతున్నాయి.

గోవులు పెంచేవారి వాడలు ఇతర కాలనీలకు ముఖ్యంగా తెల్ల చొక్కావారి కాలనీలకు దూరంగా ఉంచడం ఆత్మహత్యా సదృశమైన చర్య. గోమూత్రం, గోమయం. అసహ్యం గొలిపే మురికి కాబట్టి వాటిని జనావాసాలకు దూరంగా ఉంచాలనుకోవడం పాశ్చాత్య ప్రభావానికి, వారి ఆలోచనా విధానానికి పూర్తిగా తమను తాము సమర్పించుకొన్న దాని పరిణామం అనక తప్పదు. గోబర్ గ్యాసు ప్లాంట్ల వల్ల వంటగ్యాసు, విద్యుత్తు వ్యవస్థ చేసుకోవడం కూడా ఎంతో లాభకారిగా ఉంటుంది. దీనివల్ల ఇంధనం యొక్క ఆదా మరియు కిరోసిన్ మొదలైన వాటివల్ల ఏర్పడే కాలుష్యం నుండి ముక్తి లభిస్తుంది. కనుక ఈ పద్ధతిలో ఆలోచించడం మంచిది.

గోమూత్రం, గోమయాలను సేంద్రియ ఎరువులు, కీటక నియంత్రక ఔషధాల తయారీకి ఉపయోగించుకోవడంలోనే మన విజ్ఞత ఉంది. దీనివల్ల ప్రజలకు విషరహితము, రుచిగల ధాన్యం లభిస్తుంది. గ్రామాల్లో కొంత పేడ పిడకల రూపంలో వాడబడినప్పటికీ ఎక్కువ భాగం ఎరువుగానే ఉపయోగపడుతుంది. పిడకల వాడకం వల్ల చెట్ల నరికివేత తగ్గిపోతుంది. అలా వనరక్షణ వీలవుతుంది. ఎక్కువ చెట్లను పెంచడం, పోషించడం పర్యావరణ శుద్ధత దృష్ట్యా ఎంతో అవసరం. చిరాపుంజి పర్వతప్రాంతాలు ప్రపంచంలోకెల్లా అతి ఎక్కువ వర్షపాతం కలిగిన ప్రాంతాలు. అక్కడ అడ్డూ అదుపు లేకుండా చెట్లు నరికివేసిన కారణంగా ఆ పర్వత ప్రాంతాల్లోని పొలాలు సైతం నేడు ఊసర క్షేత్రంగా మారిపోయాయి. దాని పూర్వ గౌరవాన్ని చిరాపుంజి కోల్పోయింది.

దేశంలో ఎక్కువకెక్కువ గోశాలలు, గోసదనాలు నెలకొల్పి వృక్షాలు నాటే పని వారికీ అప్పగించవచ్చు. దేశవాళీ గోసంతతిని పెంచడానికి వాటి పేడకోసం గోచర భూమికూడా అక్కడే లభింపచేసుకోవచ్చు. తోడుగా మొక్కలు నాటే కార్యక్రమాన్ని చేపట్టవచ్చు. ఓజోన్ పొరలో రంధ్రాలు పడుతున్నాయన్న భయంనుండి కొంతవరకైనా మనం బయటపడవచ్చు.

గ్లోబలైజేషన్ మరియు స్వేచ్ఛా విపణికి సంబంధించిన 1991 సంవత్సరం క్రొత్త విధానాన్ని అనుసరించి దేశంలో 100% మాంస ఎగుమతి లక్ష్యంగా యాంత్రిక పశువధశాలలకు మరింత ప్రోత్సాహం ఇవ్వబడింది. ప్రపంచ వ్యాపార సంస్థ తక్కువ ధరకు ముడి పదార్థాలు సంపాదించుకొనే యూరపుదేశాల పరిశ్రమలయొక్క హక్కును ఎక్కువ ప్రాధాన్యత గలదిగా భావిస్తుంది. అదే మనదైన భారతీయ సంస్కృతి యొక్క విడదీయరాని అంగాలైన జీవించే, పనిచేసే హక్కులను పనికిరానివిగా భావిస్తుంది. వ్యాపారము, రవాణాలపై శుల్కాలకు సంబంధించిన సాధారణ ఒప్పందము (GATT) యొక్క 11వ అధినియమము ఎగుమతి దిగుమతులపై ఎలాంటి బంధనాలు విధించినా అవి న్యాయపూర్ణం కావనీ, సాంస్కృతిక, పర్యావరణ, ఆర్థిక పరంగా అవసరమనిపించినప్పటికీ ఎలాంటి నిర్బంధాలు ఆయా దేశాలు విధించరాదని నిర్వచించింది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వ్యవసాయ మంత్రిత్వశాఖలు పశువధశాలలు స్థాపించడానికి 100% ప్రభుత్వ గ్రాంటును, అదేవిధంగా అనేక రాయితీలను ఇస్తున్నాయి. కేంద్ర పర్యావరణ శాఖ యొక్క 1996 సంవత్సరపు ఒక నివేదిక ప్రకారం గత 5 సంవత్సరాలలో కనీసం 32,000 అనధికార, చట్ట సమ్మతం కాని పశువధశాలలు తెరువబడ్డాయి. అంతకు ముందు కేవలం 3,600 చట్టబద్ధమైనవి. లైసెన్సు పొందినవి ఉండేవి. ఈ అంచనా

కూడా వాస్తవానికి తక్కువే కావచ్చు. 1975వ సంవత్సరం మొత్తం మాంస ఎగుమతులు 6,195 టన్నులుండగా 1995 వచ్చేసరికి అంటే 20 సంవత్సరాలలో 1,37,334 టన్నులకు అంటే 20 రెట్లు పెరిగి పోయింది. ఆవులు గేదెల మొత్తం మాంస ఎగుమతులు 1975లో 3412 టన్నులుండగా 1995లో 1,25,282 టన్నులకు అంటే 33.7 రెట్లు పెరిగిపోయింది. ఈ మొత్తం ఎగుమతుల విలువ 1975లో 85,17,000 డాలర్లు కాగా 1995లో అది 14,45,50,000 డాలర్లు అయింది.

ప్రతి సంవత్సరం పెరిగే పశుసంఖ్యను మించిన అనుపాతంలో మాంస ఎగుమతులు జరుగుతుండడంతో దేశంలో పశు సంఖ్య తీవ్రగతిలో తగ్గిపోతూ ఉన్నది. గోసంతతి కూడా క్రమక్రమంగా తగ్గిపోతున్నది. 1951లో ప్రతి 1000 మందికి 700 పశుసంఖ్య ఉంటే అది 2001 సంవత్సరానికి 400కి తగ్గింది. ఇలాగే కొనసాగితే 2011 సంవత్సరానికి 20కి పడిపోతుంది. ఉపయోగపెట్టగలిగిన పశువులను 'నిరుపయోగం' అని ప్రకటించి వాటిని వధ చేస్తుండడం చాలా దుఃఖకరమైన విషయం. ప్రతి సంవత్సరం బంగ్లాదేశ్, పాకిస్తాన్‌లకు 20,000 పశువులు దొంగచాటుగా రవాణా అవుతున్నాయి.

మన దేశవాలీ గోజాతులలో ఇక్కడి వాతావరణానికి తట్టుకొనే గుణం, రోగనిరోధక శక్తితోపాటు ప్రత్యేక ప్రయోజనాలు, సామాజిక, సాంస్కృతిక విలువలు ఉన్నాయి. అవి అందుకోసం అలాగే రక్షింపబడాల్సిన అవసరమెంతైనా ఉంది. ఇవి భారత్‌లో వ్యవసాయానికి ఆధారభూతమైన సజీవ నేస్తాలు. సేంద్రియ ఎరువులు, శక్తికి స్రోతస్సులు. మాంసం. చర్మాల ఎగుమతి వ్యాపారంతో జరిగేది అభివృద్ధి కాదు, అది వినాశనానికే వేసుకొంటున్న బాట. **ఒక పశువధశాలనుండి 20 కోట్ల రూపాయల ఎగుమతులు అవుతున్నాయనుకుంటే అక్కడ వధకు గురయ్యే పశువులతో**

**తయారుచేయదగిన ఎరువులు, శక్తి విలువ 910 కోట్ల రూపాయలను మనం కోల్పోతున్నామన్నమాట. ఆ రకంగా ఆర్థిక వినాశనం కొని తెచ్చుకొంటున్నాము. దీనివల్ల భారతదేశంలో వ్యవసాయం అస్థిరతకు గురై, పేదరికం మరింత పెరిగిపోతుంది.**

భారత్‌వంటి వ్యవసాయ వ్యవస్థలలో పారిశ్రామిక దేశాలలో కన్న భిన్నంగా పశువుల ప్రాధాన్యత, వాటిపట్ల దృష్టికోణం ఉంటుంది. ఆ దేశాల్లో వ్యవసాయోత్పత్తుల కంటే కేవలం డయిరీ ఉత్పత్తులకోసమే, మాంసం కోసమే పశువుల పోషణ జరుగుతుంది. భారత్‌లో అవి డయిరీ, వ్యవసాయం రెంటికీ ఆధారంగా భావించబడతాయి. వీటికోసం సంకరజాతి పశువులను సృష్టించడం దేశావాళీ రకాల పట్ల పెద్ద దెబ్బే అవుతుంది. 1996లో విశ్వ ఆహార వ్యవసాయ సంస్థనుండి వెలువడిన ఒక నివేదిక భారత్‌లో దేశవాళీ రకాలు తొందరగా కనుమరుగైపోతు న్నాయని పేర్కొన్నది. మన ఆంధ్రప్రదేశ్‌కు చెందిన పుంగనూరు సంతతి ఆవు సుమారుగా అదృశ్యమైంది. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఒంగోలు జాతి సంతతి అరుదుగానే లభిస్తోంది. ఈ స్వదేశీ సంతతికి చెందిన ఆవులు నేడు 32 తెగలు మాత్రమే లభ్యమవుతున్నాయి. వ్యవసాయం స్థిరంగా వేళ్లూనుకోవాలంటే పశువులలోను, పంటలలోను వివిధత్వాన్ని పునర్వికాసం కావించాలి.

పర్యావరణ కాలుష్య నివారణకు పశువులను రక్షించడం, పోషించడం ఎంతో అవసరం. పశురక్షణ పట్ల శ్రద్ధ లేకపోవడం వల్ల దేశంలోని నదులలో నీళ్ళు కాలుష్యానికి గురవుతున్నాయి. త్రాగేనీటికి కటకట ఏర్పడుతున్నది. శాస్త్రజ్ఞులు చెప్పేదాన్ని బట్టి పశువధ కారణంగా భూకంపాలు తరచుగా సంభవించి జనవినాశనానికి కూడా కారణభూతమవుతున్నాయి.

గోసంతతిని రక్షించడంలో భారతీయ ఆర్థిక వ్యవస్థ యొక్క ప్రగతి ఆధారపడింది. మాంసం, చర్మాల ఎగుమతికి బదులు గోరక్షణ, గోపాలన,

సంవర్ధనలు చేపట్టితే ఎన్నో రెట్ల ఆదాయాన్ని మనం పెంచవచ్చు. దానివల్ల పర్యావరణ శుద్ధి, ఆరోగ్యలబ్ధి, సుఖసమృద్ధితో ప్రజాజీవనం ఆనందమయం అవుతుంది. మన దృష్టి కోణం గ్రామీణ ఆర్థికవ్యవస్థకు, మన సంస్కృతికి అనుకూలంగా, పూరకంగా ఉండాలి.

## గోసంరక్షణకై ఉద్యమాలు

స్వామి దయానంద సరస్వతి 1881 నుండి 1892 వరకు గోరక్షణకై ఉద్యమించారు. **'గోకరుణానిధి'** పుస్తకాన్ని వ్రాశారు. ఆంగ్లేయ పాలకులకు నచ్చచెప్పారు. కొందరు ఆంగ్లేయ అధికార్లు వారి తర్కాన్ని విని గోమాంసాన్ని తినడం మానివేశారు కూడా. భారతీయులలో గోసంరక్షణపై అభిప్రాయాన్ని కూడగట్టారు.

భారతదేశం వ్యవసాయ ప్రధానమైన దేశం. నేటికీ జనాభాలో దాదాపు 70 శాతం ప్రజలు వ్యవసాయంపై ఆధారపడి జీవించేవారున్నారు. దేశం యొక్క జాతీయ ఆదాయంలో 26 శాతం వ్యవసాయం నుండి లభిస్తుంది. వ్యవసాయానికి మూలాధారం గోవంశం. గోవు - వ్యవసాయం - ఒకదానిపై ఒకటి ఆధారపడిన ఈ అన్యోన్యాశ్రిత సంబంధాన్నే 'శ్వేతక్రాంతి' అని నేడు పిలుస్తున్నారు. ఋషి దయానందులవారు ఈ దృష్టితోనే 'గో కృష్యాది రక్షిణీసభ' అంటే గోవు మరియు వ్యవసాయాదుల రక్షణకై ఒక సంఘాన్ని స్థాపించాలన్న ఆలోచనను అందించారు. వారు వ్రాసిన 'గోకరుణానిధి' అన్న పుస్తకం 1937లో మొదటిసారి ముద్రించబడింది. ఇది రెండు భాగాల్లో ఉంది. మొదటిభాగంలో గోవులు మొదలైన పశువులను చంపి తినేకన్నా రక్షించి వాటిద్వారా లభ్యమయ్యే పాలు, పెరుగు, వెన్న, నేయి ఇత్యాదులవల్ల అధిక ప్రయోజనాన్ని పొందే ఆశయం వర్ణించబడింది. అలాగే మాంసాహారమువల్ల కలిగే హాని, శాకాహారంయొక్క మహత్తు

వివరించబడింది. రెండవభాగంలో గోవులు మొదలైన ప్రాణుల రక్షణార్థం స్థాపించబడే 'గోరక్షణీ సభ' యొక్క నియమావళి సూచించబడింది. సభ పేరును గురించి వ్యాఖ్యానిస్తూ ఋషి దయానందులు – "ఈ సభ 'గోకృష్యాది రక్షణీ సభ' అని ఎందుకు నామకరణం చేశానంటే దీనిద్వారా గోవులు మున్నగు పశువుల రక్షణ, మరియు వ్యవసాయాది కర్మల అభివృద్ధి జరిగి మనుష్యాది ప్రాణికోటికంతా ఉత్తమ సుఖాలు లభించాలని నా ఉద్దేశ్యం" అన్నారు. భారత రాజ్యాంగపు 48వ సూత్రంలో దాదాపు ఈ పదాలే కూర్చబడినాయి. వ్యవసాయము మరియు పశుపాలన (గోకృష్యాది) సంస్థ – "రాజ్యంలో వ్యవసాయము మరియు పశుపాలనను ఆధునిక, వైజ్ఞానిక పద్ధతులలో అభివృద్ధి పరచేందుకు ప్రయత్నిస్తుంది. ఆవులు, దూడలు మరియు పాలిచ్చే పశువులు, బరువులు మోసే పశువులు వీటి జాతులను రక్షించడం మెరుగుపరచడం మరియు వాటి హత్యను నిరోధించేందుకు సర్వవిధాలా ప్రయత్నిస్తుంది" అని వ్రాయబడి ఉంది.

## స్వాతంత్రోద్యమంలో గోవు

స్వాతంత్ర్యోద్యమంలో గోవు ప్రధాన అంశమైంది. గోవు, గోసంరక్షణ ప్రముఖ అంశాలుగా భారతీయ స్వతంత్ర ఉద్యమ నేతలు పేర్కొన్నారు. స్వతంత్ర భారతదేశంలో గోసంరక్షణకై అన్ని చర్యలు చేపడతామని హామీలు ఇచ్చారు.

స్వాతంత్ర్యోద్యమ సమయంలో మన జాతీయ నాయకులేమన్నారు? వారి మాటల్లోనే...

- "స్వాతంత్ర్యం వచ్చిన 5 నిమిషాలలోనే ఒక కలంపోటుతో (శాసనంతో) గోహత్య నిలిపివేయబడుతుంది".

**– లోకమాన్య బాలగంగాధర తిలక్**

- "భారత రాజ్యాంగంలో గోహత్యా నిషేధమే మొదటి అంశంగా ఉండాలి".

**- పండిత మదన్ మోహన మాలవ్యా**

- "నా ఆలోచన ఏమనగా ప్రజల ధార్మిక మృదుభావనలను అవహేళన చేయుట ఎంతమాత్రము సభ్యాచారము కాదు. భారతీయుల మస్తిష్కంలో గోవుపట్ల పూజ్యభావము కలదు. గోహత్యా నిషేధమే వైజ్ఞానికము, హేతుబద్ధము అని నా అభిమతము. గోవధ నిషేధమునకు గొప్ప ప్రజాభిప్రాయమును కూడగట్టవలసి ఉంది. గోరక్షణయే మన జీవన ఆదర్శము. దీనికి దూరమగుట మన బలహీనతే. ఎన్నికల్లో ఎవరు గోరక్షణకు ప్రతిజ్ఞ చేస్తారో వారికే ఓటు వేయాలి. ఇలాగే గోవధ కొనసాగితే ప్రభుత్వము నిలువలేదు.

**- రాజర్షి పురుషోత్తమదాస్ టాండన్**

- "నేను ఆవును సౌభాగ్యాన్ని, ఆర్థిక సమృద్ధిని కల్గించే తల్లిగా భావిస్తాను. ఆవువల్ల లభించే వివిధ ఉత్పత్తుల (పాలు, పెరుగు, నేయి, గోమూత్రం, గోమయం) ప్రాముఖ్యతను మనం తెలుసుకోవాలి. ఇతరులకు తెలియజెప్పాలి. నా దృష్టిలో గోరక్షణ స్వరాజ్య సముపార్జనకంటే ఎంతమాత్రం తక్కువ కాదు.

**- మహాత్మాగాంధీ**

- "మన సంస్కృతికి ఆధారము వ్యవసాయమే! ఈ వ్యవసాయ సంస్కృతికి ఆధారమైన గోసంతతిని ఎంత శ్రమించైనా రక్షించుకోవాలి. గోసమృద్ధి కొరకు ప్రయత్నాలు కొనసాగించాల్సిందే. గోసంతతికి నష్టం కలిగితే వ్యవసాయానికి, ఆర్థికవ్యవస్థకు నష్టం కలుగుతుంది.

**- సర్దార్ వల్లభ్‌భాయి పటేల్**

- "సంపూర్ణ గోహత్యా నిరోధమే ప్రజల ఆజ్ఞ. దీనిని ప్రధానమంత్రి అంగీకరించక తప్పదు. మనము గోవులను రక్షింపలేకున్న స్వాతంత్ర్య ఫలసారము పోగొట్టుకున్న వారమే అగుదుము".

**– ఆచార్య వినోబాభావే**

స్వతంత్ర భారతంలో గోరక్షణను గురించిన మన కల్పన, మన కార్యము కొంతవరకు మహాత్మాగాంధీజీ వెలిబుచ్చిన అభిప్రాయాలతో తేటతెల్లమవుతుంది. "గోరక్షణపట్ల విశ్వాసంలేని వ్యక్తిని హిందువుగా భావించలేము" అని అంటుండేవారు. గోరక్షణను వారు స్వాతంత్ర్య సాధన కన్నా ముఖ్యమైనదిగా భావిస్తుండేవారు. భారత రాజ్యాంగంలో గోరక్షణను గురించి ఆదేశిక సూత్రాలలో ప్రస్తావించినప్పటికీ ప్రప్రథమ భారత ప్రధాని శ్రీజవహర్‌లాల్ నెహ్రూగారి కారణంగా అది అంటే గోరక్ష ఒక ఆర్థికపరమైన సమస్యగానే భావించబడింది.

ఈ జగత్తులో ఆవులు, ఎద్దులు మున్నగు వాటిని మానవునికోసం అతడికి పాలు సమృద్ధిగా అందివ్వాలని, వ్యవసాయంలో సాయపడాలని పరమేశ్వరుడు సృష్టించాడు. వాటిని హత్యకు గురికావించడం స్వయంగా తమ కాళ్ళను తాము నరుక్కోవడమే అవుతుంది. గోవంశము యొక్క సమస్య ముఖ్యంగా ఆర్థికసమస్య కాదు. ప్రధానమైన సామాజిక సమస్య. ఏదైనా అది సాంస్కృతిక, సాంఘిక, రాజకీయ సమస్యగానే ఉంటుంది తప్ప ఆర్థిక సమస్యగా కాదు. ప్రస్తుత ప్రభుత్వం తన పశుసంవర్ధన విధానాన్ని పారిశ్రామిక విధానంలో ఒక స్వాభావికమైన భాగంగానే భావిస్తున్నది. ఇప్పుడు అమలులో ఉన్న అర్థశాస్త్ర శిక్షణపరంగా గోవును గురించి రెండురకాల ఆలోచనలు ఉన్నాయి. ఒకదానికి ప్రతినిధి డా॥వి.యం.దాండేకర్ గారు. వారి దృష్టిలో సమస్యంతా పశువుల సంఖ్యను

గురించే. పశువుల సంఖ్య తగినంత తక్కువగా ఉంటే లభ్యమయ్యే పశువులమేత యావత్తు అర్థశాస్త్రజ్ఞులు, శాసనకర్తలు నచ్చి, సూచించే పశుసముదాయానికి సరిపోగా అవి కావలసినంత పాలను ఉత్పత్తి చేయగలవు, తినగలిగినంత మాంసాన్ని కూడా అందివ్వగలవు అని వారి భావన.

ఇక రెండవ వర్గానికి ప్రతినిధులు డా॥ కె.యన్.రాజ్ మరియు డా॥ సి.హెచ్.హనుమంతరావు అనే అర్థశాస్త్రజ్ఞులు. వీరి ప్రకారము "ప్రస్తుతం గోవంశపు సంఖ్య అతి తక్కువగానే ఉంది. దీన్ని ఇంకా తగ్గిస్తే సాధారణ రైతు తన ఎద్దులు కోల్పోవలసి వస్తుంది. ఎక్కువసంఖ్యలో ఉండే చిన్న రైతుల ప్రాణాధారాలైన బక్కచిక్కిన ఎడ్లను తగ్గించివేస్తే ఇక చిన్నరకం వ్యవసాయాలు కూడా లుప్తమైపోతాయి. కేవలం భారీ యంత్రాలతో సాగే పెద్ద వ్యవసాయాలే మిగులుతాయి. అవి ఆధునిక పారిశ్రామిక క్షేత్రం యొక్క భారీవ్యవసాయవిభాగంగా నడుస్తాయి. గోవంశపు సంఖ్య తగ్గిపోతే మరోవైపు చిన్నరైతులంతా తమ జీవనాధారం కోల్పోయి బజారు పాలవుతారని" వారంటారు. "ప్రభుత్వ వర్గాలు రూపొందించే కార్యక్రమాలను కృతజ్ఞతతో శ్రద్ధగా, ఆ వర్గాలను స్తుతిస్తూ అమలు జరపడమే, ప్రభుత్వ నియంత్రణను మౌనంగా అంగీకరించడమే, ప్రజలు ప్రభుత్వానికి ఇచ్చే సహకారమని" శ్రీ దాండేకర్ అంటారు. అయితే శ్రీ రాజ్ మరియు హనుమంతరావులేమో పారిశ్రామికీకరణం అంటే కేవలం అమెరికాలోని ఆధునిక పారిశ్రామికీకరణ వంటిది అని భావించారు. భారీయంత్రాలతోను, పెట్టుబడులతోను సాగే పరిశ్రమలు భారత్‌లో మానవశ్రమ శక్తిని నిరుపయోగం చేసి, అట్టి శ్రమ శక్తి ఆధారంగా నడిచే పరిశ్రమలను దివాలా తీయించి నిరుద్యోగాన్ని పెంచుతాయి. "ఆపరేషన్ ఫ్లెడ్" వంటి జాతీయ పాడి అభివృద్ధి యోజనలు మరియు సంకరజాతి పశువుల వృద్ధి ఆధారంగా నడిచే పశుసంవర్ధన,

పశురక్షణ యోజనలన్నీ గోవంశ హత్యా విధానానికి మరింత ప్రోత్సాహాన్ని కల్పిస్తూ చిన్న రైతులకు కావలసిన ఎద్దులు, ఎరువులు, పొయ్యిలోకి పిడకలు కూడా లభించని పరిస్థితిని తెచ్చిపెడతాయి. ఇలాంటి అర్థశాస్త్రజ్ఞులు మహా అయితే చిన్నరైతులు జీవించి ఉండగల్గినంత వరకు మాత్రమే గోవధనిరోధం జరగాలని భావిస్తారు.

ప్రస్తుత ప్రభుత్వంయొక్క ఆర్థిక విధానాన్ని సమర్థించేవారు కూడా గందరగోళంలో ఉన్నారు. ఆహారం విషయంలో స్వయం సమృద్ధిని సాధించడమే కనీస జాతీయ అవసరమని భావించినట్లైతే తప్పనిసరిగా చిన్న, మధ్య తరగతి వ్యవసాయదారులను ప్రోత్సహించి తీరాలి. 1970-71 సంవత్సరంలో సాగైన 16,02,24,000 హెక్టార్ల భూమిలో 5 హెక్టార్ల కన్నా తక్కువ భూమిగల రైతులు 6,24,79,000 మంది 5,42,12,000 హెక్టార్ల భూమి సాగు చేశారు. ఈ చిన్న రైతుల బక్కచిక్కిన ఆవులను, ఎద్దులను రక్షించవలసిన బాధ్యత ప్రభుత్వానిది. తన భూమిలో ఆ రైతు కుటుంబం చేసే శ్రమనంతా అతని పెట్టుబడిగా లెక్కించాలి. వారి వ్యవసాయానికి భద్రతను కల్పించగల ధరల విధానాన్ని కూడా రూపొందించాలి. ఉత్పాదక శక్తి పేరుతో దానిని అడ్డం పెట్టుకొని ఎక్కువ సంఖ్యలో ఉండే దేశీయ గోసంతతిని నాశనం చేసే పద్ధతిని మానుకోవాలి. సంపూర్ణ గోసంతతిని రక్షించడమే అత్యంత ప్రధానమైన జాతీయ అవసరమని గుర్తించాలి. మనలోని భోగలాలసులు, నిరంకుశులు, విలాసజీవితం గడిపేవారు కాస్త సంయమనాన్ని పాటించాలి. లేకపోతే వారియెడల సమాజంలో తిరస్కారం, ప్రతీకారాత్మక హింస మొలకెత్తే అవకాశం ఉంది.

ఇ.వి.బాఫర్ వ్రాసిన పుస్తకం 'ది లివింగ్ సాయిల్' లో వృద్ధ బలహీన పశువుల పేడతో పొలాలలో పంటలను వృద్ధి పరిచే విషయంలోను, తూర్పు

జన్మనీకి చెందిన ఒక డాక్టరు ఎలార్ట్ బాశ్చ్ వ్రాసిన 'రోమాంస్ ఆఫ్ కేటెల్' మరియు హర్బన్స్ సింహ్, వై.యం.పనేకర్‌లు వ్రాసిన**'బేసిక్ ఫ్యాక్ట్స్ అబవుట్ వెల్త్ అండ్ అలైడ్ మ్యాటర్స్'** అన్న గ్రంథాలలో పేడ ఎరువు యొక్క వైశిష్ట్యము విపులంగా చర్చించడం జరిగింది. ఈ సందర్భంగా మహాభారతంలోని ఒక ప్రసిద్ధ శ్లోకం **"అష్టైశ్వర్యమయీ లక్ష్మీః వసతే గోమయే సదా"** అంటే ఎనిమిది రకాల ఐశ్వర్యాలతో లక్ష్మీదేవి ఎల్లప్పుడు గోమూత్రం - గోమయంలో ఉందని అర్థం.

గోహత్యను సమాజం యావత్తూ ఒక్కుమ్మడిగా వ్యతిరేకిస్తేనే గోహత్య ఏ రూపంలోనూ జరగకుండా నిరోధించగలిగిన ప్రభుత్వ విధానం రూపుదిద్దుకొంటుంది. ధర్మబద్ధమైన ఆలోచనలు, కర్తవ్యశక్తిపై ఆధారపడిన అహింసను ఆరాధించే సమాజమే అహింసపై అక్షరశః విశ్వాసం ఉన్న పరిపాలన వ్యవస్థను నిర్మాణం చేసుకోగలుగుతుంది. అట్టి ప్రభుత్వ విధానం ఉన్న పరిపాలన వ్యవస్థను నిర్మాణం చేసుకోగలుగుతుంది. అట్టి ప్రభుత్వ విధానం సర్వసమ్మతితో గోవంశ రక్షణ విషయంలో పటిష్ఠమైన చర్యలు ఏవైనా చేపట్టగలుగుతుంది. కనుక గోవంశ హత్యను సంపూర్ణంగా నిరోధించడమనేది సాంస్కృతిక - సాంఘిక - రాజకీయ సమస్యే. ఇది ఆర్థికంగా కంటే భావనాత్మక సమస్య. దయా, సానుభూతికంటే న్యాయపరమైన సమస్య. గోజాతి సంరక్షణకంటే వాటితో కలిసి మనం జీవించవలసిన సహజీవన సమస్య.

నిజానికి భారత్‌లో గోసంతతి అవసరానికి మించి లేనేలేదు. పైగా ఎంతో తక్కువగా ఉంది. 2003-2004 సంవత్సరంలో మనదేశంలో వ్యవసాయానుకూలమైన భూమి 14 కోట్ల హెక్టార్లు ఉంది. గోచరాలు ఇతర ఉపయోగాలకై కేటాయించిన భూమిని కలిపితే అది 19కోట్ల

హెక్టారులవుతుంది. అప్పుడు మొత్తం గోసంతతి కూడా దాదాపు 18.52 కోట్లు ఉంది. బ్రిటన్‌కంటే భారత్ 3 రెట్ల కన్న ఎక్కువ విశాలమైంది. బ్రిటన్‌లో నగర జనాభా 91% అయితే భారత్‌లో అది కేవలం 22% మాత్రమే. బ్రిటన్ పారిశ్రామికంగా వృద్ధి చెందితే భారత్ వ్యవసాయము, గ్రామీణ రంగంలో వృద్ధి చెందింది. 1965 నుండి 1975 ఈ మధ్యకాలంలో ఆస్ట్రేలియాలో 78.64%, అమెరికాలో 27.89%, బ్రిటన్‌లో 24.51%, బ్రెజిల్‌లో 54.6%, కొలంబియాలో 46.72%, అర్జెంటీనాలో 38.30%, మెక్సికోలో 34.88%, పాకిస్తాన్‌లో 28.67%, బర్మాలో 25.84% పశు సంతతి వృద్ధి చెందితే భారత్‌లో మాత్రం ఇదే కాలంలో కేవలం 2.59% వృద్ధి జరిగింది. 1975లో మనదేశంలో 18 కోట్ల 2 లక్షలు. అయితే దేశ జనాభాతో పోల్చినప్పుడు భారత్‌లో ఈ సంఖ్య అతిస్వల్పం అని తేలుతుంది. ఎందుకంటే 5 కోట్ల 60 లక్షల జనాభా కలిగిన పారిశ్రామిక దేశం బ్రిటన్‌లో పశుసంఖ్య 1 కోటి 47 లక్షలు, అలాగే 5 కోట్ల 60 లక్షల జనాభా కలిగిన పారిశ్రామిక సంయుక్త రాష్ట్రాలు అమెరికాలో పశుసంఖ్య 13 కోట్ల 18 లక్షలు. అయినప్పుడు 90 కోట్ల జనాభా కలిగిన మనదేశంలో కనీసం 40 కోట్ల గోసంతతి అయినా ఉండాలి. గత సంవత్సరాలలో మన దేశంలో భారీ సంఖ్యలో పశువులను హత్యచేయడం జరిగింది. ఇది దేశానికి తగిలిన ఓ పెద్ద దెబ్బ.

పైన పేర్కొన్న వాస్తవాల ఆధారంగా భారతీయ ఆర్థిక వ్యవస్థకు భారతీయ గోవంశమే ఆధారమనేది స్పష్టమవుతున్నది. భారతీయ గోసంతతిని రక్షించడం మన సాంస్కృతిక, సామాజిక కర్తవ్యమేకాక అది రాజకీయ, ఆర్థిక ఆవశ్యకత అన్నది కూడా సుస్పష్టం. భారతీయ అర్థనీతిపై మన దేశాన్ని సుసమృద్ధం చేయాలంటే మనం భారతీయ గోసంతతిని రక్షించడం,

పోషించడం, వాటిని వృద్ధి పరచడం తప్పనిసరి కర్తవ్యమని చెప్పక తప్పదు. పశ్చిమ దేశాలను గుడ్డిగా అనుకరిస్తూ పోవడం మన దేశాన్ని ప్రగతి దిశలో గాక అధోగతికి, ఆత్మనాశనానికి గురిచేయడమే అవుతుంది. సమయం మించిపోకముందే మన జాగృతులమై, చైతన్యవంతులమై, క్రియాశీలురమైతే మంచిది. ఈ మార్గంలో పయనిస్తే మన భవిష్యత్తు సాంస్కృతికంగా, సామాజికంగా, రాజకీయంగా అంతేకాక ఆర్థికంగాను ఉజ్జ్వలంగా ప్రగతి పథంలో ముందుకు సాగగలదని దేశహితైషులైన పెద్దలందరి పరిపూర్ణ విశ్వాసము.

## స్వతంత్ర భారతదేశంలో గోసంరక్షణ ఉద్యమాలు

సాధు సంతుల నాయకత్వంలో 1966వ సంవత్సరంలో ఉద్యమం జరిగింది. ఆచార్య వినోభాభావే ఆమరణ నిరాహార దీక్షను పూనారు. అయినా మన ప్రభుత్వాల్లో చలనం లేదు. గోవధ శాలలు పెరిగాయి. మన రాజ్యాంగంలో, ఆదేశిక సూత్రాల్లో గోసంరక్షణ పేర్కొన్నప్పటికీ కేంద్ర ప్రభుత్వం తన బాధ్యతల నుండి తప్పుకుని ఆ బాధ్యతలను రాష్ట్ర ప్రభుత్వాలపై నెట్టివేసింది. వివిధ రాష్ట్రాలలో గోవధ చట్టాలున్నా అవి నామమాత్రంగానే ఉన్నాయి. అవైనా ఖచ్చితంగా అమలు కావడం లేదు. మన కళ్లెదుటే ప్రతిదినము వేలాది గోమాతలు గుంపులు గుంపులుగా గోవధ శాలలకు తరలించబడుతున్నాయి.

ఈ సందర్భంలోనే హిందూ ధార్మిక సంస్థల ఆధ్వర్యంలో 2009వ సం॥లో గోసంరక్షణకై విశ్వమంగళ గోగ్రామ యాత్రను నిర్వహించి భారతదేశమంతటా గోమాత ప్రాశస్త్యాన్ని తెలుపుతూ గోఆధారిత ఉత్పత్తులపై ప్రజలకు ఒక సదవగాహనను కల్పించి గోరక్షణకై ప్రతిఒక్కరూ పాటుపడేలా కృషి చేసింది.

## గోసంరక్షణ

గోసంరక్షణ ఉన్నతమైన ధ్యేయం కావడం వల్లనే భారత స్వాతంత్ర్య పోరాటానికి స్ఫూర్తినిచ్చింది. స్వాతంత్ర్య పోరాటం 1857లో ప్రారంభమైనప్పుడు బ్రిటిష్‌వారితో ఉన్న భారతీయులు గోవు కొవ్వుతో చేసిన తూటాలను నోటితో విప్పడానికి వ్యతిరేకించారు. మన జాతీయ నాయకులు లోకమాన్య బాల గంగాధర్ తిలక్, మహాత్మాగాంధీ, లాలా లజపతి రాయ్, మదన్‌మోహన్ మాలవ్యా, పురుషోత్తమదాస్ టాండన్ వంటి వారందరూ స్వాతంత్ర్య పోరాటం తర్వాత అంటే స్వాతంత్ర్యం వచ్చాక 'గోసంరక్షణ, గోవధ నిషేధం' కోసం కృషి చెయ్యాలని దాన్నే మొట్టమొదటి ధ్యేయంగా పెట్టుకున్నారు.

ఆర్టికల్ 48ఎ ప్రకారం పర్యావరణ పరిరక్షణ ప్రతి పౌరుని యొక్క బాధ్యత. మానవాళికే కాకుండా యావత్ ప్రపంచానికి ఆవు మేలు చేస్తుంది. కాబట్టి దాన్ని ప్రేమతో పెంచాలి. వాటికి హింస కలగకుండా చూసే బాధ్యత ప్రతి పౌరుడిపై ఉంది. 'గోసంపత్తి - రాష్ట్ర సంపత్తి; గోరక్షణ - లోకరక్షణ' అని నాలుగు వేదాల్లో, శాస్త్రాల్లో, దేవతలు, ఋషులు అందరూ చెప్పారు. రాష్ట్రపిత గాంధీజీ 'నాకు స్వాతంత్ర్యం కన్నా గోరక్షణే ప్రధానమన్నారు. అలాగే తిలక్ గోరక్షణే లోకకల్యాణం అన్నారు.

**శ్లో॥ ఉష్ణే వర్షతి శీతే వా మారుతే వాతి వా భృశమ్।**
**ప్రకృతీ త్వాత్మనః ప్రాణం గోరక్షిత్వా తు శక్తితః ॥**

ఎండవల్ల, వడగాడ్పులప్పుడు, చలిగాలులు వీస్తున్నప్పుడు, వర్షం వచ్చినప్పుడు ముందుగా నిన్ను నువ్వు రక్షించుకోవడం కాదు - గోవును రక్షించు.

**శ్లో॥ వానస్పత్యం మూలఫలం హోమద్రవ్యం తథైవ చ।**
**తృణం చ గోభ్యో గ్రాసార్థ మస్తేయం మనురబ్రవీత్॥**

గోపోషణ కొరకు పరుల గడ్డివామిలోంచి గడ్డి తీసుకొని ఆవుకి వేస్తే అది దొంగతనం కాదు. కంచె వేయని ఫల వృక్షములను, దుంపలను, హోమానికి సమిధలు, గోవుకోసం గ్రాసం - వీటిని పరులవి గైకొన్నా దొంగతనం కాదని మనువు మనుస్మృతిలో చెప్పారు.

**'స్తోతా మే గోసఖా స్యాత్'**

నన్ను స్తుతించు నా భక్తుడు గోవు యొక్క మిత్రుడై ఉండాలి అని అథర్వవేదంలో పరమాత్ముడు స్పష్టం చేశాడు. గోహత్యలు ఎక్కువగా జరుగుచున్నవి. వాటిని అరికట్టండి. గోమాతను రక్షిస్తున్నప్పుడు ఫలితం మీదకన్నా ప్రయత్నం మీదే ధ్యాస ఎక్కువ అవుతుంది. గోమాతలను రక్షిస్తే అవి మానవజాతిని రక్షిస్తాయి. ఈ సృష్టిలో మరెన్నో విషయాలను డబ్బుతో కొనగలుగుతాం. కాని, దైవ స్వరూపమైన గోవును కొనలేం. ఆవు వల్ల కలిగే లాభాలు నూటికి ఎన్నో! ఎన్నో! మరెన్నో!

గణతంత్ర రాజ్యాల మధ్య గోవులకోసం యుద్ధాలు జరిగిన విషయాన్ని 'ఉత్తరగోగ్రహణం' కథ చెబుతుంది. అనాథ ప్రేత సంస్కారాన్ని పవిత్రంగా భావించే పుణ్యభూమి మనది. మనిషి చనిపోయిన తరువాత ఆ కళేబరాన్ని ఖననం చేసేవరకూ ఎనలేని గౌరవాభిమానాలు చూపడం మన సమాజ లక్ష్యం. అదే గోమాతవిషయంలో కూడా పాటించాలి.

## గోసంరక్షణకై ప్రభుత్వాలు ఏమి చేయాలి?

1. ఆవును జాతీయజంతువుగా ప్రకటించాలి.
2. గోసంతతి రక్షణకై కేంద్రస్థాయిలో చట్టం చేయాలి

3. రాష్ట్రాలలో ప్రస్తుత గోరక్ష చట్టాలలోని లోపాలను సవరించి, చట్టాలను ఖచ్చితంగా అమలు చేయాలి.

4. దేశీయ గోసంతతి ఉత్పత్తి ప్రక్రియలో విదేశీ జాతుల ప్రమేయాన్ని ఆపివేయాలి.

5. గ్రామాలలో పశుసంపద అభివృద్ధి కొరకు తిరిగి గోచరభూమిని **(పశువుల బీడును)** ఏర్పరచడానికి తగు చర్యలు చేపట్టాలి.

6. గోరక్షణకై కేంద్రంలోను, రాష్ట్రాలలోను విడిగా ఒక ప్రత్యేక మంత్రిత్వ శాఖను ఏర్పరచాలి.

పై కోర్కెల సాధనకు ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి, ప్రభుత్వంపై వత్తిడి తీసుకు రావడానికి విశ్వమంగళ గోగ్రామ యాత్ర సందర్భంగా 15 సంవత్సరముల వయసు నిండిన ప్రతి ఒక్కరినుండి సంతకాలను సేకరించి గౌరవనీయ రాష్ట్రపతికి అందచేయబడుతుంది. పై కోర్కెలను ప్రభుత్వం ఆమోదించి, అమలు చేసేంత వరకు ప్రభుత్వంపై ప్రజ ఒత్తిడిని కొనసాగించి ప్రజాందోళనలను కొనసాగించాలి.

## గోసంరక్షణకై మనం ఏం చేయవచ్చు?

1. ఆవు ప్రాముఖ్యతను తెలియచేసే సాహిత్యాన్ని మనం చదవాలి. ప్రధానంగా ఇంట్లోని యువతరం చేత చదివించాలి. గోమాతపట్ల భక్తికి పిల్లలలో కల్గించాలి.

2. రోజువారీ జీవితంలో, గోఉత్పత్తులు - పాలు, నెయ్యి, సబ్బులు, షాంపూ, పండ్లపొడి, అగరువత్తులు... ఇలాంటి వినియోగ వస్తువుల వాడకాన్ని ప్రోత్సహించాలి.

3. గోమూత్రం ద్వారా తయారయ్యే మందులను – ఇంట్లోని సభ్యులందరూ వాడేటట్లు ప్రోత్సహించాలి.

4. దేవాలయం ధర్మకర్తలు, భక్తులు ప్రతి దేవాలయం ఒకటి రెండు, ఆవులను పోషించేట్లు చూడాలి.

5. గోశాలలను కుటుంబసమేతంగా సందర్శించడం, వారికి ఆర్థికంగా సహకరించడం. చేయాలి. గోశాల నిర్వహణలో సమయమిచ్చి కార్యకర్తగా పనిచేయవచ్చును.

6. సంవత్సరంలో ఒకసారి కృష్ణాష్టమి సందర్భంగా లేదా మరేదైనా పండుగ సందర్భంగా పాఠశాల, దేవాలయం, కేంద్రంగా సామూహికంగా గోపూజను నిర్వహించి, గోసంరక్షణ ప్రాముఖ్యతను తెలియచేయాలి.

7. గ్రామీణ ప్రాంతాల్లో గోవులను పెంచే గోప్రేమీ కుటుంబాల సంఖ్యను ప్రోత్సహించాలి. వ్యక్తిగత స్థాయిలో గోపాలనను ప్రోత్సహించాలి.

8. 60% ఆపైగా గోప్రేమీ కుటుంబాలు గల గ్రామం "అభయగ్రామం" అవుతుంది. ఇటువంటి అభయగ్రామాల సంఖ్యను పెంచాలి.

9. ప్రతి గ్రామంలో పశువుల పెంపకం కొరకు అవసరమగు గోచర భూమి ("పశువుల బీడు") వ్యవస్థను తిరిగి ఏర్పరచాలి.

10. రసాయనిక ఎరువుల వాడకాన్ని మాని సేంద్రియ వ్యవసాయ విధానాలను, గోఆధారిత వ్యవసాయ విధానాలను రైతులు చేపట్టేట్లు ప్రోత్సహించాలి.

11. ప్రతి గ్రామంలో గోవులను పోషిస్తున్న రైతుల నుండి గోమూత్రము, గోపేడలను సేకరించి, వాటిద్వారా సేంద్రియ ఎరువులను, వివిధ గోఉత్పత్తులను తయారు చేయడానికి యువకుల బృందానికి

తర్ఫీదునివ్వాలి. తద్వారా వారికి ఉపాధి లభిస్తుంది. రైతులకుఆదాయం పెరుగుతుంది. గోఉత్పత్తుల వినియోగదారులకు వస్తువులు లభ్యమవుతాయి.

12. చట్టానికి వ్యతిరేకంగా, ఆవులను వధశాలలకు తరలిస్తున్న సంఘటనలు ఎదురైనప్పుడు ఆవుల తరలింపును ఆపి, పోలీసులకు ఫిర్యాదు చేసి చట్టపరంగా చర్యలు తీసుకోవాలి.

13. గోమాంసం తినడం వల్ల వచ్చే నష్టాలను తెలియజేసి, గోమాంస భక్షణను ఆపివేయించాలి.

14. గోసంరక్షణకై జరిగే వివిధకార్యక్రమాల్లో, ఉద్యమాల్లో పాల్గొనాలి.

15. లక్షలాది ఆవుల మరణానికి కారణమవుతున్న, పర్యావరణానికి హాని కలిగిస్తున్న ప్లాస్టిక్ వస్తువుల వాడకాన్ని మానివేయాలి.

## గోదాన ఫలం

**శ్లో॥ దాతాఽస్యాః స్వర్గమాప్నోతి వత్సరాన్ లోమ సమ్మతాన్ ।**
**కపిలా చేత్తారయతి భూయాశ్చ సప్తమాకులమ్ ॥**

ఒక గోవును దానం చేస్తే సహస్ర గోవులను దానం చేసిన ఫలితం కలుగుతుంది. కపిలగోవును దానం చేస్తే ఏడు తరాలను తరింపజేస్తుంది.

గోదానం చేస్తే పితృదేవతలు ఘోరమైన వైతరణీ నది దాటి స్వర్గానికెళతారని శాస్త్రంలో చెప్పబడింది.

**శ్లో॥ గో, భూ, తిల హిరణ్యాజ్య వాసో ధాన్య గుడాని చ**
**రౌప్యం లవణ మిత్యాహుః దశదానాః ప్రకీర్తితాః ॥**

ఆవుతోపాటు దూడను కూడా దానమివ్వాలి. దానమిచ్చే సమయంలో ఆవు ముఖం ఒకవైపూ, పాలు త్రాగుతున్న దూడ ముఖం మరొకవైపు

తిరిగి ఉండాలి. అనగా గోదానకర్తకు, గోదాన ప్రతిగ్రహీతకు, గోవు–దూడ చెరియొకరికి అభిముఖులై ఉండాలి. గోదానం వల్ల ఇహంలోనూ, పరంలోనూ సుఖం కలుగుతుందని భావం. అలాగే దానం చేసేవారికి పుణ్యప్రాప్తి, వారి పితృదేవతలకు పుణ్యలోక ప్రాప్తి కలుగుతుందని భావము. అందుచే దానాలన్నింటిలోనూ గోదానం ఉత్తమమైనది.

## గోప్రదక్షిణ ఫలం

బ్రహ్మదేవుడు సకలలోకాలు ఆశ్చర్యపోయేలా సౌందర్యమునకు ప్రతీకగా సృష్టించిన అహల్యను వివాహం చేసుకోవాలనే వారికి ఒక పెద్దపోటీ పెడతాడు. దేవతలందరితో పాటు పరమ పురుషార్థమయిన మోక్షమును లోకానికి చూపిన యోగీశ్వరుడు, సప్తఋషులలో ఒకడైన గౌతముడు పోటీలో పాల్గొంటాడు. భూప్రదక్షిణకు బదులు శాస్త్రప్రకారం ద్విముఖ గోవునకు ప్రదక్షిణం చేసి, ధర్మసమ్మతంగా అహల్యను వివాహం చేసుకున్నాడు. గో ప్రదక్షిణం భూప్రదక్షిణంతో సమానం. గోప్రదక్షిణం చేస్తే గర్భిణీ స్త్రీలు సుఖంగా ప్రసవిస్తారు.

## గో హత్యకు ప్రాయశ్చిత్తం లేదు

వినాయకుడు తన తల్లి పార్వతీదేవికి సవతి బాధ లేకుండా చేస్తానని ప్రమాణం చేస్తాడు. అందుకే శివుని జటాజూటం నుంచి గంగను భూలోకానికి పంపాలని భావిస్తాడు. భూలోకాన్ని స్వర్గంగా మార్చడం గౌతమమహర్షివల్లనే జరుగుతుందని వినాయకునికి తెలుసు. పార్వతీదేవి చెలికత్తెను మాయ గోవుగా మార్చి పంట పొలాల్లోకి వెళ్లి ఆ మహర్షి నిన్ను ఏమన్నా అంటే నీవు తత్క్షణమే చనిపోవాలని ఆదేశిస్తాడు. ఆ పన్నాగం ప్రకారం మాయగోవు పంట పొలాల్లోకి చొరబడి పంటను మేస్తుంటే

గౌతముడు చూచి, భరించలేక ఒక గరిక పుల్లతో అదిలించగానే ఆ గోవు మరణించింది. గౌతముడు గోహత్య చేశాడని ఆయన్ను నిందించారు. గౌతముడు వెంటనే వినాయకుని చేరి తన పాపానికి ప్రాయశ్చిత్తం ఏమిటని అడుగుతాడు. శివుని జటాజూటంలోని గంగను గోవుపై ప్రవహింపజేస్తే పాపం పోతుందని చెబుతాడు విఘ్నేశ్వరుడు. గౌతముడు శివుని కోసం తపస్సు చేసి మెప్పించి గంగను భూమిపైకి రప్పించగా మాయగోవు బ్రతికింది. శివుని జటాజూటం నుంచి వచ్చిన ఆ గంగే గౌతమిగా మారింది.

కలియుగంలో గంగానది, గీత, కపిలగోవు, రావిచెట్టు, సాధు పుంగవులసేవ, ఏకాదశీవ్రతం వీనికిమించిన పావనమైనవి ఏమీ లేవని స్కాంద పురాణంలో వివరించారు. గోవులను, బ్రాహ్మణులను ఎంగిలి చేత్తో ముట్టు కుంటే శిక్షగా వారి చేతులు కాలుస్తామని యమభటులంటారు. ఏడు జన్మల క్రితం గోవును నీళ్లు త్రాగడానికి అడ్డుపెట్టిన అపరాధానికి వందసంవత్సరాలు నరకాన్ని అనుభవించిన వ్యక్తికి ఒక పుణ్యాత్ముని రాకతో విముక్తి కలిగింది. ఇది విష్ణుపురాణంలో చెప్పబడింది.

## గోపద్మ వ్రతం

ఏకాదశుల్లో ఆషాడశుద్ధ ఏకాదశి అత్యంత విశేషమైనది. ఈ ఏకాదశిని 'తొలి ఏకాదశి', 'శయనైకాదశి' అని కూడా అంటారు. ఆ రోజున 'గోపద్మవ్రతం' చెయ్యాలని పురాణాలు చెబుతున్నాయి. ఆదినం గోశాలను శుభ్రంచేసి గోమయంతో అలికి ముగ్గులుపెట్టి మధ్యభాగంలో బియ్యపుపిండితో 33 పద్మాలు పెట్టాలి. లక్ష్మీనారాయణులకు గంధ పుష్పాక్షతలతో పూజ చేసి, ప్రదక్షిణ నమస్కారములు సల్పి, పద్మానికి ఒకటి చొప్పున బ్రాహ్మణులకు వాయనం ఇవ్వాలి - గోమాతను పూజించాలి - దీని ఫలితం అద్భుతం! అత్యద్భుతం!

# నరఘోష నివారణ

భోగి పండుగను నరఘోష నివారణ కోసం జరుపుకుంటారని ప్రతీతి. ఎవరైనా ధనధాన్యాలు, సిరిసంపదలతో తులతూగుతున్నారంటే వారిపై ఎక్కువమంది దృష్టిపడడం సహజం. దీన్ని వక్రదృష్టిగా భావించడం కూడా సహజమే. ఆ వక్రదృష్టిని తనమీద నుంచి మళ్లించుటకే నెల పెట్టినప్పటి నుంచి రాత్రి వేళల్లో ఆవుపేడతో గొబ్బిళ్లు తయారు చేసి వాటిపై గుమ్మడి లేదా తంగేడు పూలను ఉంచుతారు. కొందరి దృష్టిదోషాన్ని వాటిపై మళ్లించడమే ఈ గొబ్బిళ్ళ వెనుక ఉన్న ఆంతర్యం – తరువాత గొబ్బిళ్ళతో పిడుకలు తయారుచేసి భోగి మంటలు వేసుకుంటారు.

భోగినాడు అష్టదళపద్మాకృతిలో ముగ్గులు వేసి దానిపై గొబ్బెమ్మను అమర్చి పూజిస్తారు. అదే లక్ష్మీదేవి ప్రతిరూపం. పూర్వం రాక్షసులు పెట్టే బాధలకు తట్టుకోలేక దేవతలు కామధేనువును ఆశ్రయించగా, విష్ణువు ఆనతిపై లక్ష్మీదేవి గోమయంలో దాగింది. ఆవు పేడతో ముంగిళ్లలో కలయంపి చల్లి అలంకరించినవారికి ధనధాన్యాలు ఇస్తానని లక్ష్మీదేవి వరమిచ్చింది.

దేహంలో వేడి తగ్గించడానికి గోవుపాలు, గోవు పెరుగు, గోమూత్రం ఉపయోగిస్తాయి. ఆవు పేడతో చేసిన పిడుకలతో మంటలు వేస్తే శుభం కలుగుతుందని నమ్మకం. దృష్టిదోషనివారణతో పాటు తమ సంతానానికి మేలు జరుగుతుందని ఆవు పేడతో తయారుచేసిన పిడుకలను మాలలుగా చేసి పిల్లల మెడలో వేసి వాటిని తీసి మంటవేసి వాటి చుట్టూ పిల్లల్ని కూర్చోబెడతారు.

సంక్రాంతి పండుగనాడు గంగిరెద్దును ఇంటింటికీ త్రిప్పి విన్యాసాలు చేయిస్తారు. ఆనందోత్సాహాలతో ప్రజలు దాన్ని తిలకించి బహుమతులిస్తారు.

సంక్రాంతినాడు ఆవుపాలతో పొంగలి వండి పశుశాలల్లో నైవేద్యం పెట్టి పంట పొలాల సరిహద్దుల్లో చల్లుతారు. దానినే పొలిచల్లుట అంటారు. దానివల్ల పాడిపంటలు అభివృద్ధి చెందుతాయని నమ్మకం.

## విదేశీయుల అభిప్రాయాలు

అమెరికా, జర్మనీ వైజ్ఞానికులు భారతీయ గోసంతతి ద్వారా కలిగే లాభాలను ముక్తకంఠంతో ఘోషిస్తున్నారు. మహాశివుడు, శ్రీకృష్ణుడు, దిలీప మహారాజు, వసిష్ఠుడు, జమదగ్ని మొదలైన ఋషుల చరిత్రలు గోమహిమతో కూడినవి.

థాయ్‌లాండ్‌లోని సెంట్రల్ సాకాయూ ప్రావిన్స్ పశువుల మార్కెట్‌లో సంప్రదాయబద్ధంగా ఒక ఆబోతుకి, ఆవుకి పెళ్లి జరిపించి ఊరేగింపుగా తీసుకెళ్ళినపుడు ఆ పెళ్లి చూడ్డానికి దాదాపు రెండువేల మంది హాజరయ్యారు. ఆవు యజమానికి, ఆబోతు యజమానికి దాదాపు లక్ష (రూపాయలు) థాయ్ కరెన్సీగా కట్నం సమర్పించారు. ఆవు సంచరించే ప్రాంతం వాతావరణ కాలుష్యాన్ని నివారిస్తుంది. ఈ విషయాన్ని అమెరికా, జర్మనీ దేశాల్లో పరిశోధనలతో ఋజువు చేశారు. యావత్ ప్రపంచం గోబర్‌గ్యాస్ తయారు చేయాలంటూ అమెరికా ప్రెసిడెంట్ బుష్ విజ్ఞప్తి చేశారు.

## గోవుకు ఆలయం

శ్రీ సద్గురు సమర్థ నారాయణ మహారాజ ఆశ్రమము సనాతన ధర్మ ప్రచారానికై సుదీర్ఘ కాలము నుండి అన్ని శాఖలద్వారా భావి భారత నవ నిర్మాణానికై, సన్మార్గ జీవితానికై జ్ఞానకేంద్రంగా ఉంది. ఈ హైదరాబాద్‌శాఖ బ్రిటిష్ మరియు నైజాం కాలపు రజాకార్, ఖల్సార్‌లాంటి అమానవీయ సంఘటనలన్నిటి విపరీత కాలమును కూడా ఎదుర్కొని వేదసేవ, అన్నదాన

సేవ మొదలైనవి మరియు సన్మార్గ జీవితం, సార్థక పురుషార్థం బోధించే సేవాకేంద్రాలను కూడా నెలకొల్పింది. ఇచ్చట మాత కామధేనువుకు ఆలయం కూడా కట్టించారు. ఈ పుణ్యస్థలి శివబాగ్, జియాగూడ, పురానాపూల్, హైదరాబాద్‌లలో ఉంది.

## గోధూళికాలగ్నం

పగటి కడపటి భాగం పశ్చిమ దిక్కులో సూర్యబింబం మూడవవంతు కనబడుతుండగా తదుపరి 48 నిముషాల ప్రొద్దు గోధూళికాలగ్నం. ఆ సమయం అందరికీ, అన్నింటికీ శుభముహూర్తం అని చెప్పబడింది. గోసేవ చేస్తే రజస్తమోగుణాలు నశించి సాత్త్వికులవుతారు.

## బయోగ్యాస్

ఆవుపేడ, సేంద్రియ వ్యర్థ పదార్థాల నుంచి గోబర్ గ్యాస్‌ను తయారు చేస్తారు. దీన్ని సున్నం నీళ్ల నుంచి పంపించడం ద్వారా బొగ్గుపులుసు వాయువు తొలగిపోయి స్వచ్ఛమైన మిథేన్‌గ్యాస్ లభిస్తుంది. ఈ ప్లాంట్లు 20వేల నుంచి లక్ష రూపాయల వెలలో లభిస్తాయి. కంప్రెసర్‌ని ఉపయోగించి మిథేన్ గ్యాస్‌ను సిలిండర్లలోకి పంపవచ్చు. వంటగ్యాస్‌ను వాహనాలను నడిపించుటకు ఉపయోగించవచ్చు. మిగిలిన పదార్థాలు దేశం మొత్తం పొలాలకు రెండు పంటలకు సేంద్రియఎరువుగా సరిపోతాయి.

దేశం మొత్తంమీద 6.27 లక్షల గ్రామాల్లో ప్రతి గ్రామంలోనూ 50 రైతు కుటుంబాల్లో ఒక్కొక్క కుటుంబానికి 2 ఎద్దులు, 4 పాడి ఆవులు ఉంటే వాటిద్వారా లభించే పేడ దేశం మొత్తానికి కావలసిన పెట్రోల్, యల్.పి.జి., కిరోసిన్, యల్.యన్.జి. అవసరాల్ని తీరుస్తుంది. దేశ ఆర్థిక వ్యవస్థ బాగుపడుతుంది.

ఆవు పేడద్వారా ఉత్పత్తి అయ్యే బయోగ్యాస్ 600 బి.టి.యు. ఉష్ణోగ్రత వద్ద పరిశీలిస్తే మిథేన్ 55-65శాతం, కార్బన్‌డయాక్సైడ్ 39శాతం, నైట్రొజన్ ఇతరములు 5శాతం ఉంటాయని నిరూపించారు. బయోగ్యాస్‌ను మిగిలిన ఇంధనాలతో పోలిస్తే ఉష్ణజ్వలనశక్తి తక్కువ. అందుకే ప్రస్తుతం ఆహారపదార్థాల తయారీకి, ఇంజన్ల వినియోగానికీ వాడుతున్నారు. నాణ్యత పెంచితే విద్యుచ్ఛక్తి కూడా తయారు చేసుకోవచ్చు.

గోబర్‌గ్యాస్ బట్టీలను ఇటుకలతో నిర్మించుకొని పెద్ద మిషనరీ అక్కర లేకుండా చేసుకోవచ్చు. మిషనరీకి బ్యాంకులు కూడా ఋణాలిస్తాయి. రవాణా ఖర్చు లేకుండా, నిల్వ చేసే గోడౌన్ ఖర్చు లేకుండా, దళారీల బెడద లేకుండా, పన్నుల బాధ లేకుండా, లాభదాయకంగా బయోగ్యాస్ ఎంతో ఉపయోగం. చెడిపోయిన పదార్థాల వల్ల పర్యావరణానికి హాని చేయని విధంగా పరివర్తన చెందింది. నిత్యజీవితంలో ఉపయోగించే బయోగ్యాస్‌గా మార్చి భారతసంస్థ 'బయోటెక్' (కేరళ) వారు గ్రీన్ ఆస్కార్ అవార్డు పొందారు.

## గోమతివిద్య

'గోమతి విద్య' అనే విశేషమైన మంత్రంతో కూడిన గోస్తుతి లభిస్తుంది- దానిని పఠించిన ఇళ్లల్లో, గ్రామాల్లో, దేశాల్లో గోసంతతి అభివృద్ధి చెందుతుంది- మానవుల దుఃఖం సులువుగా తొలగిపోతుంది. ఈ విద్యకి అనేక ఉపనిషత్తుల్లో, పురాణకథల్లో విశేష ప్రాధాన్యమిచ్చారు. ఆవులు బాగా వృద్ధి చెందడానికి ఉపయోగపడేదే గోమతి విద్య అన్నారు. గో సంతానం వృద్ధి కావడంవల్ల పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలగు స్వచ్ఛమైన, విలువైన వస్తువులు లభించి సుఖశాంతులు లభిస్తాయి. దీనిని పఠిస్తే ఐహిక సుఖాలు, దివ్యజ్ఞానం లభిస్తాయి- గోలోక ప్రాప్తికూడా లభిస్తుంది. విష్ణుధర్మోత్తర పురాణంలో చెప్పిన ఈ పద్యాన్ని ప్రతిపదార్థంతో నేర్చుకుంటే మంచిది.

గోమతీం కీర్తయిష్యామి సర్వపాపప్రణాశినీమ్
తాం తు మే వదతో విప్ర శృణుష్వ సుసమాహితః ॥
గావః సురభయో నిత్యం గావో గుగ్గులుగంధికాః ।
గావః ప్రతిష్ఠా భూతానాం గావః స్వస్త్యయనం పరమ్॥
అన్నమేక పదం గావో దేవానాం హవిరుత్తమమ్
పావనం సర్వభూతానాం రక్షంతి చ వహంతి చ ॥
హవిషా మంత్రపూతేన తర్పయంత్యమరా దివి ।
ఋషీణాం అగ్నిహోత్రేషు గావో హోమే ప్రయోజితాః॥
సర్వేషామేవ భూతానాం గావః శరణముత్తమమ్ ।
గావః స్వర్గస్య సోపానం గావో ధన్యాస్సనాతనాః ॥
నమో గోభ్యః శ్రీమతీభ్యః సౌరభేయీభ్య ఏవ చ ।
నమో బ్రహ్మసుతాభ్యశ్చ పవిత్రాభ్యో నమో నమః ॥
బ్రాహ్మణాశ్చైవ గావశ్చ కులమేకం ద్విధా స్థితమ్ ।
ఏకత్ర మంత్రాధిష్ఠం హవిరేకత్ర సంస్థితమ్॥
దేవబ్రాహ్మణగో సాధు సాధ్వీభిః సతతం జగత్ ।
ధార్యతే వై సదా తస్మాత్ సర్వే పూజ్యతమాః సదా ।
యత్ర తీర్థే సదా గావః పిబంతి తృషితా జలమ్.
ఉత్తరంతి పథా యేన స్థితా తత్ర సరస్వతీ

విష్ణుధర్మోత్తర పురాణం ద్వితీయ 42, 49, 58, వరుణుని పుత్రుడు జలాధిపతి. అతడు పుష్కర ద్వీపానికి అధిపతి, సర్వశాస్త్ర పండితుడు. పరశు రాముడు అడిగితే పుష్కర భగవాన్ ఈ విద్య గురించి చెప్పాడు. దీన్ని ఏకాగ్రచిత్తులైవింటే, పాపాలను సమూలంగా ప్రక్షాళన చేస్తుంది. ఆవు నిత్యం సురభి రూపిణి. పుణ్యమైన సుగంధాలను వెదజల్లుతుంది. గుగ్గులు వంటి సువాసనలనిస్తుంది. ఆవుతో ప్రాణికోటి ముడిపడి ఉంది. ధర్మ,

అర్థ, కామ, మోక్షదాయిని. సర్వోత్కృష్టమైన ఆహారాన్ని ఇస్తుంది. వాటితో అందరు దేవతలను సేవించడానికి హవిస్సు, పురోడాశాలు తయారు చేసుకోవచ్చు. ఆవులు దర్శనం, స్పర్శనంద్వారా అన్ని ప్రాణులను పవిత్రం చేస్తాయి. పాలు, పెరుగు, నెయ్యి మొదలగు అమృత పదార్థాలనిస్తాయి. దాని దూడలు బలిష్ఠంగా పెరిగి వృషభాలుగా బరువులు మోయడానికి, భూమిని దున్నడానికి ఉపయోగ పడతాయి. పవిత్రమైన హవిస్సు ద్వారా వేదమంత్రాలతో దేవతల్నికూడా పవిత్రుల్ని చేస్తాయి. ఋషుల యజ్ఞాలు, అగ్నిహోత్రాల్లో హవనద్రవ్యాల వినియోగం వీటివల్ల జరుగుతుందికాబట్టే, వీటిని విశేషభక్తితో పోషిస్తారు. ప్రపంచంలో అన్ని ప్రాణులకు గోమాతలే సర్వోత్తమ శరణ్యాలు. ఆవులు స్వర్గానికిచేర్చే సోపానాలు. మంగళకరమైన పదార్థాలకు, సంపదలకు ఆవులు మూలం. లక్ష్మీదేవికి తనశరీరంలో స్థానమిచ్చే గోవుకు నమస్కారం – సురభికులంలో సాధువుగా ఉత్పన్నమయిన ఆవుకు నమస్కారం – బ్రహ్మ పుత్రిక అయిన ఆవుకు నమస్కారం – వాతావరణాన్ని పవిత్రంచేసే ఆవుకు నమస్కారం. ఆవులు, బ్రాహ్మణులు ఒకే కులానికి చెందిన ప్రాణులు. ఇద్దరిలో పరిశుద్ధమైన, ప్రధానమైన 'సత్త్వ' గుణం ఉంది. బ్రాహ్మణులలో వేదమంత్రాలు ఉంటే, ఆవులలో యజ్ఞసాధనాలయిన హవిస్సులుంటాయి. రెండింటిద్వారానే యజ్ఞం సుసంపన్నమై విష్ణువు మొదలగు సమస్తదేవతలు, చరాచరములు ప్రీతి చెందుతాయి. ప్రపంచమంతా దేవతల, బ్రాహ్మణుల, సాధువుల, మహాత్ముల, పతివ్రతల పుణ్యాలపైనే ఆధారపడి ఉంది. ధార్మికమైన ఈ జీవులే విశ్వాన్ని నడిపిస్తూ ఉంటారు. అందుకే ఇవన్నీ పూజనీయమైనవి. ఆవులు ఎక్కడ నీరు త్రాగి దప్పిక తీర్చుకుంటాయో అక్కడ గంగ, యమున, సరస్వతి, సింధు నదులు ఉంటాయి. గోపాద ధూళిలో అన్నిరకములయిన ధర్మాలు, శక్తులు నివాసం చేస్తాయి.

## కొన్ని చట్టాలు

* Andhra Pradesh Prohibition of Cow Slaughter and Animal Preservation Act, 1977.
* Bihar Preservation Improvement of Animal Act, 1995.
* The Delhi Agricultural Cattle Preservation Act, 1994.
* The Goa, Damman & Diu Prevention of Cow Slaughter Act, 1978 (13 of 1978)
* The Goa Animal Preservation Act, 1995.
* The Bombay Animal Preservation Act,1954.
* The Punjab Prohibition of Cow Slaughter Act, 1955.
* The Karnataka Prevention of Cow Slaughter and Cattle Preservation Act, 1964.

**ఆవు జంతువు కాదు**

ఆవు మన సంస్కృతికిరీటానికి కలికితురాయి.

ఆవు సభ్యత అనే గోడకు వేసిన వెల్లలాంటిది.

ఆవు మన ధర్మంలోని సూక్ష్మరహస్యం.

ఆవు మన అర్థం, మోక్షకర్మల మార్గం.

ఆవు ప్రపంచానికి అఖండమైన గౌరవప్రదమైనది.

ఆవు పుట్టుకనుండి మానవుణ్ణి ముక్తివరకూ చేర్చే నావ.

ఆవు నిర్మలమైన ఆకాశంలో ధ్రువనక్షత్రం.

ఆవు ఎడారిలో చల్లని నీడ.

ఆవు మమతతో కూడిన మాతృత్వం.

ఆవు వ్యవసాయం, ఆరోగ్యం, వాణిజ్యం మొదలైనవాటికెల్ల ఆధారం.

ఆవు భక్తి, శక్తి, ప్రార్థన, సేవ, సమృద్ధి – వీటికి ఆలంబనం.

ఆవు అమృతం అనే తలకు పూసిన చందనం.

## ఎవరు ఏవిధంగా గోసేవ చెయ్యాలి!

1. మీరు భారతీయులా?

అయితే తెలుసుకోండి – ఆవు మన తల్లి. ఆవుపాలు ఆరోగ్యాన్ని, సుఖాన్ని ఇస్తాయి.

2. మీరు రైతులా?

అయితే రసాయన ఎరువులు మాని సేంద్రీయ ఎరువులనే వాడండి.

3. మీరు పారిశ్రామికవేత్తలా?

ఆర్థికవ్యవస్థకు ఆధారమైన ఆవులను, ఎద్దులను రక్షించటానికి ధనసహాయం చెయ్యండి.

4. మీరు ఉద్యోగస్థులా?

తోటి సహచరులకు ఆవు, ఎద్దుల గొప్పతనాన్ని తెలియజేయండి.

5. మీరు ఆలోచనాపరులా?

బుద్ధిబలాన్ని పెంచుకోవడానికి ఆవు పాలు త్రాగండి.

6. మీరు గోప్రేమికులా?

గోవధ జరుగకుండా చూడండి– ఆవులను, ఎద్దులను సంరక్షించండి.

7. మీరు పోలీసులా?

ఆవులను, ఎద్దులను హింసించేవాళ్లను పట్టుకుని శిక్షించండి. చట్టాన్ని రక్షించండి.

8. మీరు న్యాయవాదులా?

పశువులను దొంగిలించే వారిని పట్టుకుని, కేసు పెట్టి, ఫీజులేకుండా వాదించండి.

9. మీరు జడ్జీలా?

చట్టం ద్వారా రక్షించబడే ఆవు, ఎద్దుల గురించి నేరం చేసేవాళ్లను శిక్షించండి.

10. మీరు పశువ్యాపారులా?

ఆవుల్ని కసాయివాళ్లకు అమ్మకండి.

11. మీరు రచయితలా?

ఆవుల, ఎద్దుల ఆర్థిక, సాంస్కృతిక, శాస్త్రీయ దృక్పథాన్ని బాగా వెల్లడించే రచనలు చెయ్యండి.

12. మీరు కసాయివాళ్ళా?

ఆవులు, ఎద్దుల మీద కత్తి పెట్టి దేశద్రోహం, ధర్మద్రోహం చెయ్యకండి.

13. మీరు విలేఖరులా?

ఆవుల, ఎద్దుల మీద విమర్శనాత్మక రచనలు చేసి ద్రోహం చేయకండి.

14. మీరు సానుభూతిపరులా?

మీ సానుభూతి బాధితులకు చేరడానికి గోసేవ చెయ్యండి.

15. మీరు విశ్లేషకులా?

ప్రజల మానసికవికాసం కోసం వాళ్లను ఉత్తేజపరచండి. స్వార్థంతో పశుహత్యలు చేయకుండా ఉండడానికి కృషి చెయ్యండి.

16. మీరు స్వాములా?

మీ ఉపన్యాసాలలో ఆవుల సద్గుణాలని, గోవంశఖ్యాతిని గురించి చెప్పండి.

17. మీరు గోపాలకులా?

ఆవుపాల ప్రభావాన్ని జనానికి తెల్పండి.

18. మీరు కవులా?

గోమాత పిలుపుకు మీ గొంతు కల్పండి.

ఇంటింటికి ఆవు - గ్రామ గ్రామానికీ గోశాల

గోమాత రక్షణ - మానవుని కర్తవ్యం.

గోమాతను హింసిస్తే (i) భవ్యభారతాకాశంలో సూర్యాస్తమయం అయిందనుకోవాలి-

(ii) ఇప్పుడున్న కొంచెం కొత్తదనం కూడా పోతుంది-

(iii) ఈ స్వర్ణభారత భూమి ఇక శ్మశానం అయ్యే ప్రమాదం ఉంది - నాశనమవుతుంది - అంతరిస్తుంది.

ఇదంతా ప్రజాహితం కోరి చెప్పడమే.



# పంచగవ్య విశేషాలు

గోవు ద్వారా పంచగవ్యాలు లభిస్తాయి. పాలు, పెరుగు, నెయ్యి, మూత్రము, గోమయము. (పేడ) 'యత్త్వగస్థిగతం, పాపం దేహే తిష్ఠతి మామకే। ప్రాశనాత్ పంచగవ్యస్య దహత్యగ్ని రివేంధనమ్' - చర్మము నుండి ఎముకల వరకు శరీరములో గల రోగములు, అగ్నివలన ఇంధనము కాలిపోవునట్లు పంచగవ్యముల వలన నశించిపోవును. రస, కటు, తిక్త, కషాయ, మధుర, లవణములు పంచరసయుక్తములు.

**గవ్యం పవిత్రం చ రసాయనం చ పథ్యం చ హృద్యం**
**బలమూర్జితం స్యాత్।**
**ఆయుఃప్రదం రక్తవికాసహారి, త్రిదోష, హృద్రోగ, విషాపహం స్యాత్॥**

పంచగవ్యములు గొప్ప రసాయనములు. పథ్యము మనసుకు ఆనందము నిచ్చునది - బలము, బుద్ధి, ఆయువును ఇచ్చును. రక్త దోషము లను తొలగించి కఫము, వాతము, పిత్తము వలన కలుగు హృదయ రోగము లను తొలగించును.

**గవ్యం సుమధురం కించిద్ దోషఘ్నం కృమికుష్ఠనుత్।**
**కణ్డూతిం శమయేత్ వాతం సమ్యక్ దోషాపహం హి తత్॥**

(సుశ్రుత సంహిత - 500 సం॥ క్రిందటి ఆయుర్వేద గ్రంథం)

గోమూత్రం వగరు, కషాయము వలె తీక్ష్ణము, ఉష్ణము, మస్తిష్కము నకు బలము నిచ్చును. కఫ వాతములను హరించును. - శూలము, గుల్మము, ఉదరము, కుష్ఠవ్యాధి రోగములను పోగొట్టును.

**1. గాయత్ర్యా ఇతి గోమూత్రం :**

తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్ ॥

**2. గంధాద్వారేతి గోమయం :**

గన్ధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ -
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్॥

**3. ఆప్యాయస్వేతి క్షీరం :**

ఆప్యాయస్వ సమేతు తే విశ్వతః
సోమవృష్ణియం భవా వాజస్య సంగథే

**4. దధిక్రావణ్ణో ఇతి దధి :**

దధిక్రావణ్ణో అకారుషం। జిష్ణోరశ్వస్య
వాజినః సురభినో ముఖాకరత్। ప్రణ ఆయూగుంషి తారిషత్ ॥

**5. శుక్రమసీతి ఘృతం :**

శుక్రమసి జ్యోతిరసి తేజోఽసి దేవో వః
సవితో పునాత్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః

ఈ ఐదింటిని పంచగవ్యములు అని మనం అంటాము.

1. అందుకే ఆవునుండి వచ్చే పదార్థములు పాలు, పెరుగు, నెయ్యి మొదలగునవి ఉష్ణముతో కూడినవి (వేడిమి). అయిననూ 'ఘృతేన వర్ధతే బుద్ధిః' - ఆవు యొక్క నెయ్యి తినడం వల్ల మేధాశక్తి పెరుగునని శాస్త్రాల్లో కూడా చెప్పబడింది.

2. గోమూత్ర ప్రాశనం వల్ల రక్తపోటు మొదలగు వ్యాధుల నుండి విముక్తి లభించును. విద్యార్థులకు గోమూత్ర ప్రాశనం వల్ల ధారణశక్తి ఎక్కువగా కలుగుతుంది. అందుకే వైదికపరమైన కార్యాల్లో, వేద పాఠశాలల్లో గో మూత్రమునకు ప్రాధాన్యత ఎక్కువగా ఇవ్వడమైనది.

మన శరీరము పృథ్వి, వాయువు, జలము, అగ్ని, ఆకాశము లనే ఐదు తత్త్వాలతో ఏర్పడుతుంది. ఈ ఐదు తత్త్వాలు పంచగవ్యములుగా లభిస్తాయి. పంచగవ్యములలోని పంచతత్త్వములు దివ్యౌషధములు. మలబద్ధకమునుండి క్యాన్సరువరకూ అన్ని రోగాలను నివారిస్తాయి.

'గోమూత్రే త్రిదినం స్థాపయ, విషం తేన విశుధ్యతి' - ఆవు కడుపులోనికి విషపదార్థాలు ప్రవేశిస్తే, దానిని పాలలో మూత్రంలో కలియనీయకుండా వేరు వేరుగా నుంచును. మిగిలిన జంతువులకు అలా జరుగదు. కనుకనే గోక్షీరం, గోమూత్రం, గోమయం సమస్త రోగనాశకములు. అందుకే వీటిని పంచగవ్యములలో చేర్చారు.

**ఆవు పాలు**

"ప్రవరం జీవనీయానాం క్షీరముత్తమం రసాయనమ్" (చరకశాస్త్రం). జీవనశక్తి గల భోజన పదార్థాలన్నింటిలోనూ ఆవుపాలు అత్యంత జీవనీయ తత్త్వం గలవి. ఆవుపాలు హృద్రోగాలను దరిజేరనియ్యవు. జ్ఞాపకశక్తిని, బుద్ధిబలాన్ని, ఓజస్సును పెంచే శక్తి ఆవు పాలకుంది. దానిలో ఓరోటిక్ రసాయనం ఉండడంవల్ల చిన్న పిల్లలకు పచ్చకామెర్లు రానీయదు. లాక్టో కోకస్, బోసిన్, విటమిన్లు ఎక్కువగా ఉంటాయి. అటామిక్ రేడియేషన్ నుండి రక్షించగల సర్వాధిక శక్తి ఆవుపాలల్లో ఉందని రష్యన్ శాస్త్రజ్ఞుడు పేర్కొన్నాడు. ఆవు వెన్నెముకలోని సూర్యకేతు నాడి సూర్యుని ప్రకాశంతో చేతనం పొందిన కణంలో ఒక పసుపుపచ్చని పదార్థాన్ని వదులుతుంది. స్వర్ణ తత్త్వం గల ఈ పాలకు విషాన్ని హరింపచేసే శక్తి ఉంది. తల్లి పాలవలె సులభంగా జీర్ణం అయ్యే శక్తి ఆవు పాలల్లో ఉంది. ఇది సంపూర్ణాహారము. శరీరంలో తేలికగా ఇముడును. ఆవుపాలతో ఆరోగ్యము ఉత్సాహము చేకూరును. శిశువులకు, వృద్ధులకు చాలా శ్రేష్ఠము. క్రొవ్వు ఉండదు.

ఆవుపాలలో ప్రొటీనులు, కార్బొహైడ్రేట్లు, ఖనిజాలు, విటమినులు, మెగ్నీషియం, క్లోరిన్ మొదలైన లోహాలున్నాయి. ఎ, బి, సి, డి, ఇ, విటమిన్లు ఉన్నాయి. కనుకనే మనకు ఆవుపాలు మంచి శక్తినిస్తాయి. ఆవుపాలలో, ఆవు నెయ్యిలో అణుబాంబు విషమును నిరోధించే శక్తి ఉంది. ఈ పాలలో ఐశిజీళిదీశిరిజీరిదీ తత్త్వమున్నది. అది అణు వికీరణమును నిరోధించగలదు. చంటి పిల్లల తల్లులు, గర్భవతులు, అనారోగ్యముగా ఉన్నవారు, బలహీనులు అందరూ సేవించవచ్చును. దీనిలో సెరిబ్రోయిడ్ తత్త్వం ఉన్నందువల్ల మానసిక వికాసమునకు తోడ్పడుతుంది. ఆవుపాలు చలువ చేస్తాయి. అందుచే పిత్త వికారములు తొలగుతాయి. అల్సర్, ఎసిడిటి, దాహం, వేడి శరీరం గలవారికి ఎంతో శ్రేష్ఠం. జలోదర వ్యాధిగ్రస్తులకు ఆవుపాలు సేవించిన వ్యాధి ఉపశమించును. ఆవు పాలు, పెరుగు, మీగడల యందు పౌష్టికాహారము మిన్న - వీటిని సేవించటం వల్ల పూర్తి ఆరోగ్యము, రోగనిరోధక శక్తి పొందవచ్చును. ఆవు పాలతో తయారయిన మిఠాయి ధాతువర్ధన, వీర్యవర్ధన, కాంతివర్ధన కారులు. ఆవుపాలలో విటమిన్ ఎ-100, ఆవు నేతిలో ఎ-1900, పాలకోవాలో ఎ-400 యూనిట్లు ఉన్నాయి. ఆవుపాలలో యం.డి. జిజైజ్ ప్రొటీనులు ఉన్నందువల్ల అవి క్యాన్సర్ వ్యాధిని నిరోధిస్తాయి. ఆవుపాలలో, ఆవు నెయ్యిలో కలిపిన వేడి వేడి హల్వా తిన్నట్లయితే క్యాన్సర్ తగ్గుతుంది. గ్రహణవ్యాధి నివారణకు, పదకొండు కిస్‌మిస్ పండ్లు, ఆవు పాలలో నానబెట్టి తినాలి. ఆ పాలు కూడా త్రాగాలి. అందులో పంచదార కలపరాదు. ఈ విధంగా పదకొండు రోజులు చేస్తే వ్యాధి నివారింపబడుతుంది. 5 కిస్‌మిస్, 5 ఎండుద్రాక్షపండ్లు, ఆవుపాలలో నానబెట్టి మలేరియా రోగి ఉదయం తిన్నట్లయితే వ్యాధి తగ్గుతుంది. వ్యాధి ముదిరితే 10 గ్రాములు శొంఠి చూర్ణం కూడా కలిపి తిన్నట్లయితే వ్యాధి దూరమౌతుంది.

గర్భవతులయిన స్త్రీలు ఆవుపాలు త్రాగుతూ, ఆవును భక్తితో పూజించి, గోవు చుట్టూ ప్రదక్షిణలు చేస్తే వారికి గర్భవాతదోషం పోతుంది. ఆరోగ్య వంతులు, గుణవంతులు, బుద్ధిమంతులు, యోగ్యులు అయిన సంతానాన్ని పొందుతారు. సుఖప్రసవం కూడా జరుగుతుంది. ఆవు యొక్క రంగును బట్టి పాలలో విశేషగుణాలున్నాయి. ఎరుపురంగు ఆవుపాలు పిత్తాన్ని హరిస్తాయి. తెల్లరంగు ఆవుపాలు కఫాన్ని నాశనం చేస్తాయి. నలుపురంగు ఆవుపాలు వాత నాశనకారి. ఆరవైఆరు పిండివంటలు ఆవు చంటిలో నున్నాయని పెద్దలంటారు.

సమస్త దేవతలకు ప్రీతి అయినవి ఆవు పాలు. పంచామృతాలు లేనిదే దేవతార్చనలు లేవు. 'గంగి గోవుపాలు గరిటెడైనను చాలు' అంటారు.

**గాం జలం క్షీరం వా పిబంతీం న నివారయేత్**
**దోహనార్థం వారణాదన్యత్ర నిషేధః**
**నాపి పరకీయక్షీరాది పిబంతీం తస్య జ్ఞాపయేత్ ॥**

నీరు త్రాగుచున్న గోవును, పాలు త్రాగుచున్న దూడను వారించ కూడదు. ఒరుల దూడలు పాలు త్రాగుచున్న విషయం వారికి తెలియ నియ్యకూడదు.

**జగత్ప్రసూతిర్జగదేకపావనీ**
**వ్రజోపకంఠం తనయైరుపేయుషీ ।**

**ద్యుతిం సమగ్రాం సమితిర్గవామసా-**
**వుపైతి తం తైరివ సంహితాహుతిః ॥**

గోవులు జగత్తునంతటిని పావనం చేస్తాయి. గోవుల జగదేక పావనత్త్వం ఏమిటంటే ఏ పాపాలు చేసినవా రెవ్వరైనా ప్రాయశ్చిత్తం కొరకు పంచగవ్యాలు

స్వీకరిస్తారు. నూతన గృహప్రవేశంలో ఆవుపాలు పొంగించడం, సూర్యదేవునికి ఆవుపాలు పొంగించి నైవేద్యం పెట్టడం మన సంస్కృతి.

లేత పసుపురంగు(బంగారురంగు) ఆవు పాలకు మాత్రమే ఉంటుంది. ఇది కిరోటిన్ అనే పదార్థము వల్ల వస్తుంది. ఈ రసాయనం గొంతు, ఊపిరి తిత్తులు, మూత్రావయవంలోని సున్నితమైన పొరలను పటిష్ఠం చేసి క్యాన్సర్ వ్యాధిని నిరోధిస్తుంది. వాటివల్ల 'ఎ' విటమిన్ ఉత్పత్తి అయి, కంటి సంబంధమైన రేచీకటి మొదలైనవాటిని నిరోధిస్తుంది.

మినపపిండి 10 గ్రాములు, గుగ్గిలం 10 గ్రాములు, 10 గ్రాములు ఏరండ తైలం, 10 గ్రాములు తాజాగా తీసిన ఆవు వెన్న విలేపనం తయారు చేసి ఉదయం, సాయంత్రం ఒక నెల రోజులు మర్దన చేస్తే గుండె సంబంధ మగు నొప్పులు తగ్గును. అందుకే ఆవు పాలు, పెరుగు, నెయ్యి వీనిని పౌష్టికాహారంగా గ్రహించాలి.

## జెర్సీ ఆవులు

క్రాస్‌బ్రీడ్ ఆవులు మనదేశపు వేడికి తట్టుకోలేవు. వాటిని పెంచడం చాలా వ్యయ ప్రయాసలతో కూడినది. దేశవాళీ ఆవులకంటే రెట్టింపు తింటాయి. మనదేశంలో లేని రోగాలను మనకు తెచ్చి నష్టం కలుగజేస్తాయి. జెర్సీ ఆవు పాలు నాసిరకంగా ఉంటాయి. దేశవాళీ ఆవు పాల విలువలు జెర్సీ ఆవుపాలకు రావు. జెర్సీ ఆవులు మూపురాలు కూడా తక్కువగా ఉండడం వల్ల వ్యవసాయంలో కూడా దున్నడానికి పనికి రావు. ఆవుదూడను సంస్కృతంలో 'వత్స' అంటారు. 'వదతి మాతరం ఇతి వత్సః' దూడ తన తల్లిని 'మా' అని పిలుస్తుంది. 'భక్తవత్సలః భగవాన్'. మరియు 'ప్రజావత్సలః రాజా'. వత్సయొక్క భావం వాత్సల్యం. బాలలను 'వత్స' అని సంబోధిస్తాము.

మనదేశంలో ఉత్పత్తి అయ్యే మొత్తం పాలల్లో ఆవుపాలు 42శాతం మాత్రమే ఉండగా, ప్రపంచ సగటు 85శాతంగా ఉంది. ఆవుపాల ఉత్పత్తులను ప్రపంచవ్యాప్తంగా డిమాండ్ అధికంగా ఆవుల పెంపకాన్ని పెంచాలి.

**ఆవు పెరుగు**

ఆవు పెరుగు, మజ్జిగ ఆకలిని పెంచుతాయి. జీర్ణశక్తిని కలిగిస్తాయి. వెండి పాత్రలో తోడు పెట్టిన పెరుగు చాలా మంచిది. ఆవు పెరుగు పంచామృతాలలో చేరుతుంది. దేవతలకు ప్రీతికరమైనది. దీనిలో క్రొవ్వు పదార్థం ఉండదు. ఆవు మజ్జిగలోని లాక్టిల్ జీవాణువులు శరీరంలో రోగనిరోధకశక్తిని పెంచుతాయి.

ఆవు పెరుగు సారాయి, బ్రాంది, గంజాయి, హెరాయిన్ మత్తు పదార్థాల తీవ్రతను తగ్గిస్తుంది. ఆవు మజ్జిగను మూడుపూటలా తీసుకుంటే క్షయవ్యాధి నివారణమౌతుంది. మలేరియా నివారణకు 400 గ్రాములు పాలు విరగగొట్టి ఆ విరుగుడు, పంచదార కలిపి చిలికి వాడిన జ్వర నివారణ కలుగుతుంది. ఆవు పాలలో కొలెస్ట్రాల్ లేనందున గుండెకు రక్తానికి ఏ విధమైన హాని కలుగదు.

**ఆవు నెయ్యి**

దీనిని అమృతం అంటారు. ఇది బలము, ఆయువు, ఓజస్సు, తేజస్సులను ఇస్తుంది. దీనిలో ప్రాణవాయువు ఉంటుంది. శరీరమునకు పోషకశక్తి నిస్తుంది. ఇది ఒక ఓషధి - ఆవునేతి వల్ల గాఢనిద్ర లభిస్తుంది; రోగనిరోధకశక్తిని పెంచుతుంది.

ఆవు నెయ్యి హోమం చేసిన ఆ పొగ ఎంతవరకు వ్యాపిస్తుందో అంత వరకూ అణు కీటకాలు నశిస్తాయి. కృత్రిమ వర్షం కురిపించడానికి

అవసరమైన 'ప్రొపలీయన్ గ్యాస్' ఆవునేతి హవనం వల్ల వస్తుంది - బియ్యము ఆవునేతితో కలిపి హోమం చేయటం వల్ల ఇథలిన్ ఆక్సైడ్, ప్రోవలిన్ ఆక్సైడ్, ఫార్మా జొయాసిడ్ వాయువులు వెలువడుతాయి. ఈ వాయువులు జీవాణు రక్షణకు ఉపయోగపడతాయి.

ధర్మానికి మూలం గోవు. యజ్ఞాలు కేవలం గోవు యొక్క నెయ్యితోనే సఫలం అవుతాయి. నేటి ముఖ్య సమస్య అయిన వాతావరణ కాలుష్యం ఆవు నేతితో చేసిన యజ్ఞం ద్వారానే నివారణ అవుతుంది.యజ్ఞం చేసే స్థలం కూడా గోమయం, గోమూత్రంతోనే శుద్ధి అవుతుంది. ఆవు నెయ్యి శరీరంలో కాంతిని వృద్ధి చేస్తుంది. అలసటను దూరం చేస్తుంది. శరీరంలోని దోషాలను శుద్ధి చేసి విషాన్ని అంతం చేస్తుంది. పిల్లలకు, వృద్ధులకు అవసరమైన సమస్తపోషకపదార్థాలను ఇస్తుంది.

ఒక తులం ఆవు నెయ్యితో యజ్ఞ యాగాదులు నిర్వహిస్తే ఒక టన్ను ఆక్సిజన్ లభిస్తుంది.

**గోమయం**

భగవంతుని సృష్టిలో ఏ ప్రాణి యొక్క మూత్ర, పురీషాలకు ఇంత ప్రాధాన్యత లేదు. గో మూత్ర పురీషాలకు మాత్రమే ఉంది. అందుకే గోవును జగదేకపావని అన్నారు.

**గోమయేన సదా స్నాయాత్ కర్షిషి చాప్యుపవిశేత్ ।**

(మహాభారతం, అనుశాసనికపర్వం)

ప్రతిరోజు పెండ పూసుకుని స్నానము చేయుట, ఎండిపోయిన పేడపై కూర్చొనుట చెయ్యాలి.

**గోష్ఠాంగణ గతిప్రియః**

(పురుషోత్తముని సహస్రనామావళి - 10వ స్కంధం)

శ్రీకృష్ణుడు గోశాలలో పేడలో ఆటలాడుకోవడానికి ఇష్టపడతాడని చెప్పబడింది.

**గోమూత్రేణ స్నాపయిత్వా, పునర్గోరజ సార్ధకమ్।**
**రక్షాం శకృత్ కృత్వా, ద్వాదశాంగేషు నామభిః॥**

(శ్రీమద్భాగవతం)

శ్రీకృష్ణుడు పూతన దగ్గర పాలు తాగిన తర్వాత గోపికలు శ్రీకృష్ణునికి స్నానం చేయించి గోరోజనం పెట్టి శరీరమంతా పేడరాశారు. పేడ గొప్ప మాహాత్మ్యం గలది.

**'యన్మే రోగం శోకం చ తన్మే దహాతు గోమయమ్'**

పేడతో స్నానం చేస్తే శరీరరోగాలు తగ్గిపోతాయి. గోమయ మహత్తు వర్ణింపశక్యంకానిది. అది క్రిమికీటకనాశనం. కాంతిప్రదం, దుర్గంధ నాశకం, వీర్య వర్ధకం, శోధన గావించేది. పరమ పవిత్రమైనదిగా చెప్పబడింది.

భోపాల్ విషవాయువు వచ్చిన సమయంలో ఒక ఇంట్లో విషవాయువులు ఏమీ చేయలేకపోయాయట. ఆ యింట్లో ఏమీ చెక్కు చెదరలేదట. కారణం ఏమిటో తెలుసా? ఆ ఇంట్లో ఆవుపేడతో యజ్ఞం చేశారు కాబట్టి.

ఆవుపేడ కాలుష్యం లేని ఎరువు. రసాయన ఎరువులకంటే క్రిమి సంహారకమైన మందుగా ఉపయోగపడుతుంది. ఆవుపేడకు ప్లేగు, కలరా వ్యాధి క్రిములను నాశనంచేసే లక్షణాలున్నాయని చెన్నైకి చెందిన ఒక ప్రముఖవైద్యుడు పరిశోధన చేసి కనుగొన్నాడు.

గోమయంతో, గోమూత్రంతో (యన్.పి.కె.) నత్రజని, భాస్వరం, పొటాషియం పుష్కలంగా ఉండే ఎరువులను తయారు చేసుకోవచ్చు. మానవ హానికరాలుకాని సస్యరక్షణ మందులు తయారు చేసుకోవచ్చు. రసాయన ఎరువుల వల్ల లాభసాటి బ్యాక్టీరియా నశించి పంటనష్టం, భూమి బీడువారి పోవడం, సత్తువ క్షీణించడం జరుగుతుంది.

ఆవుపేడ వాతావరణ కాలుష్యం తొలగిస్తుంది. క్రిమి సంహారక గుణం కలది. దోమలను నివారిస్తుంది. చర్మ సంబంధమైన అన్ని రోగాలను అరికట్టుతుంది. గాయాలను మాన్పుతుంది.

ఆవుపేడతో చేసిన పిడకలను మండించినప్పుడు మెథ్లిన్, ఫినాయిల్, అమ్మోనియం, ఫార్మైలిన్ వాయువులు వస్తాయి. అందుచే వాతావరణ కాలుష్యం ఉండదు. ఆవు నెయ్యి మూడు పూటలా ముక్కులో వేసుకుంటే ముక్కుకు సంబంధించిన బాధలు తొలగుతాయి.

పర్యావరణ పరిరక్షణకు అడవుల అభివృద్ధి వన్యప్రాణుల సంరక్షణ అనేవి మనదేశ రక్షణకు ముఖ్యాంశాలు. ఆవు, దాని సంతతి వాతావరణ కాలుష్యాన్ని పోగొడతాయి. పచ్చిగడ్డి, ఎండుగడ్డి, ఆకులు, బార్లీ, గోధుమ, చెఱకు, పప్పుదినుసుల ఆకులు, వ్యవసాయిక వ్యర్థపదార్థాలను ఆవులు తిని మనలను రక్షిస్తాయి. లేనిచో ఆ పదార్థాలు కుళ్లి, కాలి వాతావరణాన్ని కాలుష్యం చేస్తాయి. గోమయం కాలుష్యంలేని బయో ఫెర్టిలైజర్. ఎద్దుల పేడ కూడా కాలుష్యం లేనిది. కరువు కాటకాలు రాకుండా కాపాడుతాయి. కాలుష్యం లేని బయోగ్యాస్‌ను ఇస్తాయి.

వీటితో వంటగ్యాస్, పెట్రోలు, డీజిల్, కిరోసిన్ మొదలైన నూనెలు తయారుచేసి లబ్ధి పొందవచ్చు. ఆవుపేడలో లక్ష్మీదేవి నివసిస్తుంది. అందుకే వాటికి నమస్కరిస్తే ధర్మం నాలుగు పాదాల నడుస్తుంది. బుద్ధిమంతుడు,

మంగళం కోరే మానవుడు ఆవులకు ఎల్లప్పుడూ నమస్కరించడం అవసరం. ఇది పరమ పవిత్రమైన కర్మ. ఆవు పృష్ఠానికి నమస్కరించడం శ్రేయోదాయక మని శ్రీసూక్తంలో చెప్పబడింది.

పేడను, గోమూత్రాన్ని శుద్ధి చేసి దైనందిన అవసరాలకు ఉపయోగపడే వస్తువులను రూపొందించవచ్చునని ప్రయోగాలు చేసి నిరూపించారు. ఫేస్ పౌడర్, షాంపూ, పళ్లపొడి, తలనొప్పి బామ్, అగరువత్తులు, ధూపం, కేశతైలం మొదలగువాటిని తయారుచేసి అమ్ముతున్నారు.

**కామధేను తైలము :** గోమూత్రం, ఉప్పు, నూనె, గోమయ రసం, ముద్దకర్పూరం, వోమసత్తు మొదలైనవి కలిపి దీనిని తయారుచేస్తారు. దీనిని శరీరంలో ఏ భాగమందైనా నొప్పి ఉన్నచోట రాసి, తర్వాత కాపడం పెట్టాలి.

**గోపాలనశ్యం :** గోవత్సం, పాలు, మిరియాలతో తయారుచేసిన నశ్యం ముక్కు రంధ్రాలలో ఊదితే మూర్ఛరోగం తగ్గిపోతుంది.

**గోమయ సబ్బు :** స్వదేశీ ఆవుపేడ, జామట్టి, కర్పూరం, ముల్తానిమట్టి, గోమయరసం కలిపి వండిన నూనెలతో తయారుచేసిన ఈ సబ్బు వాడితే ముఖం పై మచ్చలు పోయి, ముఖాన్ని కాంతిమంతంగా ఉంచుతుంది.

**కామధేను షాంపు :** గోమూత్రం, కర్పూరం, అరీఠా, వోమపొడి కలిపి ఈ షాంపును తయారుచేస్తారు.

**గోమయ దంతమంజన్ :** ఆవు పేడతో, పిడకలతో కాల్చిన బొగ్గు, సాదా కర్పూరం, వాముతో కలిపి దీనిని తయారుచేస్తారు. ఇది వాడటం వల్ల చిగుళ్లవాపు, గొంతు బొంగురుపోవటం తగ్గుతుంది.

**గోమూత్రం :** గోమూత్రంలో రసాయనిక గుణాలు, శక్తులు ఉన్నాయి. అవి శరీరంలోని దుష్పరిణామాలను, లోటుపాట్లను తొలగించే శక్తిని కలిగి

ఉన్నాయి. ఇది క్రిమినాశక పదార్థం. అందుకే దీనిని పవిత్రమైనదిగా భావిస్తారు.

**జాగర్ తులసి అరుగాయ్। తాఘర్ వైద్యక బహునజాయ్।**
**కహాహై జీవన్తు అవధ్యాః తా మే విషస్య దూషణ్యాః॥**

గోవులను వధించకుండా ఉండాలి. గోవులు జీవించి ఉండాలి. అవి విషాన్ని తొలగిస్తాయి. ఆయుర్వేదంలో విషపదార్థాలను గోమూత్రంతో శుద్ధి చేస్తారు. గోమూత్రాన్ని ఏంటీటాక్సిన్, ఏంటీ సెప్టిక్, ఎంటీబయాటిక్‌గా తెలిసికొని ఉపయోగించుకోవాలి. దానిలో విటమిన్ బి, కార్బాలికేసిడ్ ఉన్నాయి కనుక వందలకొద్దీ రోగాలను తగ్గించే గుణం గోమూత్రం కలిగి ఉంది.

గోమూత్రం, పురీషాదుల వల్ల బహిశ్శుద్ధి, అంతశ్శుద్ధి ఏర్పడుతుంది. మహాపాతకాలు, ఉపపాతకాలు నివారించబడతాయి. అందువల్లనే గోవును 'జగదేకపావని' అని శాస్త్రాలు పేర్కొన్నాయి.

**ఋషభాంశ్చాపి జానామి రాజన్ పూజితలక్షణాన్ ।**
**ఏషాం మూత్రముపాఘ్రాణం అపి వంధ్యా ప్రసూయతే॥**

(మహాభారతం - విరాటపర్వం)

ఉత్తమ లక్షణం గల ఎద్దుల గోపంచితాన్ని వాసన చూసినంత మాత్రాననే వంధ్యలు (గొడ్రాళ్లు) సంతానవతులౌతారు.

గోమూత్రంలో 24 రసాయనాలు, 16 ఖనిజ అంశాలతోపాటు ఐరన్, కాల్షియం, ఫాస్ఫర్ వంటి గుణాలు కూడా ఉన్నాయని గుర్తించారు. అందుకే అది 108 వ్యాధులకు పరమౌషధం - సంజీవనిలాంటిది.

## గోమూత్రంలో గల రసాయనాలు

1) నత్రజని (Nitrogen), 2) గంధకం (Sulphur), 3) అమ్మోనియం (Ammonia), 4) అమ్మో నియం గ్యాస్ ($NH_3$), 5) తామ్రము (Copper Cu), 6) ఇనుము (Iron Fe), 7) యూరియా (Co $NH_2$), 8) యూరిక్ యాసిడ్ (Uric Acid C3 $H_4N_4O_3$), 9) ఫాస్పేట్ (Phospate - P), 10) సోడియం (Sodium Na), 11) పొటాషియం (Potassium -K), 12) మాంగనీస్ (Manganese MN), 13) కార్బాలికేసిడ్ (Carbolic Acid HCo OH), 14) కాల్షియం (Calcium Ca), 15) లవణము (Salt NaCl), 16) విటమినులు (Vitamins), 17) ఇతర ఖనిజములు (Other Minerals), 18) లాక్టోసు (Lactose ($C_6H_{12}O_6$), 19) ఎంజైములు (Enzymes), 20) జలము ($H_2O$), 21) హిప్ప్యూరిక్ యాసిడ్ (Hippuric Acid Cg Ng nox), 22) క్రియాటినిన్ (Creatinin $C_4$Hg $N_2O_2$), 23) హార్మోనులు (ఎనిమిది మాసాల గర్భిణి అయిన గోవుమూత్రములో) 24) స్వర్ణక్షారము (Aurun Hydroxide $A_4$ OH)

## గోమూత్రం వాడితే తొలగే వ్యాధులు

1) అజీర్ణము, 2) అతిసారము, 3) ఆమ్లపిత్తం, 4) అపస్మారము, 5) అర్శమొలలు, 6) అనాహము, 7) ఆమవాతము, 8) ఆమ్లాశయ వ్రణము, 9) ఉదర రోగము, 10) వడదెబ్బ, 11) పొందు, 12) ఉదావర్తము, 13) పిత్తవృద్ధి, 14) ప్లీహవృద్ధి, 15) బద్ధకోష్ఠము, 16) అతి మూత్రము, 17) అల్కాహోలిజం, 18) మసురిక, 19) ముఖరోగము, 20)మూర్ఛ, 21) మూత్రకృచ్ఛ్రము, 22) మూత్రనాళములో వ్రణము, 23) మదావృద్ధి, 24) యకృత్‌వృద్ధి, 25) రక్తపోటు, 26) రక్తపిత్తము, 27) రక్తవిహారము, 28) ఉన్మాదము, 29) ఉపదంశము, 30) ఉరతోయము, 31) ఉరస్తమ్భము,

32) కంఠరోగము, 33) మలబద్ధకము, 34) కుష్ఠువు, 35) కామెర్లు, 36) చెవిరోగము, 37) దగ్గు, 38) దాహము, 39) వమనము, 40) విరేచనము, 41) బాలారిష్టము, 42) బుద్ధిమాంద్యము, 43) భస్మకము, 44) దంతరోగము, 45) దాత్.

గోమూత్రం ఒక లీటరు రూ. 120/-, పేడ కిలో రూ. 15/- అమ్ముతోంది. మహారాష్ట్రలోని 'వెడప్ కాషా' అనే సంస్థ మూడు గోవుల ద్వారా రూ. 60,000/- విలువ చేసే సేంద్రియ ఎరువులను, రూ. 2.50 లక్షలు విలువ చేసే అగరుబత్తులను తయారుచేసి సంచలనం సృష్టించింది.

గోమూత్రంవల్ల భూసారం 20శాతం అభివృద్ధి చెందుతుంది. ఒక గ్రాము గోమయంలో 300 కోట్ల సూక్ష్మజీవులు ఉంటాయి. అవి భూసారాన్ని పెంచుతాయి.

'అగ్రమగ్రం చరన్తీనా మోషధీనాం వనే వనే'. అంటే ఆరోగ్యవంతమైన గోవుయొక్క మూత్రం ఔషధంగా పనిచేస్తుంది. ఒక రోగానికి అనేకమందులు వాడనక్కర్లేదు. సమస్తరోగాలకు గోమూత్రమే సరియైన మందు.

**గోవు గురించిన పుస్తకాలు**

---

1)Cow is a Wonderful: అమెరికా వ్యవసాయ Laboratory పరిశోధనశాల

| | | |
|---|---|---|
| 2)గోసంపదే గ్రామోదయం | : | శ్రీ బవన్‌లాల్ కొటారి<br>అఖిల భారత గోసంరక్షణ<br>సమితి అధ్యక్షులు |
| 3) జై పంచగవ్య | : | శ్రీ హుకుంచంద్ సావలా<br>అఖిలభారతీయగోరక్షణ<br>సంఘటనామంత్రి |

4) గోమూత్రం పరమౌషధం : శ్రీ బాపూరావు సర్ దేశాయ్

5) పంచగవ్య చికిత్స : డా॥ గౌరీశంకర్ మహేశ్వరి

---

**N.B. :** పంచగవ్యాలు అంటే స్వదేశీ గోవు ఇచ్చే పాలు, పెరుగు, నెయ్యి, గోమయం, గోమూత్రం. (జెర్సీ ఆవువి కాదు)

పల్లెల్లో గోసంతతి ఎప్పుడైతే తగ్గుతుందో అప్పుడే పల్లె ప్రజలు పల్లెలను విడిచిపోతారు.

Animal Welfare Board of India, No.7, 2nd Cross Street,

Sec.4 of prevention of cruelity to Animal Act.

Venus Colony, Alwarpet,Chennai-18

పశువులపై క్రూరత్వం, హింస అరికట్టాలని ఏర్పడింది.

**'ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పండితః**

ఎవరు అన్ని ప్రాణుల్లో ఆత్మభావం కలిగి ఉంటారో వారే పండితులని చెప్పబడింది.

**'తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః**

సకల ప్రాణుల హితంలో సంలగ్నులైనవారు పరబ్రహ్మానే పొందుతారని చెప్పబడింది.

'వందే ధేనుమాతరం' గోసంతతి మనచుట్టూ ఉన్న వాతావరణ పరిస్థితులను బాగు చేసి రక్షిస్తుంది. అంతేకాకుండా జీవావరణాన్ని సమతౌల్యం చేస్తుంది.

మన హిందూ సంప్రదాయాల్లో, ధర్మశాస్త్రాల్లో, పురాణాల్లో, ఇతిహాసాల్లో గోవుకున్న స్థానం మరొక దానికి లేదు. కన్నతల్లి తన బిడ్డను ఎంత జాగ్రత్తగా

చూసుకుంటుందో, రక్షిస్తుందో, అలాగే గోవు మనలను రక్షిస్తుంది. అందుకే గోవును గోమాత అన్నారు. ప్రతి జీవి మాతాపితరులకు సేవ చేసి తమ ఋణం ఎలా తీర్చుకుంటారో, అలాగే మానవుల కోర్కెలను తీర్చి, సదా ఆయురారోగ్యాలతో కాపాడే గోమాతను మనం రక్షించడం మన ధర్మం.

గోవు భారతీయ ధార్మిక చింతనలోనే కాదు; ఆర్థిక వ్యవస్థలోనూ ఒకనాడు కీలకమే. గోమాత మన భూభాగంమీద ద్రవ్యంగా చలామణి అయింది. భారతీయులు వ్యవసాయం మీద ఆధారపడితే, ఆ వ్యవసాయ భారాన్ని తమ భుజాల మీద మోస్తున్నవి ఎద్దులు. అలాంటి ఎడ్లనిచ్చేది గోవులే. అందుకే ఆవు మనకు అమ్మ. ఎద్దు మనకు అన్న.

మన సంస్కృతి మిగిలిన దేశాల సంస్కృతి కంటే భిన్నమైనది. మనది దైవికమైతే, మిగిలిన వారిది వస్తురూపమైనది. “గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం సర్వే జనా స్సుఖినో భవంతు” అని మనం శుభంకోరుతూ ఆవును ఆరాధిస్తాం. శ్రీకృష్ణుడు ఆవుల మంద మధ్య ఉండడానికి ఇష్టపడతాడు. ‘నంది’ శివునికి వాహనం. పశుసంపద మనకు ముఖ్య సంపద. వాటిల్లో ఆవు,ఎద్దు,ఆంబోతు మనకు ముఖ్యమైనవి.

## పంచ గవ్యములతో తయారుచేయబడే కొన్ని ఔషధాలు - వాటి గుణాలు

### 1. ఆవుపాలు (గోక్షీరము)

ఇతర అన్ని పశువుల పాలకంటె ఆవుపాలు అత్యంత శ్రేష్ఠమైనవి. శరీరానికి పుష్టిని కలుగజేస్తాయి. బుద్ధి, బలము, మంచి రంగును కలుగజేస్తాయి. రసరక్తాది ధాతువులన్నింటినీ పోషిస్తాయి. శుక్రవృద్ధిని కలుగజేస్తాయి. స్తన్య వృద్ధిని కలిగిస్తాయి. శరీరంలో మృదుత్వాన్ని

పెంచటానికి ఆవు పాలు ఉపయోగపడతాయి. రక్తపిత్తాన్ని నివారిస్తాయి. ఈ దిగువ తెలుపబడిన వ్యాధులలో ఆవుపాలను ఉపయోగించుట వలన హితం కలుగుతుంది.

1. వివిధములైన మానసిక వ్యాధులు మరియు ఉన్మాదం (Various Mental disorders and schicophrenia / insanity)
2. అపస్మారము (epilepsy)
3. విషాదము (depression)
4. జీర్ణ జ్వరము (chronic fever)
5. వాత రక్తము (gout)
6. మల బద్ధకము (constipation)
7. అర్శస్సులు, మూలలు (piles)
8. రక్త క్షీణత (anaemia)
9. సంగ్రహణి (sprue)
10. ఉదర రోగములు (liver, spleen and enlargement ascitis etc.)
11. ఉదావర్తము (gases)
12. రక్త పిత్తము (ముక్కు, నోరు, అధోమార్గములగుండా, రక్తస్రావము కలుగుట – haemorrhagic disorders)
13. స్త్రీ రోగములు (abortion, uterine disorders)
14. అస్థిభగ్నము (Bone fractures)
15. క్షయ (tuberculosis)

తల్లి పాలు తప్ప మిగతా అన్ని జంతువుల పాలను కాచి త్రాగవలెను. బాలురు, వృద్ధులు, క్షీణించిన వారు మరియు కృశించినవారికి ఆవు పాలు శ్రేష్ఠమైనవి.

బూడిద గుమ్మడికాయ మరియు మరికొన్ని వస్తువులతో గోవు పాలను కలిపి ఒక పద్ధతి ప్రకారం తయారుచేయబడే ఔషధవేం కూష్మాండావలేహ్యము.

**ఈ క్రింది తెలుపబడిన వ్యాధులలో ఇది ఉపయోగించాలి :**

1. ఆమ్ల పిత్తము (పులి త్రేన్పులు, ఛాతీలో మంట - hyper acidity)
2. దాహము (burning sensation)
3. భ్రమ (తల త్రిప్పుట - giddiness)
4. శోష (శుష్కించిపోవుట)
5. ధాతు క్షయము (రస రక్తాది ధాతువులు క్షీణించిపోవుట)
6. కామలా (పచ్చకామెర్లు - jaundice)
7. పరిణామ శూల (gastric ulcer)
8. పాండు (రక్త క్షీణత - anaemia)
9. జీర్ణ జ్వరము (chronic fever)
10. ఇతరవ్యాధులవలన కలిగిన దౌర్బల్యము
11. శరీరానికి పుష్టిని కలిగించుట
12. తృష్ణానివారణ కలిగించుటకు

మాత్ర : 10 గ్రాములు ఉదయము - సాయంత్రము

**అనుపానము : గోపాలతో**

**తీసుకొనవలసిన సమయము :** ఉదయము - సాయంత్రము భోజనము చేసిన తరువాత గాని లేదా వైద్యుని సలహా ప్రకారము గాని తీసికొనవలెను.

**నిషేధము :** ఆకలి సరిగా లేనప్పుడు ఔషధము తీసుకోరాదు. బాగా ఆకలి కానప్పుడు ఆహారం తీసుకోవడానికి ఇష్టం లేనప్పుడు, తీసుకున్న ఆహారం సరిగా జీర్ణం కానప్పుడు తీసుకోరాదు.

**గోక్షీరముతో గృహ వైద్యము**

**1. శరీర దౌర్బల్యము :** ఆవు పాలను తీసుకోవటం వలన శరీర బలహీనత తొలగిపోతుంది. ఉదయం, సాయంత్రం 100 మి.లీ. ఆవుపాలను పంచదార కలిపి తీసుకోవాలి.

**2. శరీర దాహము :** ఆవుపాలు మరియు మంచి నీరు సమానంగా కలుపుకొని పుచ్చుకొనవలెను.

**3. ఆమాతిసారము (జిగురుతో కూడిన విరేచనములు) :** వేడి చేసిన ఆవుపాలలో నిమ్మరసం కలుపుకొని తీసుకోవాలి. 1/4 కప్పు పాలల్లో ఒక స్పూన్ నిమ్మరసం కలిపి వెంటనే పుచ్చుకోవాలి.

**4. జలుపు, దగ్గు :** 1 కప్పు వేడి పాలల్లో 1/4 స్పూన్ పసుపు వేసి కాచిన తరువాత 1 స్పూన్ బెల్లం కలిపి వేడివేడిగా తీసుకోవాలి.

5. ఆవు యొక్క పచ్చి పాలతో శరీరానికి మర్దన చేసుకొన్నచో చర్మం కాంతివంతమౌతుంది.

6. గర్భిణీ స్త్రీలు ఉదయం - సాయంత్రం 9వ మాసం వరకు ఆవుపాలను తీసుకొంటుంటే ప్రసూతి వేదన తగ్గటమే కాక సంతానం కూడ ఆరోగ్యంగాను, బలంగాను ఉంటుంది.

7. ఆవుపాలు శుక్రకర్ధకమని చెప్పబడింది. ఎల్లప్పుడు ఆవుపాలు తీసుకోవటం వలన శరీరానికి బలం కలుగుతుంది. శుక్రధాతువులో శుక్రాణువులు తక్కువగా ఉన్నపుడు ఆవుపాలను తీసుకోవటం మేలు చేస్తుంది.

8. రాత్రిపూట ఆవుపాలు సేవించుట వలన ప్రశాంతమైన నిద్ర వస్తుంది.

## 2. ఆవు పెరుగు (గోదధి)

**వ్యాధి నివారణము**

ఆవు పెరుగు జఠరాగ్ని (ఆకలి)ని పెంచుతుంది, అభిష్యంది, మలమూత్ర ప్రవర్తకం, ఆహారంపట్ల రుచిని కలిగిస్తుంది.

**ఈ క్రింది వ్యాధులలో ఆవు పెరుగును తీసుకొనుట మంచిది**

1. అరుచి - ఆహారం రుచించకుండటం
2. ప్రతిశ్యాయము, పీనసము (allergic rhinitis)
3. చలి జ్వరము
4. విషమ జ్వరము (malaria)
5. అర్శస్సులు (piles)
6. రక్త వికారములు (blood disorders / bleeding disorders)
7. పాండు (anemia)
8. పిత్త వికారములు
9. బలహీనత (weekness)
10. నిద్రానాశము (నిద్రలేమి - insomnia)

**గమనిక :** 1) ఆవు పెరుగును పంచదార లేక ఉప్పు కలపకుండా తీసుకోరాదు. 2) రాత్రిపూట పెరుగు తినకూడదు. 3) 6 గంటలలో తోడుకున్న పెరుగు మధురంగా ఉండి ఎక్కువ ఆరోగ్యకరంగా ఉంటుంది.

**ఆవు పెరుగు తీసుకోవటంవలన నివారింపబడే వ్యాధులు**

1. మేదోవృద్ధి (శరీరంలో క్రొవ్వు పెరుగుట – excessive fat / obesity)
2. ఆమవాతము (rhuematism)
3. కుష్ఠము (చర్మ వ్యాధులు – skin diseases)
4. రక్త పిత్తము (haemorrhagic disorders)
5. పిత్తజ వ్యాధులు

**ఆవు మజ్జిగ (గోతక్రము)**

**తయారు చేయుట**

1 లీటరు తాజాగా తోడుకున్న పెరుగును తీసుకోవాలి. మొదట దానిని కవ్వంతో చిలకాలి. తరువాత దానికి 4 రెట్లు నీటిని కలిపి కవ్వంతో వెన్నపూస వచ్చేంత వరకు చిలకాలి. పైన వెన్నపూస ఏర్పడుతుంటే దానిలో కొద్దిగా వేడి నీరు కలపాలి. మళ్ళీ చిలకాలి. పై భాగమున పూర్తిగా వెన్నపూస పేరుకొన్న తరువాత మజ్జిగ మరియు వెన్నపూస విడవిడిగా కనిపిస్తాయి. అప్పుడు వెన్నపూసను వేరే పాత్రలోనికి తీసి పెట్టుకోవాలి. ఇదే ఆవు మజ్జిగ. ఇది అత్యంత హితకరమైనది.

**సేవించు విధానము**

100–250 మి.లీ. మజ్జిగ మరియు తగినంత సైంధవలవణం, జీలకర్ర చూర్ణం, శొంఠిపొడి ఇష్టానుసారంగా కలుపుకొని తీసుకోవాలి.

ఆవు మజ్జిగ త్రిదోషశామకం, రుచికరం మరియు ఆకలిని కలిగిస్తుంది. ఉదరానికి సంబంధించిన వ్యాధులందు అత్యంత ఉపయోగకరం.

ఈ దిగువ తెలుపబడిన వ్యాధులందు ఆవు మజ్జిగను త్రాగుట వలన చాల ఉపయోగం.

1. అతిసారము (diarrhoea)
2. ఆమాతిసారము (ఆమ్లముతో కూడిన విరేచనములు – జిగట విరేచనములు)
3. పాండు (రక్త క్షీణత – anaemia)
4. కామలా (పచ్చ కామెర్లు – jaundice)
5. ప్రమోహము లేక మధుమేహము (diabetes mellitus)
6. సంగ్రహణి (sprue)
7. విషమజ్వరము (malaria)
8. మేదోవృద్ధి (obesity)
9. గరవిషము (కృత్రిమ విషము)
10. ఉదర రోగములు (యకృత్, ప్లీహ వృద్ధి మొదలైనవి, అరుచి, వమనము, ఉదరములో వాయువు నిండుట, నోట నీరూరుట మొదలైనవి)
11. అర్శస్సులు (piles)

ఆయుర్వేదంలో ఆవు మజ్జిగ అమృతంతో సమానమైనదని చెప్పబడినది. శీతాకాలంలో దీనినుపయోగించటం చాలా శ్రేష్ఠం. మజ్జిగ చేసేప్పుడు తాజా పెరుగునే ఉపయోగించాలి.

భోజనం చేసిన వెంటనే ఒక గ్లాసుడు మజ్జిగ సైంధవలవణం మరియు జీలకర్ర చూర్ణం తగినంత కలుపుకుని సేవించటం వలన జీర్ణక్రియ మెరుగై దానికి సంబంధించిన రోగాలు నివారింపబడతాయి.

**నిషేధము - క్షతము :** వేసవిలో దౌర్బల్యం, మూర్ఛ, భ్రమ (తల త్రిప్పుట), రక్తస్రావము (బ్లీడింగ్ డిసార్డర్స్) లలో ఔషధ సేవనం మంచిది కాదు.

## ఆవు పెరుగు లేక మజ్జిగతో గృహవైద్యము

**1. ముఖ దూషిక (మొటిమలు) :** ఆవు పెరుగు 4 స్పూన్లు మరియు టంకణము (పొంగించిన వెలిగారము లేక వెలిగారము యొక్క చూర్ణము – బోరిక్ పౌడర్ 500 మి.గ్రా. / 0.5 గ్రా.). ఈ రెంటిని కలిపి మొటిమలు మొ॥ వానిపైన (ఆక్ని, పింపిల్స్) పట్టు వేసినచో త్వరగా తగ్గిపోతాయి.

2. జీర్ణ ప్రతిశ్యాయము (దీర్ఘకాల జలుబు) : ఒక కప్పు (100 గ్రా.) పెరుగులో 4 మిరియాల చూర్ణం కలుపుకొని తీసుకోవాలి. ఇలా ప్రతిరోజూ ఒక నెలరోజులు తీసుకుంటే జలుబు నివారింపబడుతుంది.

3. గర్భిణీ స్త్రీలు వెండిగిన్నెలో తోడు వేసిన ఆవు పెరుగును ప్రతిరోజూ తీసుకొనుట వలన ప్రసవం తేలికగా ఔతుంది. గర్భస్రావం, అకాల ప్రసవం మొదలైనవి నివారింపబడతాయి.

4. కేవలం పెరుగును తల వెంట్రుకలకు పట్టించినచో పేలు, ఈపి నివారింపబడతాయి.

5. ప్రతి నిత్యం భోజనం చేసిన వెంటనే గ్లాసు ఆవు మజ్జిగ, జీలకర్ర చూర్ణం, ఉప్పు కలుపుకొని త్రాగితే జీర్ణకోశం ఆరోగ్యంగా ఉండి, ఎటువంటి జీర్ణకోశవ్యాధులు రావు.

6. అర్శస్సులు గలవారు ప్రతినిత్యం మజ్జిగను తీసుకోవటం శ్రేయస్కరం.

7. ఉదరరోగాలలో ఆవు మజ్జిగ తీసుకోవటం అమృతంతో సమానం.

గ్రీష్మ, వర్ష ఋతువులలో, వాత ప్రకోపం కలిగినప్పుడు సైంధవలవణాన్ని కలుపుకొని మజ్జిగ త్రాగాలి. శరత్, హేమంత ఋతువులందు, పిత్త ప్రకోపం కలిగి యున్నప్పుడు పంచదార కలుపుకొని సేవించాలి. వసంతఋతువునందూ, మరియు కఫ ప్రకోపం కలిగియున్నప్పుడూ శొంఠి, పిప్పలి, మిరియాలు మరియు యవక్షారం గలిపినట్టి 1 గ్రాము చూర్ణాన్ని 1 గ్లాసు మజ్జిగలో కలుపుకొని పుచ్చుకోవాలి.

## 3. ఆవు నెయ్యి (గోఘృతము)

ఆవు నెయ్యి బుద్ధి మరియు జ్ఞాపకశక్తిని పెంపొందింపచేస్తుంది. జఠరాగ్ని దీప్తిని కలుగచేస్తుంది. శరీర బలవృద్ధికరం. శుక్రధాతువును వృద్ధి చేస్తుంది. నేత్రాలకు హితం చేస్తుంది. పిల్లలకు మరియు వృద్ధులకు మేలు చేస్తుంది. చర్మకాంతి మెరుగుపడుతుంది.

**ఈ దిగువ తెలుపబడిన వ్యాధులలో ఆవు నెయ్యి హితమైనది :**

**1. జ్వరము (Fever) :** జ్వరము ఎక్కువ కాలం ఉన్నందువలన కలిగిన బలహీనతను పోగొట్టడానికి రెండు టీ స్పూన్లు ఆవు నెయ్యి ఉదయం-సాయంత్రం వేడిపాలల్లో కలుపుకొని కొన్నాళ్ళు పుచ్చుకొనవలెను.

2. విబంధము (మలబద్ధకము - Constipation)

3. నాసా గత రక్త పిత్తము (ముక్కు నుండి రక్తము కారుట)

4. అరోచకము, మందాగ్ని (ఆహారము రుచించకుండుట, ఆకలి లేకుండుట)

5. మూర్ఛ

6. మెడనొప్పి, ఎక్కువ కాలం జలుబు ఉండిపోవుట, నస్య కర్మచేయుటకు

7. నిద్రలేమికి - పాద తలముల పైన గోఘృతాన్ని మర్దన చేయవలెను.

8. కుష్ఠము (చర్మవ్యాధులు)

9. ఉన్మాదము, అపస్మారము (మానసిక వ్యాధులు- dementia, epilepsy)

**ఎక్కువ కాలము నిలువబెట్టిన నెయ్యి (పురాణ)**

ఎక్కువ కాలము నిలువబెట్టిన నెయ్యి త్రిదోషశామకం, మానసిక వ్యాధులు, కర్ణ రోగములు, నేత్ర వ్యాధులు, తలనొప్పి, శ్వాస, జ్వరము, దగ్గు మొదలగు వ్యాధులలో ఉపయోగించబడుతుంది.

మాత్ర - 1 స్పూను (5 మి.లీ.)

అనుపానము - గోరు వెచ్చని మంచి నీరు లేక గోరు వెచ్చని పాలు

**ఆవు నెయ్యితో గృహవైద్యము :**

1. అమవాతం తప్ప మిగతా వాతవ్యాధులన్నింటిలోను ఆవు నెయ్యితో మర్దన చేయటం మంచిది.

2. ఆవు నెయ్యిని నస్యంగా తీసుకోవటం వలన శిరస్సు మొదలైన వానికి సంబంధించిన అనేక వ్యాధులు నివారించటమే గాక ఇంద్రియాల శక్తికూడ వృద్ధి చెందుతుంది.

3. ఆవు నెయ్యిని కరిగించి 2-4 బిందువులు ముక్కుల్లో వేయుటవలన ఖాలిత్యం (వెంట్రుకలు రాలిపోవుట), పాలిత్యం (వెంట్రుకలు తెల్లబడుట), శిరశ్శూల (తలనొప్పి) నివారించబడతాయి. ఈ ప్రక్రియ 45 రోజుల వరకు చేయటంవలన ప్రయోజనం కలుగుతుంది.

4. ఎలర్జీతో కూడిన ప్రతిస్యాయము (జలబు) : ఎలర్జిక్ రైనైటిస్ లో ఆవు నెయ్యిని సేవించుట లాభదాయకము. ఒక టీస్పూను నెయ్యిని తీసుకొని వేడి నీరు అనుపానంగా ప్రతినిత్యం రెండు సార్లు తీసుకోవాలి.

5. అనేక నేత్రవ్యాధులలో ఆవు నెయ్యి తీసుకొనుట సత్ఫలితముల నిచ్చును. నశ్యముగా, ముక్కులలో వేయుట మరియు కళ్ళలో వేయుట వలన కళ్ళ మంటలు తగ్గుటయే గాక నేత్ర శక్తి వృద్ధి చెందును.

6. బలహీనత వలన ఒళ్ళు నొప్పులు, ఒళ్ళు బరువుగా ఉండుట, కండరములు బాధ, శరీర క్రియా హీనత్వం (కూర్చోవడం, లేవడం, నడచుట, మొదలైన వాటిలో బలహీనత అనిపించుట) మొదలైన బాధలందు, శస్త్రచికిత్స చేసిన తరువాత వచ్చు బలహీనతలోను ఆవు నెయ్యితో అభ్యంగం చేయుటవలన మరల బలం కలుగుతుంది.

7. ప్రతినిత్యము ఆవు నెయ్యి ఒక స్పూను వంతున తీసుకొనుట వలన స్మరణ శక్తి మరియు ధారణ శక్తి వృద్ధిపొందును. నిద్ర కూడా చక్కగా పట్టును.

8. అనేక విధములైన పుండ్లు మరియు కాలిన గాయములలో ఆవు నెయ్యితో లేపము చేయుటవలన పుండ్లు, గాయములు త్వరగా మానుటయేగాక వాటియందలి మంట కూడా తగ్గును.

9. హృదయమునకు సంబంధించిన వ్యాధులలో ఇతర నేతులకంటే గూడ భారతీయమైన గోసంతతి యొక్క నెయ్యి ఉపయోగించుట శ్రేయస్కరము. స్వదేశీ గోవు యొక్క నెఇయ్య ఉపయోగించుట వలన రక్తంలో కొలెస్ట్రాల్ పెరగదని పరిశోదన ద్వారా ఋజువైనది.

10. జీర్ణజ్వరములో ఆవు నెయ్యి 2 స్పూనులు (10 మి.లీ.) మరియు ఆవు పాలు ఒక కప్పు కలిపి ప్రతిరోజూ రెండు సార్లు తీసుకొనవలెను.

11. భోజనము చేయునప్పుడు మొదట 1 స్పూను ఆవు నెయ్యి, సైంధవ లవణము, నిమ్మ రసముతో కలిపి తీసుకొనుట వలన ఆకలి పెరుగును మరియు జీర్ణ క్రియ మెరుగవుతుంది.

# 4. ఆవు మూత్రము (గోమూత్రము)

**వ్యాధి నివారణ గుణము :**

ఆయుర్వేదంలో అష్ట మూత్రములు వర్ణింపబడినవి. అవి ఆవు, గేదె, మేక, గొర్రె, ఒంటె, ఏనుగు, గుర్రము, గాడిద.

మిగతా అన్ని జంతువుల మూత్రము కంటే గూడ గోమూత్రము శ్రేష్ఠమైనదిగా చెప్పబడినది. గోమూత్రము జఠరాగ్నిని పెంచుతుంది, పాచనము (అహారమును జీర్ణము చేయునది), కుష్ఠ హరము (చర్మ వ్యాధులను నివారించునట్టిది).

**ఈ దిగువ తెలిపిన వ్యాధులలో గోమూత్రము ఉపయోగము చాలా మంచిది :**

1. మూత్రపిండముల వ్యాధులు (renal failure, etc.)
2. కుష్ఠము (leprosy)
3. శ్విత్రము లేక బొల్లి (leucoderma)
4. దగ్గు (cough)
5. వివిధ చర్మ వ్యాధులు (skin diseases eczema, etc.)
6. అర్శస్సులు (piles)
7. పాండు – రక్త క్షీణత (anemia)
8. కామలా – పచ్చ కామెర్లు (jaundice)
9. ముఖ రోగములు (oral diseases)
10. ఉదర రోగములు (abdominal disorders)
11. శ్వాస – దగ్గు (asthma, chromic bronchitis)

12. కర్ణ శూల (ear ache)

13. మూత్రవహ సంస్థానమునకు చెందిన వ్యాధులలో గోమూత్ర ప్రయోగము చాల మంచిది.

మాత్ర – 10 మి.లీ.

సహపానము – సమభాగము ఉష్ణోదకము (ప్రతిరోజు రెండుసార్లు వైద్యుని సలహా మేరకు తీసుకొనవలెను.)

**గమనిక :** గోమూత్రము ఏ రోజు కా రోజు పట్టవలెను మరియు సేవించుటకు ముందు నాలుగు మడతలు వేసిన పరిశుభ్రమైన వస్త్రముతో వడపోయాలి.

**గోమూత్రముతో తయారు చేయబడు ఔషధములు :**

కామధేను గోమూత్ర ఆర్క్ (యు.ఎస్. పేటంట్ నెం. 6410059. ది. 25–6–2002)

**'కామధేను గోమూత్ర అర్కము'** ఈ దిగువ తెలిపిన వ్యాధులలో ఉపయోగిస్తారు.

1. మూత్రకృచ్ఛము (మూత్రము విసర్జించుటలో కష్టము లేక మూత్రము సాధారణముగా విసర్జింపబడక ఆగి ఆగి వచ్చుట.)

2. అశ్మరి (మూత్రాశ్మరి – అనగా మూత్రవహ సంస్థానములో రాళ్ళు ఏర్పడుట మరియు పిత్తాశ్మరి – అనగా పైత్యపు సంచి (gall bladder) లో రాళ్ళు ఏర్పడుట)

3. మేదోరోగము (obesity – స్థౌల్యము – లావెక్కుట)

4. వృక్క రోగములు (మూత్ర పిండములకు సంబంధించిన వ్యాధులు)

5. చర్మ వ్యాధులు (skin diseases)

6. పాండు (రక్త క్షీణత)

7. జీర్ణ కోశమునకు సంబంధించిన వ్యాధులు (అగ్ని మాంద్యము, అజీర్ణము, మలబద్ధకము మొదలగునవి)

మాత్ర – 5 – 10 మి.లీ. అర్కము మరియు 5 –10 మి.లీ. జలము లేదా 5–10 మి.లీ. తేనె కలుపుకొని తీసుకొనవలెను.

అనుపానము – మంచినీరు లేక వేడినీరు లేదా వైద్యుని సలహా ప్రకారం.

## గోమూత్రముతో గృహవైద్యము

1. అర్శస్సులు (piles)

గోమూత్రము వేడి చేసి అర్శస్సులు అంకూరముల పైన స్వేదము చేయవలెను. (కాప వలెను). లేదా భరించగలిగినంత వేడి చేసిన గోమూత్రంలో అర్శస్సులు ఉండునట్లుగా కూర్చుండవలెను. లేదా గోమూత్రముతో వస్తిని ఇవ్వవలెను.

2. స్థౌల్యము (obesity)

3. కొలెస్ట్రాల్

గోమూత్రాన్ని నియమంగా తీసుకోవటంవలన కొలెస్ట్రాల్ వృద్ధి తగ్గిపోతుంది. హృదయవ్యాధులలో ఇది అత్యంత ఉపయోగకరం.

4. ఉదర క్రిములలో (Intestinal Worms) 10–20 మి.లీ. డికేమాలి (నాడీహింగు) చూర్ణంతో సేవించవలెను.

5. కేవలం గోమూత్రం తీసుకోవటం వలన మలబద్ధకం నివారించబడుతుంది.

6. వివిధ చర్మ వ్యాధులలో గోమూత్రంతో మర్దన చేయటం వలన తప్పక ఉపశమనం కలుగుతుంది.

7. విచర్చిక, పామ, మండల కుష్ఠము మొదలైన చర్మవ్యాధులలో కూడా గోమూత్రాన్ని ఉపయోగించటం వలన మంచి ప్రభావం కలుగుతుంది.

8. గోమూత్రం 20 మి.లీ. మరియు యవక్షారం 4 గ్రా. కలుపుకొని మూడు నెలలు సేవించిన చిరకాలం నుండి ఉన్న జలోదరం తగ్గిపోతుంది.

9. గోమూత్రాన్ని నస్యంగా ఉపయోగించటం వలన గాని (ముక్కులో 2-4 చుక్కలు గోమూత్రం వేయటం) లేక కేవలం గోమూత్రాన్నే ప్రతినిత్యం రెండు సార్లు పానం చేయటంవల్ల జీర్ణించిన జలుబు తగ్గిపోతుంది.

10. దెబ్బ తగులటం వలన కలిగిన వాపులో గోమూత్రాన్ని వేడి చేసి కలపాలి. లేక గోమూత్రంలో గుడ్డను తడిపి వాపుపైన కొంత సేపు ఉంచాలి..

11. పుండ్లను గోమూత్రంతో ప్రక్షాళనం చేయటం మంచిది.

12. తాజా గోమూత్రాన్ని 20 మి.లీ. ప్రతినిత్యం 21 రోజుల వరకు సేవించిన కామలావ్యాధి నివారింపబడుతుంది.

## ఆవు మూత్రంలోని రసాయనిక తత్వాలు - వాటి అద్భుత ఔషధ ఆరోగ్యగుణాలు

1. నైట్రోజన్ - ఇది మూత్రాన్ని సాఫీగా జారీ చేస్తూ రక్తంలోని విషాలను తొలగిస్తుంది.

2. సల్ఫర్ - పెద్దప్రేగులకు బలాన్ని కలిగించి రక్తశోధకంగా పనిచేస్తుంది.

3. అమోనియా - ఇది శరీరధాతువులలో రక్త ప్రసరణను స్థిరంగా ఉంచుతుంది.

4. అమ్మోనియా గ్యాస్ - ఇది ఊపిరితిత్తులలోని చెడు పదార్థాలను తొలగిస్తుంది.

5. కాపర్ - ఇది శరీరంలో అదనంగా అనవసరంగా పెరిగే కొవ్వు (కొలెస్ట్రాల్)ను కరిగిస్తుంది.

6. యూరియా - మూత్రంలోని కీటకాణువులను నశింపచేస్తుంది.

7. ఐరన్ - ఎర్రకణాలను ఉత్పత్తి చేస్తుంది.

8. యూరిక్ ఆసిడ్ - హృదయాన్ని శోధించి మూత్రాన్ని విడుదల చేస్తూ విషాలను విసర్జింపచేస్తూ వాపులను తగ్గిస్తుంది.

9. ఫాస్ఫేట్ - మూత్రవాహినిలోని రాళ్ళను కరిగిస్తుంది.

10. సోడియం - రక్తాన్ని శోధించి ఆమ్లతత్వాన్ని తొలగిస్తుంది.

11. పోటాషియం - ఉదరంలోని అమ్లతత్వాన్ని తొలగిస్తుంది.

12. మాంగనీస్ - హానికరమైన సూక్ష్మజీవులను నశింపచేసి గ్యాంగ్రిన్‌ను రాకుండా చేస్తుంది.

13. కార్బోలిక్ యాసిడ్ - దేహంలో హానికారక క్రిములను నశింపచేస్తూ అవి లోనికి రాకుండా నిరోధిస్తుంది.

14. కాల్షియం - ఎముకలను పోషిస్తూ రక్తశుద్ధి చేస్తుంది.

15. విటమిన్ ఎబిసిడి - శరీరాన్ని ఎల్లప్పుడూ ఉల్లాసంగా ఉంచుతూ ఆందోళనను తగ్గిస్తుంది. దాహం తగ్గుతుంది. వీటివల్ల ఎముకలు పోషింపబడుతాయి. శరీరానికి శక్తీ, బలమూ కలుగుతాయి.

16. ఇతర మినరల్స్ - ఇవి వ్యాధినిరోధకశక్తిని పెంచుతాయి.

17. ఎంజైమ్స్ - జీర్ణక్రియను సవ్యంగా ఉంచి వ్యాధినిరోధకశక్తిని పెంచుతాయి.

18. క్రియేటినైన్ - క్రిమిసంహారాన్ని చేస్తుంది.

19. హార్మోన్స్ - ఎనిమిది నెలలు గర్భవతి అయిన ఆవు మూత్రంలో హార్మోన్స్ అధికంగా ఉంటాయి. ఈ మూత్రం సేవిస్తే శరీరానికి అత్యంత ప్రయోజనం కలుగుతుంది.

20. స్వర్ణక్షారం - ఇది క్రిమికీటక నాశనిగా పనిచేస్తూ శారీరక శక్తిని పెంపొందిస్తుంది.

## ఆవు మూత్రం ద్వారా నివారింపబడు వ్యాధులు

1. ఆకలి మందగించడం
2. అజీర్ణం
3. విరేచనాలు
4. హెర్నియా
5. పుల్ల త్రేన్పులు
6. ఎపెండిసైటిస్
7. వినాళ గ్రంథుల వ్యాధులు
8. ఫిట్స్, మూర్ఛరోగం
9. తల త్రిప్పడం
10. ఆకలి లేకపోవుట
11. వ్రణము
12. మూలశంక
13. ప్రొస్టేట్ గ్రంథి వ్యాధులు
14. ఊయి
15. ఎముకలు విరుగుట
16. మద్యం అలవాటు
17. పొంగు
18. నోటిలోని వ్యాధులు
19. అపస్మారకము
20. మూత్రంలో మంట

21. మూత్రనాళంలో కురుపులు
22. స్థూలకాయము
23. రక్తపోటు
24. రక్త స్రావము
25. రక్తదోషము
26. బుద్ధిమాంద్యము
27. మలబద్ధకము
28. కీళ్ళవాతము
29. ప్రేగులలో కురుపులు
30. కడుపులో వికారము
31. వడదెబ్బ
32. పుట్టకురుపు
33. బంక విరేచనము
34. రక్తహీనత
35. గోకుడు
36. పైత్యప్రకోపము
37. ప్లీహవృద్ధి
38. మలబద్ధకము
39. ఎక్కువసార్లు మూత్రము
40. భగందరము
41. పంటి వ్యాధులు
42. కొంకి పురుగు
43. లింగ దోషము
44. నిద్రలేమి
45. ముక్కు వ్యాధులు
46. కంటి వ్యాధులు
47. తెల్లని వెంట్రుకలు
48. జలుబు
49. వాంతులు
50. వాత రోగము
51. సుఖ వ్యాధి
52. Plurisy
53. కంఠమాల
54. కుష్ఠ
55. చెవి వ్యాధులు
56. నులి పురుగులు
57. కామెర్లు
58. దగ్గు
59. కడుపునొప్పి
60. గుండె వ్యాధులు
61. వాంతి చేయుట
62. విరేచనము చేయించడం
63. శిశువాథ్యులు
64. టైఫాయిడ్

65. గనేరియా
66. నరాల బలహీనత
67. స్త్రీల వ్యాధులు
68. నారిపుండు
69. కీళ్ళ వాతం
70. చీముగడ్డ
71. విషదోషము
72. కలరా
73. జ్వరము
74. మూత్రపిండ వ్యాధులు
75. అతిసారము
76. దప్పిక
77. చర్మ వ్యాధులు
78. గాయాలు
79. తలనొప్పి
80. వాపు
81. బోదెకాలు
82. దమ్ము
83. స్తన్య వ్యాధులు
84. ఎక్కిళ్ళు మొదలైనవి

## 5. ఆవు పేడ (గోమయము)

**వ్యాధినివారణ గుణము**

**ఈ దిగువ తెలిపిన వ్యాధులలో గోమయసేవనము హితకరము :**

1. శ్వాస (asthma)
2. దగ్గు (cough)
3. ఎక్కిళ్ళు (hiccup)
4. నేత్ర రోగములు (eye diseases)
5. వాత రోగములు
6. ముఖ రోగములు

మాత్ర - అనుపానము - 4-6 గ్రాములు గోరువెచ్చని నీళ్ళతో అనేక చర్మవ్యాధులలో గోమయలేపముయొక్క అభ్యంగం ఎంతో హితకారకము.

## గోమయముతో గృహవైద్యము

శాస్త్ర ప్రకారముగా తయారుచేయబడిన ఔషధములే కాక గోమయాన్ని గృహవైద్యంలోకూడా అనేక విధాలుగా ఉపయోగిస్తారు.

1. వాతావరణాన్ని శుద్ధి చేయటానికి మరియు ధూపం వేయటానికి ముఖ్యంగా గోయమం ఉపయోగింపబడుతుంది. అనాదినుండి ఇళ్ళు అలుకటానికి గోమయాన్ని ఉపయోగించటం ఆచారంగా వస్తున్నది. గోమయము సూర్యకిరణములను (Ultraviolet rays) తనలోనికి గ్రహించును. అందువలన ఇల్లు, ఇంటి పరిసరాలలో గోమయంతో అలకటం వలన వాతావరణం శుద్ధి కావటమేగాక సూర్యరశ్మియొక్క తీవ్రతనుండి మనకు రక్షణ లభిస్తుంది.

2. నాసాగత రక్త పిత్తంలో (epistaxis) కేవలం గోమయాన్ని వాసన చూడటం వలననే ఉపశమనం కలుగుతుంది.

3. శ్వాస వ్యాధిలో గోమయ స్వరసాన్ని ముక్కులలో రెండేసి చుక్కలు వేసినచో వెంటనే ఉపశమనం కలుగుతుంది.

4. గోమయంలో విటమిన్ బి12 చాలా ఎక్కువగా ఉంటుంది. అందువలన విటమిన్ బి12 శరీరంలో తగ్గిపోయినప్పుడు గోమయ స్వరసాన్ని తీసుకోవటం వలన త్వరగా ఫలితం కనిపిస్తుంది.

5. వివిధములైన దంత వ్యాధులందు మరియు ఆరోగ్యంగా ఉన్నప్పుడు కూడా గోమయ భస్మాన్ని (బూడిద) పళ్ళు తోముకోవడానికి ఉపయోగించటం వలన ఎంతో ప్రయోజనం కలుగుతుంది.

6. గోమయం సహజమైనదేకాక, తేలికగా లభించేది మరియు క్రిములను నివారించే పదార్థం.

7. నీళ్ళ విరేచనాలలో స్వరసం సేవించటంచే త్వరగా తగ్గుతుంది.

# గో ఉత్పత్తుల ఆయుర్వేద, ఆర్థిక ప్రాముఖ్యత

## గోవు విశిష్టత

ప్రాణులలోకెల్ల సర్వోత్కృష్టమైనది భారతీయ గోసంతతి. ఏ పశువు మాంసంలోనైనా కొంతమేరకు పాషాణం (ఆర్సెనిక్) ఉంటుందని ఆధునిక విజ్ఞాన శాస్త్రం చెబుతుంది. ఆవు మాంసంలోనూ అది ఉంటుంది. ఆవు కాకుండా మరే పశువు పాలలోనైనా ఈ పాషాణం ఉంటుంది. అయితే ఆవు పాలలో మాత్రం అది ఎంత మాత్రమూ ఉండదు. కనుకనే ఆవుపాలు సర్వోత్కృష్టంగా పరిగణింపబడ్డాయి. అందువల్ల భారతీయ గోవుయొక్క వైశిష్ట్యంలో సందేహం లేదు. ఆవుపాలు పసుపు పచ్చగాను, గేదెపాలు తెల్లగాను ఉంటాయి. అందువ్ల వీటిని బంగారము, వెండి అంటారు. ఆవుపాలు దాని మూపురం గుండా స్రవించి లభిస్తాయి. ఆవు మూపురంలో స్వర్ణ నాడి ఉంది. కనుక ఆవు పాలలో స్వభావసిద్ధంగానే బంగారపు తత్వం ఇమిడి ఉంది. ఈ తత్వం మానవులకు గొప్పమేలు కూర్చే అంశం. పశువుల మంచిచెడ్డలు అవి ఇచ్చే పాలను బట్టి నిర్ణయించుకోవచ్చు.

పశువుల మంచి చెడ్డలను వాటి సంతానాలలో ఉండే భేదాన్ని బట్టికూడా చెప్పవచ్చు. ఆవు దూడ పుట్టిన మూడు రోజులకే గంతులేస్తుంది. అదే గేదె దూడ 30 రోజుల వరకు మత్తుగా పడి ఉంటుంది. ఈ కారణంగానే ఆవు పాలవల్ల శరీరంలో స్ఫూర్తి కలుగుతుంది. గేదె పాల వల్ల అలసత్వం వస్తుంది. 500 పశువుల మధ్యలో విడిచి పెట్టబడిన ఆవు దూడ తన తల్లి వద్దకు అవలీలగా చేరుకుంటుంది. అదే గేదె దూడ 10, 15 గేదెల మధ్యలో నైనా తన తల్లిని గుర్తించలేదు. ఆవుపాలు బుద్ధిబలం పెంచుతాయని ఇది ఋజువు చేస్తుంది. ఆవులకు గాని, ఆవుదూడలకు గాని ఏదైనా పేరు పెట్టి పిలిస్తే వెంటనే అవి ప్రతిస్పందించి పిలుస్తున్నవారి వద్దకు వస్తాయి. గేదెలకు,

వాటి దూడలకు ఈ జ్ఞానం శూన్యం. ఆవులు ఎక్కడ విడిచి పెట్టినా సమయానికి మళ్లీ అవి తమ స్వస్థలానికి చేరుకొంటాయి. గేదెలకు స్థలం, సమయం, గుంపు అన్న గుర్తింపులే ఉండవు.

**ఆవుపాలు**

భారతీయ గోవు తీవ్రమైన ఎండను కూడా సహిస్తుంది. అందుకే దాని పాలు రోగరహితము, ఆరోగ్యప్రదము, పౌష్టికమైనవిగా ఉంటాయి. కాని గేదెలు లేదా విదేశీ జాతి జెర్సీ లేదా ఇతర సంకరజాతి ఆవులు ఎండవేడిమిని సహించలేవు. ఆవుపాలు గుండె జబ్బు రోగులకు ప్రత్యేకించి ఉపయోగించబడతాయి. గేదె పాలలోని క్రొవ్వు పదార్థం నాడులలో చేరి క్రమంగా హృద్రోగానికి అవి కారణమవుతాయి. ఆవుపాలలోని పసుపుపచ్చని పదార్థం కళ్ళలోని జ్యోతిని వృద్ధి పరుస్తుంది. కళ్ళకు వస్త్రే పాలలో తడిసిన గుడ్డ పట్టీ కడితే నయమవుతుంది. అభివృద్ధి చెందిన దేశాలన్నింటిలోను ఆవులు పెంచబడతాయి. గేదెలు కాదు. గేదెలు ఆ దేశాల్లో జంతు ప్రదర్శన శాలలోనే కన్పిస్తాయి. చరక సంహిత ప్రకారం జీవన శక్తిని అందించే ద్రవ్యాలలో ఆవుపాలు అన్నిటికంటే శ్రేష్ఠమైనవని తెలుస్తుంది. ధన్వంతరి నిఘంటువు ప్రకారం ఆవుపాలలో రసాయనము, పథ్యము, బలవర్ధకము, హృదయానికి హితం చేకూర్చేది. మేధను పెంచేది, ఆయుర్వృద్ధి, పుంసత్వం కలిగించేవి. ఇంకా వాత - పిత్త - కఫాలను రూపుమాపే గుణాలున్నాయి. తెల్ల ఆవుపాలు వాతాన్ని, నల్ల (కపిల) ఆవుపాలు పిత్తాన్ని, ఎరుపురంగు ఆవుపాలు కఫాన్ని హరించి వేస్తాయి. కపిలగోవు ఈ దృష్టిలో ఎంతో ఉపయోగకరమైంది. ఆవుపాలు సర్వరోగనివారిణి మాత్రమే కాదు, అవి వృద్ధాప్యాన్ని కూడా దూరంగా ఉంచుతాయి. నాడెప్ కాకా గారు 80 సంవత్సరాల వయస్సులోను కళ్ళద్దాలు వాడి ఎరగరు. కారణమేమంటే

"బాల్యం నుండీ నేను భారతీయ గోవుపాలు త్రాగుతూ వస్తున్నాను" అనేవారు ఎంతో గర్వంగా.

డా॥ ఎన్.ఎన్.గోడ్‌బోలే గారి ప్రకారం ఆవుపాలలో పౌష్టిక పదార్థాలు - 87.3% నీరు, కార్బోహైడ్రేట్స్, క్రొవ్వుపదార్థము, ప్రొటీన్లు ప్రతీదీ 4% కాగా ఖనిజ ద్రవ్యము 0.7% ఉంటాయి. కనుక ఈ పాలు పసిపిల్లలకు, తల్లులకు, పెద్దలందరికీ పూర్ణ ఆహారంగా భావించవచ్చు. అంతేగాక ఆవుపాలలో ఎ,బి,సి,డి,ఇ విటమిన్లు అన్నీ సరియైన పాళ్లలో ఉండడం వల్ల ఇవి శరీరానికి శక్తినిస్తాయి. ఆవుపాలు సులభంగా జీర్ణమయ్యేవి మరియు పోషక శక్తి కలిగినవి. అంతేగాక శీతలత్వం కారణంగా అవి పిత్త వికారాలను హరించివేస్తాయి. ఆవుపాల కోవాలో విటమిన్-ఎ 400 ఐ.యు.లు (అంతర్జాతీయ యూనిట్లు) ఉండగా గేదె పాల కోవాలో ఎలాంటి విటమిను ఉండదు. ఫేడా మొదలైన పదార్థాలు ఆవుపాల నుండి చేసినవే శ్రేష్ఠమైనవి. రష్యను శాస్త్రజ్ఞుల ప్రకారం ఆవుపాలలో అణువికిరణాన్ని ఎదుర్కొనే శక్తి ఉంది. జలోదర రోగంతో బాధపడేవ్యక్తి నీళ్ళు త్రాగకూడదు. కేవలం ఆవుపాలు త్రాగడం వల్ల గోమూత్రం ఔషధంగా సేవించటంవల్ల అతని రోగం నయమవుతుంది. ఆవుపాలలోని పసుపు పచ్చదనం సర్వరోగ నివారకమే గాక విషాన్ని హరించే శక్తి కూడా దానికి ఉంది. ఈ గుణం కేవలం తల్లిపాలలో మాత్రమే ఉంటుంది. కనుకనే ఆవును తల్లి సమానంగా భావిస్తాం.

## ఆవుపాలలో ఔషధగుణాలు

1. సుమారు 400 గ్రాముల ఆవుపాలను మరిగించుతూ జిల్లేడుకొమ్మ యొక్క బొటన వ్రేలు మందము పచ్చి కాడతో కలుపుతూ ఉంటే పాలు విరిగి పోతాయి. ఆ నీరంతా ఆవిరైపోయి మిగిలిన పదార్థము

కోవాలా అయేంతవరకు మరగనివ్వండి. ఆ కోవాలో తగినంత చక్కెర కలిపి చల్లార్చిన తర్వాత మలేరియా రోగికి జర్వము తగ్గిన పిదప దానిని తినిపిస్తే అతనికి మలేరియావ్యాధి మరెప్పుడు దరికిరాదు.

2. ఆవుపాలవల్ల శరీరంలో క్రొవ్వు పెరగదు. కాగా హృద్రోగులకు వాటి వల్ల ఎంతో మేలు జరుగుతుంది. కార్నేల్ విశ్వవిద్యాలయం యొక్క పశువైజ్ఞానికులు ప్రొఫెసర్ రోనాల్డ్ గోరైటీ ప్రకారం ఆవుపాలలో ఉండే ప్రోటీన్ల వల్ల మనుష్యశరీరంలో అది క్యాన్సర్ రాకుండా నిరోధిస్తుంది.

3. ఆవుపాలలో అదే గోవుయొక్క నెయ్యి కూడా కలిపి త్రాగడం వల్ల మరియు ఆవు నెయ్యితో తయారైన వేడి వేడి హల్వా తినడం వల్ల క్యాన్సర్ దూరమవుతుంది.

4. తీవ్రమైన అజీర్ణరోగం (సంగ్రహణి) ఉంటే 21 కిస్‌మిస్ పళ్ళను ఆవుపాలలో నానబెట్టి ఆ తర్వాత వాటిని తినడం, పాలలో తేనె కలిపి సేవించడం వల్ల క్రమంగా ఆ వ్యాధి నయమైపోతుంది.

5. కిస్‌మిస్ మరియు ఎండు ద్రాక్షలు ఐదేసి పండ్లు ఆవుపాలలో నానవేసి వాటిని తినడం, పాలను త్రాగడం వలన మలేరియా తగ్గిపోతుంది. మలేరియా మరింత దీర్ఘమైనదైతే వాటిలో 10 గ్రాముల శొంఠి చూర్ణము కూడా కలిపి త్రాగడం ఉత్తమం.

6. గర్భవతియైన మహిళ గర్భం పూర్తిగా పెరిగి ఉండని స్థితిలో ఆమె చేత ఆవుకు బెల్లము, రొట్టె తినిపించడము, ఆవుకు ప్రతిరోజు ప్రదక్షిణలు జరిపించడం వల్ల ఆమెకు సుఖ ప్రసవం సాధ్యమవుతుంది. ఆవుకు భక్తి శ్రద్ధలతో ప్రదక్షిణలు చేయడం ఆవుపాలలో ప్రత్తి చెట్టుయొక్క లేతవేరు నొకదానిని చక్కగా మరిగించి ఆ పాలు త్రాగడం

వల్ల ఆ మహిళకు గర్భావస్థ సంప్రాప్తిస్తుంది. శక్తివంతులు, మేధావులు, ఆరోగ్యవంతులు అయిన సంతానం కోసం మహిళలు తమ చేతితో ఆవుకు రోజూ రొట్టె, బెల్లం పెట్టడం, ఉదయం సాయంత్రం ఆవుపాలు త్రాగడం నియమ పూర్వకంగా చేయాలి. ఇందువల్ల ప్రసవవేదన కూడా చాలావరకు తగ్గుతుంది.

**ఆవునెయ్యి - వెన్న**

గేదె నెయ్యి జీర్ణకారి కాదు. దాని పాలు వేడి చేయడంతో దానిలో ఉంటే విటమినులు అది కోల్పోతుంది. ఆవు నెయ్యి అలాకాక జీర్ణకారి, విటమినులతో కూడినది మరియు శక్తిని ప్రసాదించేది కూడా.

1. న్యూఢిల్లీలోని అఖిల భారతీయ ఆయుర్విజ్ఞాన సంస్థాన్ వారి డాక్టర్ల ప్రకారం కేవలం ఆవు నెయ్యిలోనే హృద్రోగికి మేలు చేసే గుణాలున్నాయి. భావ ప్రకాశ నిఘంటువు ప్రకారం ఆవు నెయ్యి కళ్ళకు హితము కూర్చేది. జఠరాగ్నిని వృద్ధిపరిచేది, వాత - పిత్త - కఫ నాశకము, బలవర్ధకము, ఆయుర్వృద్ధికరము, రసాయనము, సుగంధ యుక్తము, మధురము, శీతలము, సుందరము మరియు ఘృతములలో కెల్ల ఉత్తమఘృతము.

2. అలాగే గోనవనీతము అంటే ఆవు వెన్న కూడా ఎంతో మేలు చేసే బలవర్ధకము, అగ్ని ప్రదీపకము, ఉత్తమ శరీర ఛ్ఛాయ కలుగచేసే పదార్థము. వాతపిత్త రక్త వికారాలను, క్షయ, అరిశమొలలు, పక్షవాతము, దగ్గు మొదలగు వ్యాధులను నిర్మూలించగల ఔషధము. బాలురు, వృద్ధులకు ప్రత్యేకించి ఎంతో ఉపయోగకరమైనది, అమృత సమానమైనది ఆవు వెన్న.

**ఆవు నెయ్యి కాల్చడం వల్ల విడుదలయ్యే 4 రకాల వాయువులను గుర్తించడం జరిగింది.**

1. 'ఎసిటిలీన్' వాయువు. ఇది అశుద్ధ వాయువును శుద్ధీకరించి పర్యావరణ కాలుష్యాన్ని అరికట్టుతుంది. ఆవు నెయ్యితో ఆహుతులు ఇస్తూ జరిపే యజ్ఞయాగాదుల వల్ల పరిసరాల వాయుమండలం స్వచ్ఛమవడమేగాక శీఘ్రవర్షాగమనానికి కూడా ఆ వాయువు దోహదం చేస్తుంది. ఈ వాయువువల్ల ఓజోన్‌లో ఏర్పడిన రంధ్రాలు కూడా కొంతవరకు కప్పబడతాయి.

2. రష్యనుల పరిశోధన ప్రకారం ఆవు నెయ్యితో ఆహుతులివ్వగా వెలువడే పొగలు ఎంత దూరం వ్యాపిస్తే అంతమేరకు ఎలాంటి క్రిమికీటకాలు, బ్యాక్టీరియా ఉండజాలవు.

3. ఆవు నెయ్యిని బియ్యంతో కలిపి మాడ్చినట్లైతే వెలువడే 'ఇథిలీన్ ఆక్సైడ్' వాయువు జీవాణువులను నిరోధిస్తుంది. ఈ వాయువు ఆపరేషన్ గదులలో ఉపయోగపడుతుంది. అంతేగాక ప్రాణ రక్షక ఔషధాల తయారీలోనూ ఈ వాయువు ఉపయోగిస్తారు.

4. ఆవు నెయ్యితో చేసిన హవనము నుండి 'ప్రొపలీన్ ఆక్సైడ్' వాయువు కూడా వస్తుంది. ఈ వాయువు కృత్రిమ వర్షాన్ని కురిపించ గలుగుతుంది.

5. ఆవు నెయ్యి హవనాల కారణంగా కార్బన్‌డయాక్సైడ్ యొక్క ప్రమాదాల నుండి రక్షణ పొందవచ్చు. త్రిదోషాల నుండి విముక్తి పొందేందుకై వాత – పిత్త – కఫాలను సరియైన పాళ్ళలో సంతులనంలో ఉంచవలసి ఉంటుంది.

6. ఆవు నెయ్యిని పగలు 3 సార్లు ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం - రాత్రి పడుకొనే ముందు కాస్త ముక్కులో వేసుకుంటే త్రిదోషాలు దగ్గరకు రావు. పూర్తి ఆరోగ్యం లభిస్తుంది.

## ఆవు పెరుగు - మజ్జిగ

1. భావప్రకాశ నిఘంటువును బట్టి ఆవుపాలను తోడు వేయగా తయారైన పెరుగు ప్రత్యేకించి తీయదనంతోను, రుచికరంగాను, అగ్నిని పుట్టించేదిగాను, గుండెకు ఉపయోగకరంగాను ఉంటుంది. పుష్టికరము, వాతహరము మరియు కడుపులోని అన్ని భాగాలకు ఇది ఎంతో లాభదాయకమైనది. సర్వోత్తమమైనది.

2. అదే నిఘంటువు ననుసరించి మజ్జిగ త్రాగేవ్యక్తి ఎప్పుడూ రోగగ్రస్తుడు కాడు. మజ్జిగ త్రాగడం వల్ల తగ్గిపోయిన రోగాలు మళ్ళీ రానేరావు. మజ్జిగ దేవతలకు, మనుష్యులకు కూడా అమృతంతో సమానమైనది. 'తక్రం శక్రస్య దుర్లభమ్'- అంటే దేవతలకు రాజైన ఇంద్రునికి కూడా తక్రం లభించదని అర్థం. మజ్జిగ లేదా చల్ల 5 రకాలుగా ఉంటుంది.

1. పెరుగులో నీళ్ళు కలపకుండా మీగడతో యుక్తంగా చిలికిన దానిని **'ఘోలము'** అంటారు.

2. పెరుగుపై మీగడ తీసివేసి నీళ్ళు పోయకుండా చిలికిన దానిని **'మథితము'** అంటారు.

3. నాలుగవ భాగం నీళ్ళు కలిపి చిలికిన దానిని **'తక్రం'** లేదా **'మత్తా'** అంటారు.

4. సగభాగం నీళ్ళు కలిపి చిలికితే దానిని 'ఉదశ్విత్' అంటారు.

5. పెరుగు చిలికి వెన్న తీసివేసి ఎక్కువ నీళ్ళు పోసి కలిపిన దానిని **'చాఛ్' 'ఛఛికా' - చల్ల లేదా మజ్జిగ** అంటారు.

1. గోవుపాలతో తయారైన మజ్జిగ పౌష్టిక పానీయం. ఇది అందరికీ మేలు చేకూర్చుతుంది. గ్రామాలలో ప్రాచీనకాలం నుండి మజ్జిగ ప్రజల ఉపయోగంలో ఉంది. మంచి మజ్జిగ ఆవుపాలతోనే తయారవుతుంది. ఇందులో ఉండే 'ల్యాక్టిక్' అనబడే జీవాణువులు శరీరంలో రోగనిరోధక శక్తిని పెంచుతాయి. అందువల్ల ఆరోగ్యము, దీర్ఘాయువు సిద్ధిస్తుంది.

2. ఇందులో చక్కెర వేసి త్రాగితే అది జీర్ణకారిగా పనిచేస్తుంది. నియమంగా ఇది తీసుకున్నట్లయితే కళ్ళల్లో చూపు, పళ్ళలో గట్టితనము తగ్గకుండా ఉంటాయి. పసరికలు, ఆకలి లేకపోవడం, వాంతులు, వాతం, అరిశమొలలు, రక్తపోటు, సంగ్రహణి, వాయువు, అతిసారము, ప్రమేహము, రక్తసంచారము, తెల్లమచ్చలు, ఉదర బాధలు, తిల్లీ, ప్లీహ, లావెక్కటము, మూత్రరోగం, దప్పిక, అరుచి, మొదలయిన రోగాలలో ఇది గుణకారి.

3. అధిక వేడిమి, శారీరిక నిస్సత్తువలు పోగొట్టడానికి మరియు ముఖంలో కళ రావడానికి ఆవు యొక్క తాజా మజ్జిగలో గుడ్డను నాన్చి మృదువుగా శరీరంపైన రుద్దటంవలన ప్రయోజనం ఉంటుంది. తలనొప్పి తగ్గాలంటే జాజికాయ చూర్ణం ఓ చిటికెడు మజ్జిగలో కలిపి తీసుకోవాలి.

4. అరిశెమొలల (మూల) వ్యాధికి అరస్పూను త్రిఫల లేదా ఉసిరికాయ చూర్ణం మరియు రెండు చిటికెల చిన్న పిప్పళ్ళ చూర్ణం మజ్జిగలో కలిపి తీసుకుంటే అది ఆ వ్యాధికి బ్రహ్మాండమైన విరుగుడు. విరేచనాలకు రేగి ఆకుల చూర్ణంతోను, రక్తవిరేచనాలకు అరస్పూను మామిడి టెంకల చూర్ణంతోను మజ్జిగలో కలిపి తీసుకోవాలి.

5. కడుపులో మెలిపెట్టినట్లు ఉండే నొప్పికి మెంతులతో కలిపి మజ్జిగను తీసుకోవడం ఉత్తమం. విరేచనాలలో తేనెతోపాటు మరియు

సంగ్రహణికి శొంఠి చూర్ణంతోపాటు తాజా మజ్జిగ మధ్య తగినన్ని సార్లు తీసుకోవడం ఆరోగ్యదాయకం.

6. దమ్మురోగికి మిరియాలు, జీలకర్ర మరియు ఉప్పు కలిపిన మజ్జిగ బాగా పనిచేస్తుంది.

7. ఆకలి పెంచడం కోసం కరక్కాయ, శొంఠి మరియు నల్ల జీలకర్ర చూర్ణం మరియు మారేడుకాయ చూర్ణం మజ్జిగలో కలిపి తీసుకోవాలి.

8. కఫం మరియు దగ్గు ఉన్నట్లయితే వాము మరియు నల్ల ఉప్పు లేదా అల్లపురసం కలిపిన మజ్జిగను గోరువెచ్చగా చేసి తీసుకోవాలి.

9. మజ్జిగ చేసి రాత్రంతా ఉంచి ఉదయం దానితో తలవెంట్రుకలు కడిగితే వెంట్రుకలకు మరియు మెదడుకు అది టానిక్‌లా పనిచేస్తుంది.

10. ప్రతిరోజు మూడుసార్లు మజ్జిగ త్రాగితే శరీరం లావెక్కటం తగ్గిపోతుంది. మత్తు పదార్థాల ప్రభావాన్ని తగ్గించడానికి కూడా మజ్జిగ త్రాగటం అలవాటు చేసుకోవాలి.

11. ఆవుపాల మజ్జిగ ఉత్తమమయినది. చలికాలంలో అయితే ఇది అమృతతుల్యం. ఆకలి లేమి, వాతరోగం, అరుచి, రక్తనాళాలలో అవరోధాలకు మజ్జిగ ఎంతో లాభకారి.

12. మజ్జిగ విషదోషం, వాంతులు, నోట నీరూరటం, మలేరియా, రక్తక్షీణత, క్రొవ్వు పెరుగుట, మూత్రం బాధతో కూడి వచ్చుట, భగందరం (సైనస్ అండ్ ఫిస్టులా ఇన్ యానో), ప్లీహం, ప్రమేహం, గుల్మం, కడుపులో నొప్పి, బొల్లి, వాపు, దప్పిక మరియు క్రిములను నివారిస్తుంది.

13. మజ్జిగ శీతలము, తేలికగా జీర్ణం అయ్యేది మరియు పిత్త – వాత – కఫాలను, దప్పికను నివారిస్తుంది.

మజ్జిగ కోసం మట్టిపాత్ర,పింగాణి పాత్ర, గాజు పాత్ర లేదా రాచిప్పలను ఉపయోగించ వచ్చును. మజ్జిగ త్రాగటం వల్ల తల తిరిగినట్లు అనిపించినా మూత్రం, భేదులు ఎక్కువయినట్లు అనిపించినా కొద్దిరోజులు త్రాగటం ఆపివేయాలి. జర్వం, వేడి, దుర్బలత్వం లేదా క్షయరోగం ఉన్నట్లయితే వైద్యుని సలహాతోనే మజ్జిగ ఇవ్వాలి. మజ్జిగతోపాటు నెయ్యి తీసుకోవడం మంచిది కాదు.

**మిఠాయిలు**

భారతదేశంలో ఆవునెయ్యితో తయారయ్యే తీపిపదార్థాలు లెక్కకు మిక్కిలి ఉన్నవి. ఆవుపాల కోవాతో ప్రతిప్రాంతంలోను రకరకాల మిఠాయిలు తయారువుతాయి. పాలు విరగగొట్టగా ఏర్పడిన జున్నుతో రకరకాల మిఠాయిలు తయారుచేస్తారు.

పెరుగుతో కూడా శ్రీఖండ వంటివి తయారవుతాయి. ప్రపంచంలో మిఠాయిలలో భారత్‌ను మించిన దేశం లేదు. అందుకే మిఠాయిలు కూడా భారతదేశం యొక్క వివిధత్వాన్ని చాటి చెప్పుతాయి.

పంజాబ్‌లో జరిగిన పరిశోధనవల్ల రైతుకు ధాన్యం ఉత్పత్తి కంటేను పాల ఉత్పత్తి మరింత ప్రయోజన కారిగా రుజువయ్యింది. 1989వ సంవత్సరంలో డైరీ ఉత్పత్తుల వల్ల హెక్టారుకు రు.4548/- ఆదాయం వచ్చింది. గేదెజాతులను పెంచటం కంటే గోవు జాతులను పెంచటమే ఎంతో లాభదాయకమని కూడా రుజువయ్యింది. ఆ సంవత్సరం గేదెల డైరీ వల్ల రూ.100/- ఖర్చుకు రూ.14/- లాభం రాగా గోవుల డైరీ వల్ల రూ. 117/- లాభం వచ్చింది. శ్వేత క్రాంతిని తీసుకురావాలంటే గోసంతతిని పెంచటం, వాటి ఉత్పాదక శక్తిని కూడా పెంచటం అనేది ఆర్థిక దృష్టితో ఎంతో సముచితమైన చర్య కాగలదు.

1991వ సంవత్సరంలో ఆనాటి కేంద్ర ఆహారమంత్రి శ్రీ బలరామ్ జక్కర్ గారి ప్రకారం దేశంలో 64,300 ప్రభుత్వ పాల కేంద్రాలుండగా వాటి ద్వారా 79 లక్షల రైతు కుటుంబాలు లాభాన్వితమయ్యాయి. దీనిని 8 రెట్లు పెంచగలిగితే (అది అసాధ్యమేమీ కాదు కూడా) దేశంలోని రైతు కుటుంబాలన్నింటినీ దీని వల్ల లాభపడేటట్లు చూడవచ్చు. నేడు దేశంలో జరుగుతున్న మొత్తం పాల ఉత్పత్తిలో 44% గోవుల ద్వారానే జరుగుతున్నది. గోవు జాతులను, వాటి స్థితిగతులను మరింత మెరుగు పరచి భారతదేశాన్ని ప్రపంచంలోనే మేటి పాల ఉత్పత్తి దేశంగా రూపొందించవచ్చు. ఈ రోజున అమెరికా మొదటి స్థానంలోను, భారత్ రెండవస్థానంలోను ఉన్నాయి.

దేశంలో 2003 నాటికి కేవలం 18.52 కోట్ల గోవులు మాత్రమే మిగిలి ఉన్నాయి. 1992 –2003 సంవత్సరాలకు గోవుల సంఖ్య 2 కోట్ల తగ్గుదలలో ఉంది. ఆరోగ్య శాస్త్రవేత్తల ప్రకారం ప్రతివ్యక్తికి ప్రతిదినం కనీసం సరాసరి 13 ఔన్సుల పాలు లభించాలి. కాని ఈ రోజున కేవలం సరాసరి 1 ఔన్సు మాత్రమే లభిస్తున్నది. అమెరికా, డెన్మార్క్, స్విట్జర్లాండ్ మొదలైన దేశాలలో ప్రతిరోజు ప్రతివ్యక్తి కనీసం 50 ఔన్సుల పాలు తీసుకుంటాడు. కాబట్టి మనదేశంలో మరెంతో అభివృద్ధిని సాధించవలసి ఉంది అన్నది నిర్వివాదము.

## గోవుపేడ, గోమూత్రము : అర్థశాస్త్రము

పుట్టీపుట్టగానే ఆవుదూడలు పాలూ ఇవ్వవు, నాగలీ దున్నవు అన్నది నిజమే అయినప్పటికీ కేవలం 3 సంవత్సరాల వయసు వచ్చేసరికి ఆవుదూడ గర్భము దాల్చగలుగుతుంది. కోడెదూడ నాగలి దున్నడానికి, బరువులు మోయడానికి ప్రారంభిస్తుంది. కొంతకాలం తర్వాత ఆవులు గర్భం దాల్చడం మానివేస్తాయి. అలాగే ఎద్దులు ఎక్కువ కష్టమైన పనులు చేయడానికి

పనికిరావు. కాని దూడలు చిన్నప్పటినుంచే ఆవులు, ఎద్దులు ముసలివైనప్పటికీ పేడను, మూత్రాన్ని మాత్రం ఇస్తూనే ఉంటాయి. వెనక అధ్యాయంలో వర్ణించిన గోవుయొక్క వివిధ ఆహార, ఔషధప్రయోజనాలు కొద్దిసేపు ప్రక్కన పెట్టినప్పటికీ గోసంతతి బ్రతికి ఉన్నంతకాలం గోమయము, గోమూత్రాలను అవి అందిస్తుంటాయి. నిజానికి భారతదేశపు ముఖ్యవృత్తి అయిన వ్యవసాయానికి ఇవే ప్రాణసమానమైనవి.

అతి ప్రాచీనకాలం నుండి భారతదేశంలో వ్యవసాయం ఒక వృత్తిగా వాడుకలో ఉంది. రాబోయే యుగాలలోను అదే ప్రధాన వృత్తిగా ఉండిపోతుంది అనడంలో ఎంతమాత్రం సందేహం లేదు. భారత్‌లోని భూమియొక్క ఉత్పాదకత ఇక్కడినీరు, గాలి. ఇవే కాకుండా గోమయము, గోమూత్రాలపై కూడా ఆధారపడి ఉంది. వేలాది సంవత్సరాలనుండి గోమయ, గోమూత్ర ఎరువుల ద్వారా ఈ భూమి ఉత్పాదక శక్తిని మనం కాపాడుతూ వస్తున్నాం. నేటి కాలపు రాసాయనిక ఎరువులు మనం వాడకం ప్రారంభించేకన్న ముందు మన పంటల్లో ఇంతగా పంటలకు హాని కలిగించే క్రిమికీటకాలు ఉండేవే కావు. ఈ క్రిమికీటకాల బెడదనుండి పంటలు కాపాడుకోవడానికి ప్రతిసంవత్సరము మనం కోట్లాది రూపాయలు ఖర్చు పెట్టాల్సి వస్తున్నది. రసాయన ఎరువులు, కీటకనాశక మందులు కొనడానికి పెద్ద మొత్తంలో మనం మన విదేశీ ద్రవ్య నిధులను విదేశాలకు వదులుకోవాల్సి వస్తున్నది. ఇవి ఎక్కువగా ఇప్పుడు దేశంలోనే తయారవుతున్నాయి కూడా. అయితే ఈ రెండు పద్ధతులలోను, ప్రతి సంవత్సరము కోట్లాది రూపాయల సబ్సిడీలు ఇవ్వాల్సి వస్తున్నది. ఈ దేశపు దౌర్భాగ్యం కాదా ఇది?

ఆధునిక ఆలోచనా విధానం ప్రకారం నేడు వ్యవసాయ రంగంలో కన్పిస్తున్న ప్రగతికి క్రొత్త రకాల విత్తనాలు, రసాయనిక ఎరువులు,

పురుగుమందులు, ట్రాక్టర్లు, కారణమని అంటారు. ట్రాక్టర్ల విషయం ఈ సందర్భంగా కాక, ఎద్దుల విషయం వచ్చినప్పుడే మాట్లాడుకుందాం. క్రొత్తగా రూపొందించిన విత్తనాలలో ప్రతిరోధాత్మక శక్తి తక్కువగా ఉండడం వల్ల అవి ఎక్కువ ఉపయోగకరం కావని తేలిపోయింది. రసాయనిక ఎరువులు, పురుగుమందుల వల్ల జరుగుతున్న హానిని నేడు విదేశీ, స్వదేశీ శాస్త్రజ్ఞులందరు అంగీకరిస్తున్నారు. రసాయనిక ఎరువులు భూమియొక్క సహజసిద్ధమైన ఉత్పాదకశక్తిని హరించి వేస్తాయి. క్రమంగా భూమిని పనికిరాని బంజరు భూమిగా మార్చివేస్తాయి. పైగా స్థిరమైన పంటను పొందాలంటే ప్రతి సంవత్సరం మరింత ఎక్కువ మొత్తంలో రసాయనిక ఎరువులు వాడవలసి ఉంటుంది. ఈ ఎరువులలోని కేవలం 30% గుణాలు మాత్రమే పంటలకు ఉపకరిస్తాయి. మిగిలిన 70% భూమి పొరలలో నిలిచిపోయి భూమిని బంజరుగా మార్చివేస్తాయి. ఈ ఎరువుల వల్ల వచ్చిన పంటలు కూడా మేలైనవి కావు, బలవర్ధకములు కావు. పురుగుమందులు భూమిలోని కీడుచేసే క్రిమికీటకాలతో పాటు పంటలకు సహకరించే మిత్రజీవాణువులను కూడా నాశనం చేసి వేస్తాయి. తత్ఫలితంగా పంటలకు మరింత హాని కలుగుతుంది.

నేటిస్థితి - ఇక ఎంత ఎక్కువ రసాయనిక ఎరువులు వాడినప్పటికీ ఆహార ఉత్పత్తి పెరిగే అవకాశం లేదని వ్యవసాయ శాస్త్రవేత్తలే చెబుతున్నారు.

పశ్చిమ దేశాలలో చేసిన పరిశోధనల వల్ల రసాయనిక ఎరువుల వాడకం వల్ల అమెరికా, యూరపు దేశాలలోని వేలాది ఎకరాల నేల బంజరు భూములుగా మారినట్లు స్పష్టమైంది. రసాయనిక ఎరువుల వాడకం వల్ల పంటలలో విషపూరిత కీటకాలు వృద్ధి చెందుతున్నాయి. ఈ కారణంగా పేడతో తయారైన జీవం కల సేంద్రియ ఎరువులతో పండించిన పత్తి,

తేయాకు మొదలైన పదార్థాలను, రసాయనిక ఎరువుల వాడకం వల్ల పండిన వాటికంటే రెండింతలు, మూడింతల ధర చెల్లించి, విదేశీ కొనుగోలుదారులే కొనివేస్తున్నారు.

## పాలివ్వని ఆవు పనికిరాదా?

భారతీయ జాతుల గోవుల పాలు, పెరుగు నెయ్యి మరియు భారతీయ గోసంతతి యొక్క పేడ, మూత్రము ఎంతో శ్రేష్ఠమైనవి. ఈ ఐదు తత్వాలే (పాలు,పెరుగు, నేయి, గోమయం, గోమూత్రం) పంచగవ్యమవుతాయి. ఈ పంచగవ్యం యొక్క ప్రాముఖ్యతను యుగయుగాల నుండి మన భారతీయ గ్రంథాలెన్నో వర్ణించి చెప్పాయి. భారతదేశంలో ఏ ధార్మిక విధి అయినా పంచగవ్య ప్రయోగం లేనిది పూర్తి కానేకాదు. బంజరు భూములను సేద్యానికి యోగ్యంగా మార్చాలంటే గోవుపేడ, గోమూత్రం మరియు నీటి ద్వారానే సాధ్యమవుతుంది. గడ్డి కూడా మొలవని తెల్లని బీడు భూములలో, గులకరాళ్ళు నిండిన భూమిలో సైతం నీటిలో పేడకలిపి చిక్కగా చిలకరించడం వల్ల పంటలు పండించవచ్చు. దీనికోసం అవసరాన్ని బట్టి గోబర్ గ్యాసు యంత్రాలను ఒకటి లేదా అంతకన్న ఎక్కువ మొత్తంలో ఏర్పాటు చేసుకోవాలి. వాటివల్ల వెలువడే గ్యాసును వంటకు, యంత్రాలు నడిపేందుకు, విద్యుత్తు కోసం ఉపయోగించవచ్చు. మిగిలిపోయిన మడ్డిలో నీళ్ళు కలిపి బంజరు భూమిపై చల్లిస్తే క్రమక్రమంగా ఆ భూమి ఉత్పాదకతను సంతరించుకుంటుంది.

ఢిల్లీ ప్రాంతంలో నెలకొన్న ఇలాంటి గోసదనాల వల్ల ఎంతో లాభం చేకూరుతున్నది. ప్రయోగశాలలో గులక రాళ్ళను గోమూత్రంలో ఉంచి వేసిన ప్రయోగం వల్ల క్రమక్రమంగా కరిగి పోవడం ఈ సత్యాన్ని ఋజువు చేసింది.

పేడవల్ల ప్రపంచంలో సర్వశ్రేష్ఠమైన జీవశక్తి గలిగిన సేంద్రియ ఎరువు తయారు కాబడుతున్నది. పేడ నుండి గ్యాసు పోయిన తర్వాత నిజానికి మిగిలిన ఆ మడ్డిలోనే ఎరువులను తయారుచేసే గుణాలెన్నో ఉంటాయి.

మహారాష్ట్రలోని వుసద్ గ్రామానికి చెందిన కీ.శే. శ్రీనారాయణ్ దేవధర్ పాండరీపాండే అనబడే నాడేప్ కాకాగారి పేరుతో ప్రసిద్ధి కెక్కిన నాడెప్ పద్ధతిలో 1 కిలో పేడనుండి 20 నుండి 30 కిలోల సేంద్రియ ఎరువు సిద్ధమవుతుంది. గాలి సోకే పద్ధతిలో ట్యాంకులు నిర్మించి జల్లించిన మట్టి, పచ్చిరొట్ట (ఆకులు, అలములు), కూరగాయ తొక్కలు, పేడ ఒక క్రమ పద్ధతిలో నింపి సేంద్రియ ఎరువు తయారుచేయవచ్చు. అలా తయారైన ఎరువును వ్యాపారులు కనీసం రూపాయిన్నరకు కిలో చొప్పున కొని ఎక్కువ లాభానికి అమ్ముకోవాలని చూస్తారు. గోవు యొక్క 1 కిలో పేడ ఇలా 30 నుండి 40 రూపాయలవరకు సంపాదించగలుగుతుంది. గోసంతతి ఆర్థిక భారమెలా అవుతుంది? ముసలివి, అంగలోపమేర్పడినవి కూడా ఇలా మనకు డబ్బు సంపాదించి పెట్టేవే! నిజానికి వాటి మేతకు పెట్టే ఖర్చు కంటే ఎన్నో రెట్లు ఎక్కువ ఆదాయాన్ని అవి సమకూర్చిపెడతాయి.

అమెరికాలోని కాలిఫోర్నియా ప్రాంతంలోని ఒక ఔత్సాహిక అమెరికన్ వ్యక్తి ఈ క్రింది ప్రయోగం చేశాడు. అతడు అంగలోపము కలిగిన 80-90 వేల ఆవులను పోషించాడు. వాటి ద్వారా ప్రతిరోజు 800-900 టన్నుల పేడ, మరియు వందలాది బారెళ్ళ మూత్రం లభించింది. పేడతో విద్యుత్తును ఉత్పత్తి చేసే జనరేటర్లు నెలకొల్పి 15 మెగావాట్ల విద్యుత్తును ఉత్పత్తి చేస్తున్నాడు. ఈ విద్యుత్తు 20 వేల కుటుంబాల అవసరాలకు లభ్యమవుతూ ఉన్నది. ఇదికాక ప్రతిరోజు 180 టన్నుల పేడ మడ్డి- బూడిద లభిస్తున్నది. అది ఎరువుగా ఉపయోగపడుతున్నది. ఈ మొత్తం ప్రాజెక్టుకు 4 కోట్ల 50

లక్షల డాలర్ల నిర్వహణ కాగా ప్రతి సంవత్సరము 20 లక్షల డాలర్ల నిర్వహణ ఖర్చు వస్తున్నది. దీనిపై ప్రతి సంవత్సరము 1 కోటి డాలర్ల ఆదాయం వస్తుండగా 8 లక్షల డాలర్ల మిగులుబాటు అవుతున్నది. అదీకాక పెట్రోలు, డీజిలు ఖర్చు అతి తక్కువ ఉండడంతో ఆ మేరకు విదేశీ మారక ద్రవ్యము కూడా మిగిలిపోతున్నది.

గోమూత్రం చేత క్రిమినియంత్రణ, నివారక ఔషధాలు తయారువుతున్నాయి. గోమూత్రంలో వేప, జిల్లేడు, తులసి, మారేడు, కానుగ మొదలైన ఒక రకపు ఆకులు 15 రోజులు నానబెట్టి రాగి పాత్రలో మరిగించాలి. సగం వరకు దిగిన తర్వాత సీసాలలో పోసి పెట్టుకోవాలి. ఒక లీటరు ఈ ద్రవములో 100 లీటర్లు నీరు కలిపి పంటపై పిచికారీ చేస్తే కీటకాలు లేకుండా పోతాయి. అలా కోట్లాది రూపాయల విదేశీ మారక ద్రవ్యము ఆదా అవుతుంది. గోమూత్రంలో 10 రెట్లు నీరు కలిపి చెట్లు, మొక్కలపై పిచికారీ చేస్తే కీటకాలనుండి వాటిని రక్షించవచ్చు.

ఆవులు నిలిచి ఉండే స్థలంలో వాటి మూత్రంతో తడిసిన మట్టి పొలంలో చల్లితే అది ఎరువుగా పనిచేస్తుంది. గోమూత్రం సేకరించి ఎర్రమట్టి లేదా పుట్టమన్నుతో కలిపి ఇళ్ళలో గోడలకు అలికితే విషపూరితమైన బల్లులు, దోమలు, ఈగలు ఆ యింట్లోకి రాలేవు. ఆవుపేడ, గోమూత్రంతో అలకబడిన ఇళ్ళలో అణువికిరణాల దుష్ప్రభావం ఉండనేరదు. భోపాల్ విషవాయువు సంఘటన సందర్భంగా ఈ వాస్తవం ఋజువైంది. రష్యన్ శాస్త్రవేత్త శ్రీ శిరోవిచ్ పరిశోధనలో ఆవుపాలు, పేడ, మూత్రములలో రేడియో ధార్మిక అణువికిరణాల నుండి భద్రత కల్పించే సామర్థ్యం ఉందని ఋజువైంది. కనుక ఆవుపేడతో అలికిన ఇళ్ళలో రేడియో ధార్మిక అణుతరంగాలు ప్రభావరహితం కావడమే కాదు అవి అసలు ఆ ఇంట్లోకి చొరబడను కూడా లేవు.

తాజా పేడలో 5% నీళ్ళు కలిపి ముద్ద చేసి దానిలో ఒక లీటరు గోమూత్రం కలపండి. ప్రతిరోజు కనీసం రెండుసార్లు దీనిని కదుపుతూ ఉండండి. 10 రోజుల తర్వాత ఈ ముద్ద చెట్లకు ఎరువుగా వాడుకోవచ్చు. ప్రతివారం ఇలా చేస్తుంటే పంటకు రోగాలేవీ రాకుండా రెట్టింపు ఫలితం వస్తుంది. ఒక లీటరు ఆవు మజ్జిగను ఒక వారం రోజుల వరకు మురగవేసి అందులో 500 లీటర్లు (1000 లీటర్ల వరకు కూడా కలపవచ్చు) నీరు కలిపి పంట పొలాలలో చిమ్మితే ఆ భూమి ఉత్పాదకత పెరుగుతుంది. అట్టి భూమిలో పురుగుమందులు, ఇతర విదేశీ ఔషధాలు వాడనక్కరలేదు. ఈ మిశ్రమం అర ఎకరంపైగా పొలానికి సరిపోతుంది.

భారతదేశము యొక్క గోసంతతి ముఖ్యంగా యాంత్రిక పశువధశాలల కారణంగా నిరంతరం తగ్గిపోతూ ఉన్నది. అయినప్పటికీ బ్రతికి ఉన్న ఈ పాటి గోసంతతి యొక్క మొత్తము పేడతో గ్యాసు ఉత్పత్తి చేసి, మిగిలిపోయిన మడ్డివల్ల 88 లక్షల టన్నుల నైట్రోజన్, 88 లక్షల 20 వేల టన్నుల ఫాస్ఫరస్ మరియు 40 వేల టన్నుల పోటాషియంలను పొంది అత్యుత్తమమైన, త్రిగుణాత్మకమైన సేంద్రియ ఎరువులను తయారుచేసుకోవచ్చు. దాని విలువ 83 వేల కోట్లకు పైగానే ఉంటుంది. అలా లభించే గ్యాసు వంటకు, యంత్రాలు నడపడానికి, ఇంకా విద్యుదుత్పత్తికి కూడా ఉపయోగించవచ్చు. కర్ణావతి (అహమదాబాద్) సమీపంలోని 'ఈడర్' గోశాలలో గ్యాసు ద్వారా కిర్లోస్కర్ ఇంజన్ సహాయంతో విద్యుత్తు తయారవుతున్నది. భారతదేశంలో విద్యుత్తు కొరతను ప్రత్యేకించి గ్రామీణ భాగాల్లో ఇలాంటి విద్యుత్తు నిర్మాణ ప్రక్రియలు ప్రారంభించి ఈ కొరతను చాలావరకు నివారించవచ్చు.

ఏనిమల్ వెల్ఫేర్ బోర్డ్ ఆఫ్ ఇండియా వారి ప్రకారము ఒక ముసలి ఆవుద్వారా సంవత్సరానికి 4500 లీటర్ల బయోగ్యాసు, 80 టన్నుల

సేంద్రియ ఎరువు మరియు 200 లీటర్ల సేంద్రియ కీటక నివారణ ఔషధము లభ్యమవుతాయి. వాటి మొత్తం విలువ 1989 సంవత్సరంలో రూ. 17,885/- కాగా 1998లో రూ.25,000/-కు చేరింది. కాబట్టి గోమయం, గోమూత్రాల వల్ల లభించే బయోగ్యాసు, విద్యుత్తు, సేంద్రియ ఎరువులు, కీటక నియంత్రణ ఔషధాలు ప్రతి సంవత్సరం వేలకోట్ల విలువగలవి ఉత్పత్తి చేయగల అవకాశం మనకు ఉంది. భూమియొక్క ఉత్పాదకశక్తిని, నీటిని పట్టి ఉంచే శక్తిని పెంచగల అతి చక్కని సాధనం ఈ ప్రక్రియ.

నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసెర్చ్ మరియు నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లైడ్ ఎకనమిక్ రిసెర్చ్, న్యూఢిల్లీ వారి ఒక అధ్యయనం ప్రకారం పిడకలు కాల్చడం వల్ల 6 కోట్ల 80 లక్షల టన్నుల వంట చెరకు ఆదా అవుతున్నది. ఇంత వంట చెరకు అంటే 15 సంవత్సరాల వయస్సు గలిగిన 14 కోట్ల చెట్లన్న మాట.

ఆశ్చర్యం! ఊహించరాని ఎంతపెద్ద ఆదాయమిది! అయినప్పటికీ గోసంతతి ముసలివైతే ఇక పనికిరావని వాదిస్తారు కొందరు. కాని ఈ వాదన అర్థం లేనిది. అవెప్పుడూ పనికిరానివి కానేకావు. ఈ రోజున 1951 సంవత్సరంలో ఉన్న పశుసంఖ్య లేదని భావించినా లక్షల కోట్ల రూపాయల ఆదాయం గోసంతతి తన పేడ ద్వారా లభింపచేస్తుందనేది వాస్తవం. దీనిలో గోమూత్రం విలువ కలవనేలేదు. అది ఆ ఆదాయానికి కలిసే మరొక పెద్ద అదనపు ఆదాయం. తరువాతి అధ్యాయంలో దేశవాళీ ఆవుజాతుల గోమూత్రం మందుల కంపెనీలకు ఎలా విక్రయింపబడుతున్నదో వివరించబడింది.

గోసంతతి చనిపోయిన తర్వాత కూడా అవి ఎంతో ఉపయోగపడుతాయి. వీటి చర్మం వల్ల అనేక రకాల పాదరక్షలు, వ్యవసాయ

పరికరాలు తయారవుతున్నాయి. ఆవు కొమ్ములో పేడ నింపి భూమిలో పాతిపెడితే కొంతకాలం తర్వాత అది మంచి ఎరువుగా, ఉత్పాదకశక్తిగా పనికి వస్తుంది. అందరూ చర్మము ఉపయోగించకపోయి నప్పటికీ, (ఉదా: ముఖ్యంగా జైన బంధువులు) ఆ గోవును పూర్తిగా భూమిలో పాతిపెడితే అక్కడ ఎంతో చక్కని ఎరువు సిద్ధమవుతుంది. ఇది ఎన్నో ఎకరాలకు ఉత్పాదశక్తిని అందిస్తుంది. కనుక ఆవు బ్రతికినా, చచ్చినా అది పెంచిన వారికి ఎలాంటి భారంగా కాక పైగా ఊహించనంత ఆదాయాన్ని, ప్రయోజనాన్ని సిద్ధింపచేసే సాధనమే అవుతుంది.

కర్ణావతి (అహమదాబాద్ – గుజరాత్ సమీపంలోని ఈడర్ గోశాల గోసదనంలో భారతీయ కిసాన్ సంఘ్ జాతీయ అధ్యక్షులు డా॥ కువర్‌జీ భాయ్ జాధవ్‌గారి ఆధ్వర్యంలో జరుగుతున్న పరిశోధనపై లభించిన ఒక నివేదిక ఈ క్రింది విధంగా ఉంది.

ఒక ఆవు సరాసరి 10 కిలోల పేడ ఇస్తుంది. నాడెప్ పద్ధతిలో 1 కిలోకు 20 నుండి 30 కిలోల ఎరువు తయారువుతుంది. ఒక ఆవునుండి సంవత్సరానికి సుమారు 80 టన్నుల సేంద్రియ ఎరువు తయారవుతుంది. వనాలను, వృక్షాలను రక్షించాలనే ఉద్దేశ్యముతో దీనిలో సగం పేడ పిడకలుగా పంట మొదలగు వాటి కొరకు కాల్చినపట్పకీ దేశంలోని గోసంతతి సంఖ్య 19 కోట్లనుకంటే మిగిలిన పేడతోనే 760 కోట్ల టన్నుల సేంద్రియ ఎరువు తయారవుతుంది. దీని మొత్తం విలువ సుమారు రూ.7,60,000/– కోట్లవుతుంది. మార్కెట్‌లో సేంద్రియ ఎరువు కిలోధర కనీసం రూపాయిన్నర ఉంటుంది. అయినా ఇక్కడ కిలో ఒక్కరూపాయిగానే లెక్క వేయబడింది.

వ్యవసాయ యోగ్యమైన భూమి మొత్తం భారతదేశంలో 19 కోట్ల హెక్టారులుందనుకుంటే ఒక హెక్టారుకు 10 టన్నుల సేంద్రియ ఎరువు

చొప్పున మనకు 190 కోట్ల టన్నుల సేంద్రియ ఎరువు సరిపోతుంది. 570 కోట్ల టన్నుల ఎరువు ఇంకా మిగిలిపోతుంది. బయటిదేశాలనుండి రసాయనిక ఎరువులను దిగుమతి చేసుకోవాల్సిన అవసరంగానీ, మనదేశంలో వాటిని ఉత్పత్తి చేయవలసిన అవసరం గానీ ఉండనే ఉండదు. వ్యవసాయ భూములపై క్రిమికీటకాల బెడద పూర్తిగా తొలగిపోతుంది. భూమి యొక్క ఉత్పాదక శక్తి ఏమాత్రం నష్టం కాదు. వ్యవసాయోత్పత్తులలో ఎలాంటి విష స్వభావం ఉండనేరదు. దేశ ప్రజలందరికీ చక్కని ఆరోగ్యం చేకూరుతుంది. ఒక ఆవునుండి సంవత్సరానికి 80 టన్నుల సేంద్రియ ఎరువు అన్నది తక్కువగా లెక్కించబడింది!

## గోవుపేడ, గోమూత్రము, మజ్జిగలతో ఔషధాలు, వినియోగ వస్తువుల తయారీ

పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, మజ్జిగ – రకరకాల మిఠాయి పదార్థాలు, గోమయము, గోమూత్రాలతో సేంద్రియ ఎరువులు, కీటక నియంత్రక పురుగు మందులు – వ్యవసాయ ప్రధానమైన మన దేశంలో ఈమాత్రం ఉపయోగాలు తెలిస్తేనే సరిపోదు. మానవ శరీరానికి గోమూత్రం ఒక దివ్యౌషధం. ఈ దృష్ట్యా గోమయానికి కూడా ఎంతో ప్రాధాన్యత ఉంది. ఆయుర్వేద చికిత్సలో గోమాత అత్యంత మహనీయమైనది. సర్వరోగనివారిణి అది. అందుకే 'గావః సర్వఫలప్రదాః' అంటే సమస్త సుఖాలను అందించేది గోవు అని అన్నారు. గోవును 'నడయాడే ఆసుపత్రి' అని అనడం కూడా సబబుగానే ఉంది. 'అయితే ఇంటింటిలో గోవు, గ్రామ గ్రామాన గోశాల – ఇదే మన వైద్యశాల' అని మన ఆకాంక్ష, లక్ష్యం కూడా. ఈ లక్ష్యాన్ని చేరుకోగలిగితే భారతదేశంయొక్క సర్వాంగీణ ఉన్నతిలో ఒక మైలురాయిని అందుకోగలిగామనే చెప్పుకోవాలి.

ఆయుర్వేదాన్ని అనుసరించి ప్రకృతి విరుద్ధమైన నడవడిక కారణంగా అంటే అప్రాకృతిక, అసహజమైన ఆహార విహారాదుల వల్ల శరీరంలో రోగాలు ప్రవేశిస్తాయి. శరీరంలో త్రిదోషాలు (వాత,పిత్త, కఫములు) సంతులనం తప్పితే రోగం ప్రవేశిస్తుంది. కనుక వీటిని సంతులనంలో ఉంచడమే చికిత్స అంటే. గోమూత్రం ఈ త్రిగోషాలను హరించేది. అయితే కొంతవరకు పిత్తం ప్రకోపించే అవకాశం ఉంది. కనుక నల్లని రంగు గల (శ్యామ) కపిల గోవు పాలు పిత్తాన్ని హరించేవి కనుక అవి సర్వ శ్రేష్ఠమైనవిగా భావించబడ్డాయి. గోవులలోని సమస్త జాతులలోను భారతీయ జాతులే సర్వోత్తమమైనవిగా ప్రసిద్ధి పొందాయి. మూడవ అధ్యాయంలో ఈ విషయం వివరించబడింది. అన్ని రోగాలకు కారణం మందాగ్ని (ఆకలి లేమి) 'సర్వే రోగాః హి మందాగ్నౌ'. గోమూత్రం ఆ అగ్నిని ప్రజ్వరిల్ల చేస్తుంది. విషాణువులను హరించివేస్తున్నది. గోమూత్రం ఒక రసాయనం, కొన్ని జీవన తత్వాలు మూత్రం గుండా బయటికి వెళ్ళిపోతాయి. గోమూత్రం ఈ తత్వాలను, (ఎంజైమ్స్) మళ్ళీ పూరించివేస్తుంది. గోమూత్రంలో గంగ ఉంటుంది. ఎంత పాతబడితే అంత శక్తి దీనిలో పెరుగుతుంది తప్ప ఎప్పుడూ ఇది మురుగు పట్టే ప్రసక్తి లేదు. గోమూత్రంలో రాగి మరియు స్వర్ణ క్షారం ఉంటుంది. ఇది మనుష్యశరీరానికి ఎంతో హితకరం.

మానసిక రోగాల ముఖ్యకారణం నైరాశ్యం. వైరస్ అనబడే విషాణువులు శరీరంలో ఉంటాయి. అట్టి విషాణువుల సమూహాన్నే క్యాన్సర్ అంటున్నారు. రక్త విషాణువులే బ్లడ్ క్యాన్సర్‌గా పిలవబడుతున్నది. ఇది ప్రధానంగా మానసిక నైరాశ్యం యొక్క ఫలితమే. గోమూత్రం సేవించడం వల్ల ఈ నైరాశ్యం, విషాణువుల వైరస్ అన్ని తొలగిపోతాయి. అందుకే క్యాన్సర్‌కు గోమూత్రమే మందు. ఆయుర్వేదంలో విషాక్తమైన మొక్కలు, వేళ్ళు మొదలైనవి

గోమూత్రంలోనే శుద్ధి చేయడం జరుగుతుంది. గోమూత్రం చేత రోగాలన్నీ నయమవుతాయి.

గోమూత్రంలో అనేక రసాయనిక తత్వాలున్నాయి. నైట్రోజన్, సల్ఫర్, అమోనియా, రాగి, ఇనుము, యూరిక్ యాసిడ్, ఫాస్ఫేట్, సోడియం, పోటాషియం మాంగనీసు, కార్బోలిక్ యాసిడ్, కాల్షియం, సాల్ట్, విటమిన్ ఎ,బి,సి,డి,ఇ. ఎంజైమ్స్ మొదలైనవి ఉన్నాయి. ఇవి రక్తాన్ని శుద్ధి పరచడంలో, విషాన్ని హరించడంలో, క్రిములను నాశనం చేయడంలో, ఎముకలను గట్టిపరచడంలో, ఎంతో దోహదం చేస్తాయి. ఆరోగ్య ప్రదాలు, జీవశక్తిని పెంపొందించేవి, రోగనిరోధకాలుగా కూడా ఇవి పనికి వస్తాయి. అందుకే అన్నారు 'ఏ ఇంటిలో తులసి మరియు గోమాత ఉంటాయో, ఆ ఇంటికి వైద్యుడెవరూ రానక్కరలేదు' అని. 'జాఘర తులసీ అరుగాయ్ - తాఘర వైద్య కబహు న అయే'.

గోమూత్రం చేత వందలాది రోగాలకు చికిత్స జరపవచ్చు. వైద్యులు చెప్పేదేమంటే మనిషి యొక్క కడుపునుండి ప్రారంభమయ్యే సుమారు 108 వ్యాధుల చికిత్స **'గోమూత్ర ఘననటి', 'గోమూత్రాసవ' మరియు 'గోమూత్ర అర్క'** లతో జరుగుతుంది అని. మలబద్ధకంలోను, విరేచనాలలోను ఘనపటి 2 మాత్రలు నీళ్ళతో తీసుకోవాలి. 2, 3 సార్లు తీసుకుంటే మరీ మంచిది. రెండు మాత్రలకు మదులుగా 20 మిల్లీ లీటర్ల గోమూత్రం గాని, గోమూత్రాసవ 20 మి.లీ. గని 10 మి.లీ. గోమూత్ర అర్కగాని తీసుకుంటే సరి. (డయాబిటిస్) మధుహేహం, రక్తశర్కర, శరీరంలో వాపులు ఉన్నట్లైతే గోమూత్రాసవ తీసుకోరాదు.

గోతీర్థంలో లవంగాలు, జాజికాయ, జాపత్రి కలిపి అర్కతీయడం జరుగుతుంది. క్రింద మిగిలిపోయే క్షారంలో **'గోమూత్ర ఘననటి',**

**'గోమూత్రావటి'** తయారవుతాయి. ఇవి కరిగిపోకుండా ఉండడానికి పిడకల బూడిదలోగాని తులసి చూర్ణంలో గాని వేసి అరబెట్టాలి. పసిపిల్లల కోసం **'బాల్ పాల్ రసం'** మరియు స్త్రీలకోసం **'నారీ సంజీవని'** గోమూత్రం నుండి తయారు చేయడం జరుగుతుంది. కడుపులోని వివిధ రోగాలకు **'గోమూత్ర హరడేచూర్ణం'** ఎంతో ఉపయోగకరమని ఋజువైంది. పిల్లల కడుపులో నులిపురుగులను చంపడానికి **'గోతక్రాసవ'** ప్రసిద్ధమైంది. రుచికరంగా ఉండడంతో పిల్లలు చక్కగా తాగుతారు కూడా. నవయువకుల్లో కనిపించే స్వప్నదోషం, శీఘ్రస్ఖలనం, ధాతునష్టం, బలహీనత, బద్ధకము, సోమరితనము, తలనొప్పి, స్మరణశక్తి లోపము, మొదలగువాటి కోసం **'ప్రమేహాది'** ఔషధం ఎంతో మంచిది. **గోమయం (ఆవు పేడ), గోమూత్రం, గోదుగ్ధ (ఆవుపాలు), గోదధి (ఆవు పెరుగు), గోఘృతాలతో (ఆవు నెయ్యి)** తయారయ్యేది **'పంచగవ్య ఘృతం'.**

ఇది సొమ్మ, బుద్ధిమాంద్యము, ఉన్మాదము, తీవ్రమైన పసిరికలు, (పచ్చకామెర్లు) మూలవ్యాధి మొదలైన రోగాలకు ఉపయోగదాయకము. పళ్ళకు నీళ్ళు లేదా వేడి వస్తువులు తగిలితే నొప్పి కావడం, క్రిమిదంతము, చిగుళ్ల వాపు, స్వరభేదము, నోటిపూత, గొంతు గరగర, నోటిలో దుర్వాసన, పయోరియా మొదలగు దంత వ్యాధులకు 'గోమయ దంతమంజన్' ఎంతో మంచిది. గోమూత్రంతో తయారైన 'కామధేను షాంపూ' తల వెంట్రుకలు నునుపు రావడానికి పనికివస్తుంది. పంటలపైన చీడపురుగును నాశనం చేయాలంటే 'గోమూత్ర ఝుల్లీ నాశక్ స్ప్రే' ను వాడవచ్చు.

గోమయం వల్ల కూడా అనేక మందులు తయారవుతాయి. పేడరసంలో నువ్వుల నూనె కలిపి తయారయ్యే నూనె కళ్ళకు ఎంతో మంచిది. ఎక్కువగా చదివేవారు, వ్రాసే వారికి ఈ నూనె ఎంతో లాభకారి. పేడరసం,

గోమూత్రాలతో **'కామధేను తైలం'** తయారవుతుంది. శరీరం నొప్పులకు ఈ నూనెతో మాలిష్ చేయడం, కాపు పెట్టడం మంచిది. గోమయం పట్టీ చర్మంపై దద్దుర్లు, గజ్జి, జిల, దెబ్బలు మొదలగు వాటికి ఎంతో ఉపయోగదాయకం. చిన్నదూడల పేడతో,**'గోపాల్‌నస్యం'** తయారవుతుంది. సొమ్మ, మెదడులో క్రిములు, హిస్టీరియా, మూర్ఛ, తలనొప్పి, ముక్కుకు సంబంధించిన వ్యాధులు ఈ నస్యంవల్ల నయమవుతాయి. 'గోమయం సబ్బు' గోకుడుకు విరుగుడుగాను, కీటకాలను నశింపజేసేదిగాను, దుర్గంధం నివారించేదిగాను పని చేస్తుంది. **'గోమయ అంగరాగ్'** కూడా ఇలాగే సబ్బులా పని చేస్తుంది. తలపేనులను, చుండ్రును నివారిస్తుంది. పర్యావరణ శుద్ధికోసం, కాలుష్య నివారణకు విశ్వదేవధూప బత్తీలు, గోదేవధూపం వెలిగించబడుతుంది. జిలను నివారించేందుకు కూడా గోమయంతో సబ్బు తయారుచేయబడుతున్నది.

ఉదాహరణకు పైన కొన్ని మాత్రమే చెప్పబడినాయి. ఘనవటి ఒక్కటే 108 రోగాలకు పనిచేస్తుంది. ఆరోగ్యవంతమైన దేశీయ గోవు యొక్క మూత్రమే ఔషధాలకు వాడవలసి ఉంటుంది. బజారులో తిరిగేవి, పాలిథీన్ సంచులు, మురికి తినే ఆవుల మూత్రం పనికిరాదు. బయట అడవిలో గోచర భూముల్లో తిరిగి వచ్చే ఆవులైతే మరీ మంచిది. గోమూత్రాన్ని తెల్లని గుడ్డ 8 పొరలుగా చేసి వడపోసి తీసుకోవాలి. ఖాళీ కడుపుతోనే గోమూత్రం సేవించాలి. సేవించిన ఒక గంటవరకు ఆహారమేదీ తీసుకోరాదు. స్త్రీలకు బహిష్టుసమయంలో చాలా మంచిది.

యువకులు 150 నుండి 250 మి.లీ.ల వరకు గోమూత్రం తీసుకోవచ్చు. నేరుగా గోమూత్రం తీసుకోలేనివారు ఘనవటిని గాని, హరడే చూర్ణాన్ని గాని లేదా గోమూత్ర అర్కను గాని తీసుకోవచ్చు.

కడుపులోని ఏ రోగానికైనా గోమూత్ర పానం మంచిది. చరకుని ప్రకారం గోమూత్రంలో సన్నని ఇనుపపొడి నానబెట్టి వడపోసి పాలతో కలిపి తీసుకుంటే పాండురోగం త్వరలో నయమవుతుంది. చెవి రోగాలకు గోమూత్రం వేడిచేసి చెవిలో కొన్ని బొట్లు పోయాలి. తామర లేదా గజ్జి, దురదవంటి చర్మరోగాలలో గోమూత్రంతో మాలిష్ చేసి స్నానం చేయడం మంచిది. లివరు స్లీన్ వ్యాధులలో ఇటుక ముక్కను బాగా వేడిచేసి గోమూత్రంలో ముంచి గుడ్డలో చుట్టి లీవర్, స్లీన్‌ల వాపుపై కాపితే ఎంతో మేలు చేకూరుతుంది. బోదకాలు (ఫైలేరియా) రోగులు ఖాళీ కడుపుతో ఉదయం గోమూత్రం సేవించాలి. తలకు గోమూత్రం బాగా పట్టించి ఆరనిచ్చి ఆ తర్వాత చక్కగా కడిగితే వెంట్రుకలు మృదువుగాను, అందంగాను తయారవుతాయి. పిల్లలు సొక్కిపోయి ఉన్నట్లైతే ఉదయం, సాయంత్రం గోమూత్రంలో కాస్త కేసరి కలిపి నెలరోజుల పాటు త్రాగించాలి. క్షయరోగులు గోశాలలో గోవులతోపాటు నివసించడం, అతని మంచం మాటికి మాటికి గోమూత్రంతో కడగడం జరిపితే ప్రయోజనం ఉంటుంది.

నాగపూర్‌లో తయారయ్యే 14 ఔషధాలకు మహారాష్ట్ర ప్రభుత్వం పరీక్షలు చేసిన పిదప ఆ ఔషధాల ఉత్పత్తికి విక్రయానికి లైసెన్సు ఇచ్చింది. అదే విధంగా అకోలా, కలకత్తా, జయపూర్‌లలోను కొన్ని ఔషధాలకు 'అవి శ్రేష్ఠమైనవి' అని ధ్రువపత్రాలు లభించాయి.

క్యాన్సరు వంటి భయంకర రోగాలు, తీవ్ర రక్తపోటు, దమ్ము రోగాలకు గోమూత్ర సేవనం వల్ల మేలు కలిగినట్లు ఋజువైంది. అవి పేటేంట్ చేయబడ్డాయి కూడా. పంచగవ్య చికిత్స విధానంలోని మందుల ప్రామాణికతను IICT, NBRI, CSIR, IIT, NEERI, NBAGR వంటి ప్రభుత్వ పరిశోధనా సంస్థలు గుర్తించాయి. పానీపత్, నారాయణగఢ్, అంబలా,

హర్యానా కాసరగోడులలో క్యాన్సర్ రోగులకు చికిత్స చేయబడింది. తెల్ల బొల్లి మచ్చలు తొలగించేందుకు సేవనానికి, లేపనానికి పనికి వచ్చే ఔషధాలు తయారు చేయబడినాయి.

**పశువులకూ చికిత్స**

మనుష్యులకే కాక పశువుల రోగాలకు కూడా గోమూత్ర ఔషధాలు తయారైనాయి. ఉదాహరణకు 'మాతా' (Render Pest) Haemorhagic septicamiam anthraxm Black Quarter, Foot and mouth diseases, Mastitics, thymiopaniytte, Impaction of Ruman, Ephermeral Fever, Dysentry, Indigestion మొదలైన రోగాలలో 250 మిల్లీ లీటర్ల గోమూత్రంలో 50 గ్రాముల బెల్లం కలిపి ఉదయం, సాయంత్రం తాపాలి. దానితోపాటు గోమూత్రాన్ని, గోమయం బూడిదను పైన చల్లండి, గాయాలు అయినట్లైతే వాటిని గోమూత్రంతో కడిగి పైన గోమయం బూడిదను చిలకరించండి. 25 మి.లీ. గోమూత్రాన్ని అలాగే లేదా దానితో బెల్లం కలిపి త్రాగించండి. రోగం సోకిన పశువులను విడిగా కట్టి వేయాలి. పశువుల అన్ని రోగాలలోను గోమూత్రం త్రాగించడం, కడగడం మంచిది. ఎక్కువ మోతాదులోను ఇవ్వవచ్చు. రోజుకు మూడుసార్లు కూడా ఇవ్వవచ్చు.

ముంబైకి చెందిన డా॥ గౌరీ శంకర్ మహేశ్వరి గారు గుండెజబ్బుగల రోగులకు గోచికిత్స (Cow Therapy) ద్వారా ఆపరేషను వంటివి లేకుండానే ఎందరికో నయంచేసి పంపించారు. దేశీయ ఆవుల పాలలో వెన్నతీసి, నేయిచేసి ప్రయోగంచేసి చూడండి. కపిల ఆవు (నల్లది) పాల వెన్నతో చేసిన నేయి అయితే మరింత శ్రేష్ఠం. నేయి నేరుగా మంటపైన కాక వేడినీటిలో లేదా ఎండలో వేడిచేసి రెండు చుక్కలు చొప్పున రోగిని పడుకోబెట్టి రెండు ముక్కు రంధ్రాలలోను వేయాలి. కొంత నేయి బొడ్డుపైన వ్రేలితో

రాయాలి. తమ ఇంటిలోనైనా ఆవును పెంచుకోవాలి. లేదా దగ్గరలోని గోశాలలోనైనా పెంచే ఏర్పాటు చేసుకోవాలి. రక్తపోటు ఎక్కువ ఉన్నా, తక్కువ ఉన్నా (Blood Pressures) ఆవు వీపుపైన, మెడపైన, ప్రతిరోజు 15,20 నిమిషాల పాటు చేతితో నిమరడం వల్ల రక్తపోటు మామూలు స్థితికి వస్తుంది. ముఖంపైన, తలలో ఏదైనా ఇబ్బంది ఉంటే ఆవుతోకను కొన్ని నిమిషాలు అలా ముఖంపైన, తలపైనా త్రిప్పుకుంటే ఆ ఇబ్బంది తొలగిపోతుంది. పోకచెక్కంత ఆవుపేడలో 100 గ్రాముల గోమూత్రం బాగా కలిపి ముద్ద చేసి, దానిని స్వచ్ఛమైన గుడ్డలో వడపోసి ఉదయం సాయంత్రం పరకడుపున త్రాగితే గొంతు క్యాన్సర్ రోగులకు ఎంతో మేలు కలుగుతుంది.

నిజానికి ఔషధాలుగా గోమూత్రము, గోమయముల ఉపయోగం, వాటి ప్రాముఖ్యతలపై ఎన్ని పుస్తకాలైనా వ్రాయవచ్చు.

## గోఆధారిత మందులు

ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి, ఆవు మూత్రం, ఆవు పేడ. ఈ అయిదింటిని సమభాగములుగా కలుపుటనే
పంచగవ్యము అంటారు.

**ఈ పంచగవ్య సేవనము అనేక రోగములలో హితకరమైనది. ప్రత్యేకించి**

1. అపస్మారం (epilepsy)
2. శోధ (swelling)
3. కామెర్లు (jaundice)
4. దగ్గు (cough)

Indian Institute of Chemical Technology-Hyderabad వారి సంస్థలో మరియు గోవిజ్ఞాన్ పరిశోధనా కేంద్రం, దేవలాపార్, నాగపూర్ వారిచే తయారు చేయబడిన ఔషధములయొక్క రసాయనిక విశ్లేషణము(Chemical Analisation) చేయుట వలన లభించిన విస్పష్టమైన గుణధర్మములు:

**1. అష్టమంగళ ఘృతం:** పిత్తకఫవాతహరము, మధురము, ఆమ్లము, తిక్తము, కటు, కషాయము, గ్రహణీహరము, జీవనీయము, బృంహణము, రసాయనము, ఆమహరము, ప్రమేహహరము, లేఖనము, మేధ్యము.

**2. కాంధేను దంతరక్షక్ చూర్ణము (పండ్లపొడి):** పిత్తకఫవాత హరము, ఆమ్లము, తిక్తము, కటు, కషాయము, ప్రమేహ హరము, లేఖనీయము, సంధానీయము, రసాయనము, క్రిమిహరము, యకృత్ రక్షకము.

**3. కామధేను హర్డే చూర్ణము:** పిత్త కఫవాత హరము, మధురము, ఆమ్లము, లవణము, తిక్తము, కటు, గ్రహణీహరము, రసాయనము, జీవనీయము, దీపనము, లేఖనము, యకృత్ రక్షకము, శూలహరము, క్రిమిహరము.

**4. కామధేను గోచాత్ర అర్క్:** త్రిదోషహరము, ప్రమేహహరము, క్రిమిహరము, శూలహరము, రసాయనము.

**5. కామధేను అర్క్:** మేదోహర అర్కము, త్రిదోషహరము, శూలహరము, రసాయనము, యకృత్ రక్షకము, ప్రమేహ హరము.

**6. కామధేను ఘనవటి:** పిత్తవాతహరము, రసాయనము, స్తంభనము, రక్తశుద్ధికరము, క్రిమిహరము, యకృద్రక్షకము, శూలహరము.

**7. కూష్మాండావలేహ్యము:** పిత్త, కఫ, వాతహరము, ప్రమేహ హరము, శూలహరము, మేధ్యము, యకృత్ రక్షకము, క్రిమిహరము.

**8. పంచగవ్య ఘృతము:** త్రిదోషహరము, క్రిమిహరము, వృష్యము, గ్రహనీహరము, లేఖనము, రసాయనము, మేధ్యము, శూలహరము.

**9. కామధేను కేశ్ నిఖార్:** పిత్తహరము, కఫవాతహరము, లేఖనము, పూలహరము, యకృత్రక్షకము, రక్తశుద్ధికరము, శీతవీర్యము, స్తంభనము.

**10. కామధేను శ్విత్రనాశకవటి:** పిత్త, కఫ వాతహరము, ప్లీహఘ్నము, దీపనము, లేఖనము, రోపణము, రసాయనము, జీవనీయము, క్రిమిహరము, రక్తశుద్ధికరము.

**11. కామధేను శ్విత్రనాశక లేపము:** పిత్త, కఫ, వాత హరము, ప్లీహఘ్నము, దీపనీయము, లేఖనము, రోపణము, రసాయనము, జీవనీయము, క్రిమిహరము, రక్తశోధకము.

**12. జాత్యాది ఘృతము:** కఫ, వాత, పిత్తహరము, క్రిమిహరము, శూలహరము, మేదోహరము, లేఖనము, దీపనము, యకృత్ రక్షకము, బిగదీసుకొనియుండుట తగ్గించును, రక్తశోధకము, రోపణము, ప్రమేహ హరము.

**13. అర్శోహర మర్హమ్:** పిత్త, కఫ, వాతహరము, సంధానీయము, శూలహరము, రోపణము, రసాయనము, జీవనీయము.

**14. గోమయాది తైలము:** నాసిక మరియు చెవికి సంబంధించిన వ్యాధులకు గుణప్రదము, కఫపిత్తవాతహరము, భేదనము, లేఖనము, రసాయనము, శూలహరము.

**15. గోమూత్ర ఆసవము:** త్రిదోషహరము, ముఖ్యముగా పిత్తహరము, ఎక్కువ ఉపయోగించుట వలన పిత్తవృద్ధి కరము, శూలహరము, సంధానకరము, పృష్యము.

**16. విభీతకావలేహ్యము:** త్రిదోషహరము, ముఖ్యముగా పిత్తహరము, శూలహరము, సంధానకరము, వృష్యము, ప్రమేహహరము.

**17. మేదోహర అర్కము:** త్రిదోషహరము, ఎక్కువగా ఉపయోగించుట వలన వాత వృద్ధికరము, లేఖనీయము, సంధానకరము, ఆమహరము, శూలహరము, కామలా- పాండుహరము.

**18. హింగ్వాది ఘృతము:** కఫవాతపిత్తహరము, లేఖనము, రసాయనము, బృంహణము, జీవహరము, అమహరము, శూలహరము, వృష్యము, శ్వేతప్రదరఘ్నము, కృమిహరము.

**19. కామధేను సబ్బు:** కఫపిత్తవాతహరము, శోధనము, రసాయనము, మేదోహరము, భేదనము, క్రిమిహరము, ఆమహరము.

**20. కామధేను నలుగుపిండి:** ఎక్కువగా ఉపయోగించుటవలన పిత్తవాత వృద్ధికరము, కఫపిత్తవాతహరము, కఫశోధనము, రసాయనము, క్రిమిహరము.

## వ్యాధుల నివారణలో గోమూత్ర వినియోగము - వైద్యుని నివేదిక

**డా॥ అశోక్ కుమార్**

**(ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్, కన్సల్టెంట్, లెక్చరర్ - ఆచార్య తులసీ, రీజినల్ క్యాన్సర్ ట్రీట్‌మెంట్ & రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, యస్.పి.మెడికల్ కాలేజ్ & హాస్పిటల్, బికనేర్, రాజస్థాన్)**

మానవ సంబంధిత వ్యాధుల చికిత్సలో, మందులు, శస్త్ర చికిత్సలతో యాంత్రిక, భౌతిక పద్ధతులను ఉపయోగిస్తారు. అల్లోపతి, ఆయుర్వేదం, హోమియోపతి మరియు యునాని విధానాలలో మందులను వాడతారు.

అల్లోపతిలో రసాయనాలను శుద్ధ రూపంలో వాడతారు. మానవ శరీర మనుగడలో కోట్లాది కణాలు పనిచేస్తాయి. వీనిలో ఏదైనా అసంతులనము ఏర్పడితే వ్యాధులు వస్తాయి. రసాయన మందులు అ అసంతులనాన్ని సరిచేస్తాయి. కాని వీటి రసాయన ప్రవృత్తి కారణంగా శరీరంలో ఇతర భాగాలపై వికార ప్రభావమేర్పడి మందుల వల్ల దుష్ఫలితాలు (Side Effects) సంభవిస్తాయి.

చాలా అల్లోపతి మందులు ప్రకృతి సిద్ధ పదార్థముల నుండి గ్రహింపబడతాయి. ఆ పిదప వానిని కృత్రిమంగా తయారు చేస్తారు. ప్రకృతి సహజమైన మూలికలతో కలిసి ఉన్నప్పుడు శరీరానికి ఎటువంటి హానీ కలిగించకుండా పనిచేస్తాయి. వీనిలో కొన్నింటికి శరీర వ్యవస్థను నిరుత్సాహపరిచే గుణముంటే, కొన్నింటికి ఉత్ప్రేరక గుణముంటుంది. మరికొన్నింటికి తటస్థీకరించే గుణముంటుంది. చివరిగా మానవ శరీరంలోని సమగ్రత ప్రభావంచే, ఏ వికారమూ లేకుండానే ఈయవలసిన ఫలితాలనిస్తాయి. ఆ విధంగా మందుల రసాయనిక మరియు వ్యాతులపై ప్రభావము పడేవిగా ఉంటాయి. కాని శరీరంపై అనేక దుష్ఫలితాలనిస్తాయి. వ్యాధుల ఆధ్యాత్మిక, భావాత్మక గుణాలపై ఈ రసాయన మందుల ప్రభావముండదు. ఒక రోగికి చికిత్స చేస్తున్నప్పుడు పై వాటన్నింటిని దృష్టిలో ఉంచుకోవలసి ఉంటుంది.

గోమూత్రము (భారతీయ సంతతికి చెందిన గోవు మూత్రము)ను పురాతన కాలమునుండి ఔషధంగా వాడారు. దీనిని 'అమృతము'తో పోల్చారు. (10-15 ఋగ్వేదము). సుశ్రుత సంహితలో దీని ఔషధ గుణములను వర్ణించారు (సుశ్రుత సంహిత 45/221). చరక సంహిత (శ్లోకం 100)లో మానవ వ్యాధుల చికిత్సలో గోమూత్ర గుణములను

వర్ణించారు. దీనికి గల గాయములను నిర్మూలించే గుణమును 'శాలిగ్రామ నిఘంటువు'లో వర్ణించారు. మూత్ర పిండములపై, గుండె రుగ్మతలపై, పేగుల రుగ్మతలపై, పసరిక (Jaundice)లకు, రక్తలేమికి, చర్మవ్యాధులకు, క్రిమినాశక ఔషధములకు (Anti-biotics), విలీన గ్రంథుల వ్యాధులకు (Endocrine Diseases) మొదలైన అనేక వ్యాధుల చికిత్సలో గోమూత్ర ప్రభావాన్ని అనేక ఆయుర్వేదగ్రంథాలలో ఉటంకించారు.

రసాయన విశ్లేషణము ద్వారా గోమూత్రములో గల వివిధ అంశాలను గుర్తించారు. కేవలం భారత సంతతి గోవు మాత్రమే ఆరోగ్యానికి మేలైనది. దీనిలోని ప్రధాన అంశములు మాంసకృత్తులు, యూరియా, యూరిక్ ఆసిడ్, క్రియేటినైన్, ఫీనాల్ మరియు దాని ఉత్పత్తులు, ఆరోమెటిక్ అమైనో ఆసిడ్, విటమిన్లు, యాంటీ ఆక్సిడెంట్లు, ఎంజైములు (LDH, AIL/ ఆసిడ్ ఫాస్పటేజ్, అమైలేజ్, యూరియేజ్ మొ॥వి) ధాతువులు / సూక్ష్మ మూలకాలు కాల్షియం, ఫాస్ఫోరస్, బంగారము, హార్మోన్లు మరియు దీని ఉత్పత్తులు - ఇవన్నియు జీవరసాయన క్రియలలో చురుకుగా పని చేస్తుంటాయి.

పైవానికి వ్యాధుల నిర్మూలనలో, చికిత్సలో వివిధ రకాల పాత్ర ఉంది. గోమూత్రాన్ని ఉన్నది ఉన్నట్లుగా వాడినప్పుడు పైవాని సమగ్ర ప్రభావము కనబడింది. గోమూత్రానికి గల రసాయన చర్యల వలన, దీని ఉపయోగము గూర్చిన పురాతన చరిత్ర వలన దీని "అర్క"కు యాంటీ బయాటిక్‌గా, జీవ వికాస వస్తువుగా, క్రిమినాశినిగా, క్యాన్సర్ విరుగుడుగా, పోషక విలువలు గలదిగా, డిఎన్ఏ ను ఆక్సిడెంట్‌ల హాని నుండి రక్షించేదిగా గోమూత్రానికి అమెరికా పేటెంట్ లభించింది.

## ప్రధాన పదార్ధము (సాధన వస్తువు) - పద్ధతి

ఒక ఆరోగ్యమైన గోవును తీసుకుంటారు. దాని రక్తము, మూత్రము, పేడల పాథాలాజికల్ పరీక్ష చేసి ఏ విధమైన జబ్బు లేనిదిగా గుర్తిస్తారు.

వ్యాధి గ్రస్తగోవును పరిశోధనకు తీసుకోరు. లోహరహిత పాత్రలో గోమూత్రాన్ని సేకరిస్తారు. 8 పొరలు గల గుడ్డతో వడబోసి ప్రయోగశాలకు పంపిస్తారు. గోమూత్ర సేవనానికి ముందు మరియు పిదప కనీసము 1/2 గంట వ్యవధిలో ఏ ఆహారమూ తీసుకోరాదు. మొదటి వారం 50 మి.లీ. ఉదయం, 50 మి.లీ. సాయంత్రం, ఆ పిదప రెండవవారం 100 మి.లీ. తీసుకోవాలి. దీనిని నియమితంగా చాలా రోజులు తీసుకుంటూ ఉండాలి. మొదట్లో వాంతిగా, త్రేన్పులు కలగవచ్చును. కాని ఇవి ఓర్చుకునేవిగానే ఉంటాయి. ఒక వారం రోజులలో ఈ అరుచి దానంతటదే తగ్గుతుంది. చాలావరకు ఇవి మానసికంగా, వాసన మరియు రుచి కారణంగా అయిష్టత కలిగిస్తాయి. సరియైన వివరణ, ప్రోత్సాహం ఇవ్వటంతో రోగులు చికిత్సకు అలవాటు పడతారు.

## సాధారణ జబ్బులకై అప్పుడే సేకరించిన గోమూత్ర సేవనం ద్వారా ఫలితాలు

1. **దీర్ఘకాలంగా మూత్రపిండాలు పనిచేయకపోవుట :** 27మంది రోగులపై పరిశోధనలు జరిగాయి. వీరిలో 15గురు రోగనిరోధక శక్తి లేనివారు, 12 మంది మధుమేహ వ్యాధగ్రస్తులు. వీరంతా వారానికి 3 సార్లు డయాలసిస్ పై ఉన్నారు. వారి బ్లడ్ యూరియా (Blood Urea) 150-170 మి.గ్రా. మరియు Creatinine 0.5-14.5 మి.గ్రా.గా డయాలిసిస్‌కు పూర్వము ఉండినది. 3 నెలల గోమూత్ర సేవనం పిదప వారానికి రెండు సార్లు డయాలిసిస్ సరిపోయింది. పది నెలల పిదప వారానికి ఒకసారి డయాలిసిస్ సరిపోయింది. వారి బ్లడ్ యూరియా 70-90 మి.గ్రా.%, Serm Creatinine 4.9 మి.గ్రా.%కు చేరింది.

9 మైక్రో గ్లాబ్యులిన్ కేసులలో (7గురు డయాబెటిక్ మరియు 2 డయాబెటిక్ కాని వారు) 5 నెలలు గోమూత్ర సేవనంతో వారి మూత్రంలో మైక్రోగ్లాబ్యులిన్ మాయమైంది. 7గురు మూత్రపిండ నాళంలో రాళ్ళు (1 సెం.మీ. కన్నా తక్కువ పరిమాణము) ఉన్నవారు 1-2 నెలల గోమూత్ర సేవనంతో రాళ్ళు చిన్న చిన్న ముక్కలుగా విడిపోయి మూత్రం ద్వారా పడిపోయినవి.

**2. మధుమేహము (డయాబెటిస్) :** మొత్తం 32 మంది రోగులు నమోదు చేయించుకున్నారు. వీరిలో 13 మంది ఇన్సులిన్‌ను, 19 మంది మాత్రలను వాడుతున్నవారు. 4 నెలల గోమూత్ర చికిత్స పిదప వారు తమ సహజ జీవనశైలి, ఆహార నియమాలతో వారు తీసుకునే ఇన్సులిన్ మరియు మాత్రల మోతాదు 50% తగ్గింది. మరియొక 4 నెలల పిదప మొదటి మోతాదుకు 75%కు తగ్గింది.

ఇన్సులిన్ మరియు మాత్రల సేవనంతో 20-25 సంవత్సరాల నుండి డయాబెటిస్‌తో బాధపడుతున్న 45 మంది రోగులలో 21 మందికి గోమూత్ర సేవనముతో డయాబెటిస్ యొక్క చెడు లక్షణాలు సోకలేదు. (ఉదా॥ డయాబెటిక్ న్యూరోపతి, రెటినోపతి, న్యూరోపతి) మయొకార్డియల్ ఇన్ఫార్క్షన్ (Myocardial Infarction - గుండె కండరాలకు రక్త సరఫరా ఆగిపోవుట) కూడా రాలేదు. కాగా మిగతా 24 మంది రోగులలో ఇద్దరికి నెఫ్రోపతి, ముగ్గురికి రెటినా (కంటి వెనక భాగము)లో మార్పులు, ఐదుగురికి నరాల సంబంధిత మార్పులు వచ్చినవి. ఇద్దరికి స్వల్పంగా మయోకార్డియల్ ఇన్‌ఫార్క్షన్ వచ్చింది. విశేషమేమంటే ఇదంతా వారు తమ యాంటీ బయోటిక్ మందులు సక్రమంగా వాడుతూ వారి బ్లడ్ షుగర్ లెవల్ సరిగా ఉన్ననూ సంభవించాయి. ఇటువంటి దుష్ఫలితాలు సాధారణంగా మధుమేహ

బాధితులలో కనిపిస్తాయి. గోమూత్ర సేవనము ఈ సమస్యలన్నింటినీ దూరము చేసింది.

3. **గుండె వ్యాధిగ్రస్తులు :** 11మంది రోగులు తమ గుండె ఎడమ బాగాన 85%-95% కారొనరీ ధమని అడ్డంకితో మమ్ము సంప్రదించారు. వారందరూ కారొనరీ బైపాస్ సర్జరీ చేయించుకొనమని సలహా పొందినవారే. వారు ఆ సర్జరీకి ఒప్పుకోలేదు. వారికి గోమూత్ర చికిత్స ప్రారంభించాము. 9-10 నెలల పిదప వారి ఆంజియోగ్రాఫ్ 75% నుండి 85%కు చేరింది. అనగా 5%-15% అడ్డంకి తొలగించబడింది. దీనితో గుండె ఇంకా మెరుగ్గా రక్త సరఫరా చేయగలిగింది.

మా వద్దకు వచ్చిన 16మంది రోగులు హైపర్ కొలెస్టెరోలిమియా (Hyper Cholesterolemia-300 మి.గ్రా. కన్న ఎక్కువ)తో భాదపడుతున్న వారికి గోమూత్ర చిక్సిత పిదప అందరూ 225 మి.గ్రా% కన్న తక్కువకు చేరుకున్నారు. ఎస్సెన్ష్యల్ హైపర్ టెన్షన్ గల 24 మంది రోగులు (160-180 mm Hg సిస్టోలిక్ మరియు 90-100 mm Hg డయాస్టోలిక్) గోమూత్రమును 4-5 నెలలు వాడిన పిదప 130-140 mm Hg సిస్టోలిక్ మరియు 80-84 mm Hg డయాస్టోలిక్ కు చేరుకున్నారు. గోమూత్రం సేవించిన 1/2 గంటకే 16-30 mm Hg సిస్టోలిక్ ప్రెషర్ తగ్గినట్లుగా గమనించాము.

4. **క్యాన్సర్ :** Stage IV క్యాన్సర్‌తో బాధపడుతున్న 77 మంది రోగులు నమోదు చేయించుకున్నారు. వీరంతా రేడియో థెరపీకి, కీమోథెరపీకి ఒప్పుకోలేదు. వీరికి గోమూత్ర చికిత్స ఇవ్వబడింది. అదే అవయవాలకు, వయస్సు Tumor grade యొక్క వికారాన్ని అనుసరించి

ఎవరైతే రేడియోథెరపీ, కీమోథెరపీ తీసుకున్నారో, వారికన్న గోమూత్రం వాడినవారు మంచి జీవనం గడుపుతూ 6 నెలల నుండి 12 నెలల జీవించారు. వారికి సహకార పరిచర్యలే అవసరమైనాయి. వారు ఆధ్యాత్మికఆనందంతో ప్రశాంతజీవనం గడిపారు.

Stage II,III క్యాన్సర్ గల 221 మంది రోగులు కీమోథెరపీకి ($D_{12}D_{21}$ Protocal, 3,4 cycle) ఒప్పుకున్నారు. వారికి గోమూత్ర చికిత్స కూడా తీసుకోమని సలహా ఇవ్వబడింది. వీరి పై 'కీమోథెరపి' యొక్క దుష్ఫలితమైన ల్యేకోపీనియా, త్రాంబోసైటోపీనియా, మరియు ఎనీమియాలు పరిశీలించబడ్డాయి. గ్రేడ్ I మరియు II లో స్థిరంగా ఉన్నది. కంట్రోలు గ్రూపులో III మరియు IV గ్రేడుగా ఉన్నవి. అనగా గోమూత్రం సైటోటాక్సిక్ మందుల విషప్రభావాన్ని తగ్గించింది.

160 మంది రోగలు రేడియోథెరపీ వారు గోమూత్ర సేవనానికి ఒప్పుకున్నారు. రేడియేషన్ ద్వారా కలిగే దుష్ఫలితాలైన చర్మ వికారాలు, Mucositis, Cystilis, Proctitis లను ప్రధానంగా గ్రేడ్ II మరియు III చూడటమైనది. ఇదే కంట్రోల్ గ్రూపులో అవి గ్రేడ్ III మరియు IV. ఆలస్యంగా వచ్చే రేడియేషన్ ప్రభావం స్టడీ గ్రూపులోXerostomia అన్ననాళిక అడ్డంకిగా ఉన్నది.

**5. చర్మవ్యాధులు :** 'సొరియాసిస్' బాధితులు (చర్మరోగబాధితులు) 11 మందికి గోమూత్రమును 6-7 నెలలు వాడగా దాదాపు పూర్తిగా నయమైంది. బొల్లి వ్యాధి గల 8మంది రోగులకు గోమూత్రం 4నెలలు ఇవ్వగా వారి చర్మం ఎర్రబడి, 6-8 నెలల పిదప దాదాపు మామూలు చర్మమైంది. 5గురు Allergic skin disorder గలవారు 3-4 నెలలు గోమూత్రసేవనంతో బాగుపడినారు.

**6.** **ఇతరములు :** ఇద్దరు హెపటైటిస్ B Positive రోగులు 1 సంవత్సరంపాటు గోమూత్ర సేవనంతో అవలక్షణాలు తగ్గి, Hbs ag titer వృద్ధికి సహకరించింది. 4గురు HIV +ve (Aids) వారికి అవలక్షణాలు బాగా తగ్గి, వైరల్ కౌంటు తగ్గి CD-4 కౌంట్లు పెరిగాయి. 7గురు "రిమాటిక్ ఆర్థరైటిస్" రోగులు స్టీరాయిడ్ చికిత్స, సైటోటాక్సిక్ Methotrexate చికిత్స పైనున్నవారికి గోమూత్ర సేవనం 3 నెలల వాడకంతో వారు వాడే మందుల మోతాదు 50%నికి తగ్గింది. 6 నెలల పిదప వారు వాడే Steroid ఆపివేయబడింది. నొప్పి తగ్గింది. Rh Factor మరియు Titer కూడా తగ్గింది.

**ముగింపు :** ఆయుర్వేద చరక, సుశ్రుత సంహితలలో అనేక పురాతన వాఙ్మయంలో వర్ణించిన గోమూత్రం వ్యాధుల నిర్మూలనకు, చికిత్సకు ఉపయుక్తమైనది. గోమూత్ర చికిత్స తక్కువ ఖర్చుతోను, గ్రామాలలో వెంటనే లభించేదని మా అనుభవం. కనుక గోవును ఒక సంచార ఔషధాలయంగా పిలవాలి.

అత్యవసర పరిస్థితులలో అవసరంకొద్ది అల్లోపతి చికిత్స చేయవచ్చును. గోమూత్రం వ్యాధుల నిర్మూలనం మరియు చికిత్సలో సమగ్రతను కలిగి ఉన్నది. ఇది ఒక సమగ్రమైన చికిత్స మరియు సంపూర్ణ చికిత్సావిధానం. జీవకణముపై Molecular & Microscopic ప్రభావాలను ఇంకా పరిశోధన చేయవలసి ఉన్నది. చాలా క్లినికల్ అధ్యయనాల అవసరమున్నది. ఆరోగ్యానికి గోమూత్ర వాడకం గూర్చిన అధ్యయనాన్నిRandamized, Plaecho Control, Multi Centric, Blind Studies లను ఇంకా కొనసాగించాలి.

## గోమాత అంటున్నది!

ఔను, ఇది ముమ్మాటికీ నిజం! నేను ఏ భేదభావం లేకుండా మనుషులందరికీ బుద్ధిని-బలాన్ని, ఆయురారోగ్యాలను, ఐశ్వర్యాన్ని,

సుఖసమృద్ధులను, కీర్తిప్రతిష్ఠలను ప్రసాదిస్తాను. ఈ అవగాహనతో, అనుభూతిని పొందగలిగిన వారందరూ "నన్ను" అమ్మా! అని పిలుస్తారు. నేనూ వారిని అలాగే నా బిడ్డలుగా భావిస్తాను, ప్రేమిస్తాను. తల్లిని సేవించడం, రక్షించడం, ఆమె కంటి నీరు తుడవడం బిడ్డల కర్తవ్యం కదా! మరి బిడ్డలకోసం నా జీవితాన్ని ధారపోస్తూ, అనాదిగా విశ్వకళ్యాణానికే అంకితమై నా కర్తవ్యాన్ని నేను పాటిస్తూనే ఉన్నాను.

అందుకు మీరంతా నన్ను "విశ్వ జననీ" అని సంబోధిస్తారు. ధర్మయుగం, విజ్ఞానయుగం – ఏ యుగంలోనైనా నా ఈ కర్తవ్యం నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది.

నా బిడ్డలు నన్ను ప్రేమించినా, బాధించినా, పట్టనట్లు నటించినా నేను మాత్రం నా బిడ్డలను ప్రేమిస్తూనే ఉంటాను. పాలు, పెరుగు, నేయి రూపంలో అమృతాన్ని అందిస్తూంటాను. వీటి సేవనంవల్ల నా బిడ్డలు సర్వగుణ సంపన్నులవుతారు. నా మూత్రం, పేడ రూపంలో మనుష్య జాతికి మందులను, భూదేవికి ఎరువులద్వారా ఉర్వరాశక్తిని, సస్యలక్ష్మికి క్రిమికీటక నియంత్రకాలను అందిస్తాను. ఉదరపోషణకై మీరు నిర్వహించే వ్యవసాయానికి అనుకూలమైన సాధనాలుగా నా ముద్దు బిడ్డలైన కోడెలు, ఎద్దులను మీకు సమర్పిస్తాను. నా ఊపిరి గాలులు – ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో మీ చుట్టూరా ఉండే వాతావరణాన్ని శుద్ధీకరిస్తాను. నా చరణ స్పర్శతో ధూళి కణాలను సైతం పవిత్రంగాను, శక్తిసంపన్నంగాను మారుస్తాను. నా ఉత్పత్తుల మూలంగా నిర్మితమయ్యే 'పంచగవ్యం' మీకు ఒక అద్భుతమైన వరం. సర్వశక్తివంతమైన రసాయనం. మీ ప్రాణశక్తికి ఒక కవచం.

బిడ్డలారా! నన్ను నా ఉపయోగాన్ని అర్థం చేసుకున్నవారే నా సేవలో నిమగ్నులవుతారు. ఆ అదృష్టవంతులే అమృతతుల్యమైన ఆనందాన్ని

అనుభవిస్తారు. అట్టి వారందరికీ నేను ఎల్లప్పుడు కామధేనువును. ప్రియమైన గోమాతను!

ఆ... వారు మీరే ఎందుకు కాకూడదు?

**జై గోమాత – జై భారత్ మాత**

## అనుబంధం

భారతదేశంలోని ప్రసిద్ధమైన ప్రయోగశాలల్లో గోవిజ్ఞాన్ అనుసంధాన్ కేంద్రంయొక్క సహకారము మరియు సంపర్కములతో చేయబడుచున్న పరిశోధనకార్యంయొక్క విస్తృతమైన వివరణ.

1. **National Environmental and Engineering Research Institute, Nagpur :** Effect of Kamdhenu Ark as antioxidant on chromosomal aberration. Basic analysis of Gomutra tracing of inorganic elements.

2. **Central Institute of Medicinal and aromatic plants, Lucknow:** Study on Kamdhenu Ark for anti cancer property. Fortification of wormy compost and cow urine.

3. **National Botanical Research Institute, Lucknow :** Study on Kamdhenu Pest Repellent, Amrut Pani and Sahiwal Cow Milk.

4. **Indian Institute of Chemical Technology, Hyderabad :** Interpretation of Chromatographic fingerprints of Panchagavya medicines. Standardisation of drugs, Shelf life keeping qualities.

5. **Indian Agricultural Research Institute, New Delhi :** Study of Kemdhenu Pest repellent under integrated pest management system.

